# పునర్మూల్యాంకనం

(సాహిత్య వ్యాసాలు)



దార్ల వెంకటేశ్వరరావు






# పునర్మూల్యాంకనం

## (సాహిత్య వ్యాసాలు)

దార్ల వెంకటేశ్వరరావు




ప్రచురణ

సొసైటీ అండ్ ఎడ్యుకేషన్ ట్రస్టు,

హైదరాబాదు

14 ఏప్రిల్ 2010

మొబైల్ యాప్: 2016







**punarmulyankanam**(sahitya vyasalu)

by Dr.Darla Venkateswara Rao
Assistant Professor,
Dept. of Telugu, School of Humanities,
UNIVERSITY OF HYDERABAD,
(Central University)
Gachibowli, Hyderabad-500 046.,
Andhra Pradesh, India

First Edition: 2010
Revised Edition: 2016 (Mobile Apps)

Copies: 500.Price: Rs. 75/-

**ISBN : 978-81-908963-1-3**

**For comunication :**
B- 202, Sai Cluster Apartment
Sivajinagar Colony, SeriLingampally,
Taranagar (mandal & Municipality)
Hyderabad- 500 019., A.P., India.

Dr. Darla Ravi Kumar, Telugu Pandit,
Cheyyeru Agraharam,
Via: Anathavaram (S.O.), E. G. Dist-533 222.

**Books available at:**
visalandhra, Navodaya, Prajasakthi
& leading Book Stalls,
www.vrdarla.blogspot.com,
Google Play Store
**Published by :**
Society and Education Trust, Hyderabad.
**Cover Design**: P.V. V. S. Kiran Kumar
*Printed at* : Prajasakthi Press, Hyderabad.
Mobile Apps: Mr. K.Ramesh (9494249878)







# విషయ సూచిక





# కృతజ్ఞతలు


ఈ పుస్తకంలోని చాలా వ్యాసాలు వివిధ విశ్వవిద్యాలయాల్లో జరిగిన సదస్సుల్లో సమర్పించినవి. అలా నా ఆలోచనలను విద్యార్థులు, అధ్యాపకులు, రచయితలతో పాలు పంచుకోవడానికి అవకాశం కలిగించిన వారికీ,

త్రీ చీర్స్...! పేరుతో లోతైన ముందుమాట రాసి ఆశీర్వదించిన ప్రముఖ విమర్శకుడు, కవి, మా తెలుగు శాఖ అధ్యక్షులు ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గారికీ,

ఎదురుచూపు ... పేరుతో పుస్తకానికి విశ్లేషణాత్మకమైన పీఠిక రాసిన ప్రముఖ పరిశోధకురాలు ఆచార్య జి. అరుణకుమారి గారికీ,

నా కృషిని కొనసాగించమని వెన్నుతట్టి ప్రోత్సహించే ఆచార్య పరిమి రామనరసింహం, ఆచార్య శరత్ జ్యోత్స్నారాణి, ఆచార్య ఎన్.ఎస్.రాజు, ఆచార్య తుమ్మల రామకృష్ణ గార్లకు, ఇతర అధ్యాపక వర్గానికీ ధన్యవాదాలు.

దీనిలోని వ్యాసాలన్నీ వివిధ పత్రికల్లో, ప్రత్యేక సంచికలు, పరిశోధన పత్రికల్లో ప్రచురితమైనవే. అలా ప్రచురించిన విశాలాంధ్ర, సూర్య, తెలుగు వైజ్ఞానిక త్రైమాసిక పత్రిక, వాఙ్మయ త్రైమాసిక పత్రికల సంపాదక వర్గ సభ్యులకు నా కృతజ్ఞతలు.

హైదరాబాదు విశ్వవిద్యాలయం, ఆంగ్ల శాఖ అధ్యాపకులు ఆచార్య అల్లాడి ఉమ, ఆచార్య ఎం. శ్రీధర్, ఆచార్య సునీతా రాణి గార్లకు, నన్నెప్పుడూ ప్రోత్సహించే ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారిగారికీ, రచయిత్రి పుట్ల హేమలత, పొట్టిశ్రీరాములు విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య ఎండ్లూరి సుధాకర్‌గార్లకూ, నా భావాలను వారి పరిశోధన వ్యాసాల్లో, పుస్తకాల్లో పరిచయం చేసే ఆచార్య కొలకలూరి మధుజ్యోతిగారికి, ఆచార్య తుమ్మపూడి భారతి గారికి, డా॥లక్ష్మణచక్రవర్తిగారికి, నాకు అనేక విధాలుగా అందుబాటులో ఉంటూ సహకరిస్తున్న హైదరాబాదు విశ్వవిద్యాలయం, సెంటర్ ఫర్ కంపారిటివ్ స్టడీస్‌లో అసిస్టెంటు ప్రొఫెసర్ డా॥ జె.భీమయ్యగారికీ నాకృతజ్ఞతలు. ఈ పుస్తకానికి అందమైన ముఖ చిత్రాన్ని చిత్రించిన మిత్రుడు





పి.వి.వి.ఎస్.కిరణ్ కుమార్ గారికి, సొసైటీ అండ్ ఎడ్యుకేషన్ సభ్యులు వి. రవికుమార్, డి.శివరామ్ ప్రసాద్‌లకు, పుస్తకాన్ని ప్రచురించిన సొసైటీ అండ్ ఎడ్యుకేషన్ ట్రస్టు, హైదరాబాదు వారికీ నా కృతజ్ఞతలు.

నా ప్రగతికి కారకురాలు, నా రచనలన్నీ పుస్తకరూపంలోకి రావాల్ని తపించే నా జీవిత భాగస్వామి మంజుశ్రీకి అభినందనలు.

దీనిలోని వ్యాసాలన్నీ వివిధ పత్రికల్లో, ప్రత్యేక సంచికలు, పరిశోధన పత్రికల్లో ప్రచురితమైనవే. అలా ప్రచురించిన విశాలాంధ్ర, సూర్య, తెలుగు వైజ్ఞానిక త్రైమాసిక పత్రిక, వాఙ్మయి త్రైమాసిక పత్రిక, ల సంపాదక వర్గ సభ్యులకూ, పాలపిట్ట ప్రచురణల అధినేత, వార్త సీనియర్ సబ్ ఎడిటర్ గుడిపాటి గార్కీ, 'ఇండియా టుడే'లో నా పుస్తకాన్ని సుదీర్ఘంగా సమీక్షించిన అంపశయ్య నవీన్ గార్కీ,

లండన్ విశ్వవిద్యాలయంలో రీసెర్చ్ చేస్తూ నారచనలపై 'వీక్షణం' మాసపత్రికలో మూడు వారాల పాటు ధారావాహితకంగా పరిశోధనాత్మక వ్యాసాలను రాసిన డా॥సాంబయ్య గుండిమెడ గార్కీ, వాటిని ప్రచురించిన 'వీక్షణం' సంపాదకవర్గానికీ,

పుస్తకాన్ని అందంగా ప్రచురించిన ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్, హైదరాబాదు వారికీ నా కృతజ్ఞతలు.

నా పుస్తకాలన్నింటినీ మొబైల్ ఆప్స్ గా ప్రజలకు అందుబాటులోకి తెచ్చిన కొండా రమేశ్ (9494249878)గార్కి ప్రత్యేక కృతజ్ఞతలు.

–దార్ల వెంకటేశ్వరరావు





# మామాట

*సామాజిక పరివర్తనను ప్రగతిశీల దృక్పథంతో వచ్చే సమకాలీన సాహిత్యాన్ని మా వంతు సహాయంగా పాఠకుల ముందుంచే ప్రయత్నంలో భాగంగానే దీన్ని ప్రచురిస్తున్నాం. దీనిలోని విమర్శ వ్యాసాలన్నీ అన్ని వర్గాల ప్రజలను ఆలోచింపజేసేవిధంగా శాస్త్రీయమైన విశ్లేషణతో ఉన్నాయి.*

*విమర్శలో సత్యాన్వేషణ, సత్యాన్ని నిర్భయంగా, స్పష్టంగా ప్రకటించగలగాలి. అది వైయక్తిక, కుల, జాతి, మత, ప్రాంత విద్వేషాలతో కూడి ఉండకూడదు. సాహిత్యం, విమర్శ, సమాజంలో ఉండే అసమానతలను రూపుమాపే చైతన్య వంతమైన ఆలోచనలతో ఉండాలి. అప్పుడది ప్రజల్లో ప్రగతిశీల గుణాన్ని కలిగిస్తుంది.*

*ఇవన్నీ ఈ పుస్తకంలో కనిపిస్తాయి. సమకాలీన తెలుగు సాహిత్యంలో వస్తున్న అనేక కొత్త కొత్త ఆలోచనలను వైయక్తిక ప్రలోభాలకూ లోను కాకుండా చాలా విషయాలపై తన నిర్ణయాల్ని ప్రకటించిన నిరంతర సత్యాన్వేషణశీలి డా॥దార్ల వెంకటేశ్వరరావుగారి 'పునర్మూల్యాంకనం' అనే ఈ గ్రంథాన్ని మీ ముందుంచడానికి సంతోషిస్తున్నాం. మా ఇతర ప్రచురణలను ఆదరించినట్లే దీన్నీ ఆదరిస్తారని ఆశిస్తున్నాం.*

*-పబ్లిషర్స్*

# త్రీ చీర్స్...!

–ఆచార్య బేతవోలు రామబ్రహ్మం,
అధ్యక్షుడు, తెలుగుశాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం

విశ్వవిద్యాలయాల్లో అధ్యాపకులకి కూత ఒక్కటే ఉంటే చాలదు. రాత కూడా ఉండాలి. ఈ రెండింటికీ బలం చేకూర్చే మేత అంతకన్నా తప్పనిసరి. మేత అనే పదానికి రంగాన్ని బట్టి రంగు మారుతుంది. వేరే వేరే అర్థాలూ స్ఫురిస్తాయి. కానీ బోధన రంగంలో మాత్రం ఒక్కటే అర్థం– నిరంతర అధ్యయనం అని. ఇది బోధకుల కూతకీ, రాతకీ బలవర్ధకం. ధైర్యవర్ధకం కూడా ఇదే!

మా దార్ల నిరంతర అధ్యయశీలి. అనారత అధ్యాపన తత్పరుడు. కొత్త కొత్త కోణాలను దర్శించే ప్రతిభ ఆ జన్మ సిద్ధం. డిగ్రీ చదువుల నాటకే ద్వా.నా.శాస్త్రి వంటి గురువులు పాదులు తీసిన కుదుళ్ళు ఉండనే ఉన్నాయి. అందుకని మూడు పువ్వులు ఆరు కాయలుగా సాగుతోంది దార్ల వారి సాహితీ వ్యవసాయం.

ఇది' పునర్మూల్యాంకనం' ఇందులో ప్రతి వ్యాసంలోనూ చాలా స్పష్టంగా కనిపించే గుణాలు మూడు. అధ్యయనం–దర్శనం–ధైర్యం. విపులీకరిస్తే ఈ ముందుమాట పుస్తకమంత అవుతుంది. అంత అవసరమూలేదు. పాఠకులు గుణ గ్రహణ పారీణులు. అందుకని ఉభయతారకంగా త్రీచీర్స్...! సెలవు

మీ

(బేతవోలు రామబ్రహ్మం)

14.04.2010)

# ఎదురుచూపు...!

–ఆచార్య జి. అరుణ కుమారి
తెలుగు శాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం

దార్ల వెంకటేశ్వరరావుగారు హైదరాబాదు విశ్వవిద్యాలయంలో ఎం.ఏ., విద్యార్థిగా పరిచయం. ఆనాటి నుండీ నా దృష్టిలో దార్ల నిత్యపరిశోధకుడు. చిన్న వయసులోనే కవి, విమర్శకులుగా గుర్తింపుతెచ్చుకున్నారు. గుర్తింపు కోసం గుర్తింపు తెచ్చుకునే వారుంటారు. కాని దార్ల కష్టపడి పైకి వచ్చిన వ్యక్తి. మాతెలుగు శాఖలో వయసులో చిన్నవారైనా వారి సాహిత్య పయనం .... వైపు మరిన్ని వ్యాసాలను ఆహ్వానిస్తూ మా ఎదురుచూపు ఎప్పుడూ ఉంటుంది.

'వీచిక' (తెలుగు సాహిత్య విమర్శ) దార్లకు మంచి పేరు తెచ్చిపెట్టింది. పరిశోధకుడుగా ఆచార్య పింగళి లక్ష్మీకాంతం, భౌతిక వాస్తవిక దృష్టితో విశ్లేషించిన కులవృత్తి కథ, దళిత సాహిత్యంలో మౌలిక భావనలు మొదలైన వ్యాసాలు వీచిక పుస్తకంలో చెప్పుకోదగినవి.

విమర్శకు కొన్ని సూత్రాలున్నాయి. వాటిని ఆకళింపు చేసుకోవటానికి కావలసిన మార్గాలు దార్ల వెంకటేశ్వరరావు రచనల్లో కనిపిస్తాయి. వివిధ పత్రికల్లో రాసిన వ్యాసాల్ని ఇటీవల "పునర్మూల్యాంకనం" పేరుతో ప్రచురించారు. ఈ వ్యాసాల్లో దార్ల స్వీకరించిన వస్తువుని పలు విమర్శలను దృష్టిలో ఉంచుకొని తాను చెప్పదలచిన విషయాన్ని తానే ఓ పాఠకుడిలా ప్రశ్నించుకుంటూ రచయితగా సమాధానాలతో వాటిని పరిష్కరిస్తూ విషయ చర్చ కొనసాగిస్తాడు. ఇది దార్ల వారి రచనా పద్ధతి. మిరియాలు ఎంత ఘాటుగా ఉంటాయో కొన్ని సందరాశేలో వీరి వ్యాసాలు అంత ఘాటుగానే ఉంటాయి. చర్చలకు తావిచ్చే పరిశోధన వ్యాసాలు అందులోనూ విమర్శకు సంబంధించిన వ్యాసాలు కాబట్టి!

అంతవరకు సాహిత్యానికున్న విలువలకు మళ్ళీ విలువ కట్టడాన్ని "పునర్మూల్యాంకనం" అని అనవచ్చు. దీనికే ఇంగ్లీషులో Revaluation అన్నమాట. ఈ గ్రంథంలో మొదటి వ్యాసం సమగ్రాంధ్ర సాహిత్యంలో సాహిత్య యుగ విభజన – ఆరుద్ర భావ పరిణామం. ఆంగ్ల సాహిత్య చరిత్రల్లో యుగ విభజన జరిగినట్లే రాజులను, పోషకులను ఆధారంగా చేసుకొని ఆరుద్ర సాహిత్య చరిత్ర యుగ విభజన చేసాడు. ఆరుద్ర రచించిన సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర పునర్ముద్రణలో చేసిన మార్పులను గుర్తించటం దార్ల తన అధ్యయనంలో ప్రధానాంశంగా భావించారు. నాణాలను సేకరించే అభిరుచి ఉన్నవాడిలా వివిధ ముద్రణలను సేకరించి, ముద్రణకు ముద్రణకు వచ్చే మార్పులను గమనిస్తూ అధ్యయనం చేయడం కూడా పరిశోధనలో భాగమవుతుంది. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యంలో విషయ పరిణామం యుగవిభజన పరంగానే కాదు, కర్తృత్వం విషయంలోనూ చర్చలకు తావిస్తుంది.

ఆంధ్ర వ్మాయ చరిత్రను కవిత్వవేది, భోగరాజు నారాయణ మూర్తి, చిలుకూరి వీరభద్రరావు, వంగూరి సుబ్బారావు,చాగంటి శేషయ్య, ఖండవల్లి లక్ష్మీరంజనం, దివాకర్ల వెంకటావధాని మొదలైన వాళ్ళు రచించిన వేవీ పునర్ముద్రణలో మార్పులను తావివ్వనివి. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం పునర్ముద్రణలో పలు మార్పులకు తావివ్వడం వలన విమర్శకు వస్తువయ్యింది.

"మైనారిటీ సాహిత్యం – మరో చూపు" లో రాజ్యాంగం ప్రకారం హిందువులు తప్ప ఇతరులందరూ జనాభా సంఖ్యలోమైనారిటీలుగా గుర్తింపబడుతున్నారన్నారు. మైనారిటీ అనే పదానికి అర్థాన్ని రాజ్యాంగపరంగా, సాహిత్య పరంగా బేరీజు వేసి అది సమకాలీన సాహిత్యాన్ని గుర్తించగలిగే కొత్త ధోరణి అని వ్యక్తీకరించారు. మైనారిటీ అనేది సంఖ్యావాచకం అనే ద ృష్టితోను, ఒక వర్గ సాహిత్యాన్ని అభివ్యక్తికరించే కోణంలో ఎదుర్కొనే సమస్యల కారణంగాను, స్వేచ్ఛారాహిత్యం వల్లనూ, ప్రజల మానసిక భావన వల్లనూ మైనారిటీ సాహిత్యం అంటే మాదిగ, క్రైస్తవ, తెలంగాణ సాహిత్యాలని పునర్మూల్యాంకన దృష్టితో పరిగణించారు. గ్లోబలైజేషన్, లోకలైజేషన్ అనే

వాటికి తేడా తెలియకుండానే మూసలో పోసినట్టుగా అనేకరచనలు వెలుగులోకి వచ్చాయి.

"భిన్న పార్శ్వాల్లో ప్రపంచీకరణ కవిత్వం" లో ప్రపంచీకరణ నేపథ్యం, దాని మంచి చెడులను ఎంచి చూసారు. *"మా తాత చెప్పులు కుట్టేవాడు .... నేనిప్పుడు కవిత్వం రాస్తున్నాను"* అని దార్ల అనటంలో నాలుగు తరాల దళిత జీవనం కనిపిస్తుంది. కర్మ సిద్ధాంతం ఒక తరం అనుభవిస్తే, తిరుగుబాటు లేనితనం మరో తరమైతే, సంస్కరణ దిక్కుగా ఇంకొక తరం ఎదురు చూస్తే, మరొక తరం అభ్యుదయం వైపుగా పరిణామ దిశను సూచిస్తుంది. భిన్న పార్శ్వాల్లో ప్రపంచీకరణ కవిత్వం ఇంతవరకు వచ్చిన ప్రపంచీకరణ కవిత్వంలో మేలుకన్నా కీడేఅధికంగా ఉందని చూసే పార్శ్వమే కనిపిస్తుంది. కాని దార్ల వ్యాసంలో ప్రపంచీకరణ వల్ల కుల వృత్తులు చేతి వృత్తులుగామారడం గమనించాలన్నారు. కొన్ని వర్గాలకు ప్రపంచీకరణ మేలు కలిగించిందనే పార్శ్వాన్ని చూపిస్తూ కులం,అంటరానితనం ప్రపంచీకరణ వలన పోలేదని చిన్న కుటుంబాలు, వ్యవసాయం, సహజత్వాన్ని పోగొట్టుకున్న పల్లెలు, వైరస్ సోకిన వ్యవస్థ ప్రపంచీకరణ ముసుగులో విద్య... వంటి అనేక పార్శ్వాల్ని పరిశీలించారు.

*'పంచమం'* నవల రెండవ ముద్రణలో ''ముఖచిత్రం'' పై "ఉద్యమాల నేపథ్యంలో తొలి దళిత నవల'" అని ప్రకటించుకోవడం సరైనదవుతుందా అనేది ఈ వ్యాస రచనకు మూలం. వివిధ పరిణామాల్లో వికాసం చెందిన దళిత ఉద్యమ చరిత్రను పరిగణనలోకి తీసుకోవాలి. వచ్చిన సమీక్షలను వ్యాసాలను పరిశోధనలను గమనించి మలి ముద్రణ రూపొందాలనేది రచయిత ఉద్దేశం. తొలి దళిత ఉద్యమ నవలగా కాదు, దళిత ఉద్యమాన్ని వర్ణించిన నవలగా చూడమని పునర్మూల్యాంకన దృష్టితో సూచిస్తున్నారు. ఒక నవల రాజకీయ, సామాజిక అంశాలను అందిస్తున్నప్పుడు ఆ నవలను విలువ కట్టే రీతిలో ప్రతి చిన్న అంశం పరిగణనలోకి వస్తుందనే విషయాన్ని ఈ వ్యాసం ధ్రువ పరుస్తుంది.

హెమింగ్వే రాసిన The Old Man And the Sea నవలలో కథానాయకుడు బెస్తవాడు. "అతడు అడవిని జయించాడు" నవలలోని కథానాయకుడు పందులు మేపుకునే గిరిజనుడు. కుల వ ృత్తులు వేరు. ఒకరిది సముద్రపు వేట. మరొకరిది అడవిలో తప్పిపోయిన సుక్కపంది కోసం వేట. ఈ రెండు నవలల్లో కథాగమనం ఒకటే. మార్పు అంతా నేపథ్యంలోనే ఉంది. దీన్ని అనుసరించే వేట కొనసాగింది. కేశవరెడ్డి అతడు అడవిని జయించాడు నవలలో పరుల ధనాన్ని అపహరించే నక్కలు, రాబందుల బారి నుండి ముసలివాడు తప్పించుకొని సురక్షితంగ ఇంటికి చేరుకుంటాడు. హెమింగ్వే రాసిన "ఓల్డ్ మాన్ అండ్ ది సీ" నవలలో సముద్రంలో షార్క్ చేపలను చంపి తాను పట్టిన 8 అడుగుల చేపను ఆ దాడిలో పోగొట్టుకొని అస్థి పంజరంతో ఒడ్డుకు వస్తాడు. ఈ రెండు నవలల్లోని కథానాయకులిద్దరూ తమసంపదను పోగొట్టుకుంటారు. కాని హెమింగ్వే నవలలో షార్క్ చేపలు ఐదింటిని ( పరుల ధనాన్ని ఆశించే వాటిని ) చంపి – శారీరక పోరాటం కన్నా మానసిక సంఘర్షణలో విజయాన్ని సాధిస్తాడు. అతడు అడవిని జయించాడు నవలలో ముసలివాడు పొందిన త ృప్తి కూడ అదే. ప్రపంచం అనే అడవిలో నక్కలు, రాబంధుల బారి నుండి తన సంపదను పోగొట్టుకొని ఇంటికి చేరుతాడు. దీనిలో Survival of the fittest, Struggle for existence కనిపిస్తుంది. అస్తిత్వ పోరాటంలో బాహ్యా పోరాటమే కాదు, ఆంతంగిక పోరాటంలో గెలిచాననే త ృప్తి రెండు నవలల్లోను కనిపిస్తుంది. మనిషికి సంఘర్షణలోను, అపజయంలోను, మరణంలోను గౌరవం ఉండాలనే సందేశాన్నందిస్తున్నాయి ఈ నవలలు. ఈ రెండు నవలల్లో శిల్ప పరంగానే కాదు, వస్తు పరంగాను సామ్యమున్నది. ఈ కోణంలో పరిశోధన జరగాల్సిన అవసరముంది. అతడు అడవిని జయించాడు నవలలో మానవ జీవితాన్వేషణ తత్వాన్ని , ఇకో టచ్‌డ్ నవల గా ను పరిశీలించడం విశేషం.

"మునెమ్మ" నవలలో మాత ృస్వామ్యంపై పెత్తనం చెలాయించే పితృస్వామిక వికృత రూపంగా కనిపిస్తున్న కోణాన్ని పేర్కొంటు దార్ల మునెమ్మ

లోని శక్తి స్వరూప పార్శ్వాన్ని గుర్తించారు. పశువులలోని సహజ గుణాన్ని వాంఛిత ద ృష్టిగా భావించి కథను నడిపించటం ఈ కథలోని వస్తువు. కల్పితాలను నవలా వస్తువు చేసి మాజిక్ రియాలిజం శిల్పాన్ని అనుసరించినట్టుగా రచయిత ఈ వ్యాసంలో పేర్కొన్నారు.

గంగాధరి శ్రీరాములు అనేక మంచి పాటలు పాడటం నేర్పించి "మాస్టార్జీ" అయ్యాడని మాస్టార్జీ సాహిత్యంలో మట్టిపరిమళాలు లో వివరించారు. కళను బతికించడం కోసం మాస్టార్జీ చేస్తున్న కృషి కొనియాడదగినది. బహుజనులతో  పాటు కష్టపడి పనిచేసే వాళ్ళు కూడా ఈ దేశ మూల వాసులే అనేది మాస్టార్జీ సిద్ధాంతం. దళిత దార్శనికులను తన పాటల్లోస్మరించి, దళితుల్ని మాత్రం పోరాటాలకు ఉసిగొల్పుతున్న కులం వాసన పోని మార్క్సిస్టుల్ని మాత్రమే నిందిస్తూ రచించిన పాటల పరిమళాలను ఈ వ్యాసంలో చక్కగా పరిచయం చేసారు.

దళిత సాహిత్యంలో ప్రయోగంలో ఉన్న పదజాలన్ని గుర్తించి చర్చించవలసిన అవసరం ఉందని "దళిత సాహిత్య విమర్శ –  సాంకేతిక పదజాల నిర్ణయ సమస్యలు"  ఆధునిక సాహిత్య విమర్శలో ప్రవేశించిన నూతన పారిభాషిక పదాలను గమనించవలసిన అవసరం పరిశోధకులకు ఉంది. దళిత కవిత్వంలో నూతన పదకల్పనలను వివేచించిన తీరు బాగుంది. ఒకే అర్థంలో కాక, భిన్నార్థాలలో ప్రయోగింపబడే పదాలు, అవి ఏర్పడే పద్ధతులను వివరించారు. దళిత కవిత్వంలోనూతన పదకల్పనలను సేకరించవలసిన అవసరం ఉంది. ఇది పరిశోధకుల బాధ్యత అవుతుంది.

నవలల్లో, కవిత్వంలో, చరిత్ర యుగవిభజనలో పునర్మూల్యాంకం అవసరమనే కోణంలో తెలుగు సాహిత్యానికి విలువైన విమర్శ వ్యాసాలు దార్ల అందించారు. నిశిత దృష్టితో ఉద్యమాలకు సంబంధించిన నవలలను పరిశీలించవలసిన తీరును, ప్రపంచీకరణ కవిత్వం, మాదిగ సాహిత్యం, గేయం... వీటిలో భావజాలంలో వచ్చిన మార్పులను, ముద్రణకు ముద్రణకు మధ్య ఉన్న తేడాలను గుర్తించవలసిందంటూ సూక్ష్మాంశాలను కూడా

పరిగణనలో తీసుకోవాలనే జాగ్రత్తను సూచించినపద్ధతులు, రచనల్లో భిన్న పార్శ్వాల మూల్యాంకన ఆవశ్యకతను చూపించారు. భిన్న పార్శ్వాల మూల్యాంకన రచనకు పరిపుష్టినిస్తుంది. పరిశోధకులకు ఈ మూల్యాంకన దృష్టి అవసరం.

తెలుగు సాహిత్య వికాసానికి, పరిశోధకులకు అనేక విమర్శ వ్యాసాలను మూల్యాంకన ద ృష్టితో పరిశీలించి అందించి, కొత్త దృష్టిని ప్రసరిస్తున్న దార్ల వెంకటేశ్వరరావు గారిని అభినందిస్తున్నాను. ముందు ముందు విశ్వసాహిత్య విశ్లేషణ  వైపు దృష్టి ప్రసరించాలని ఎదురు చూస్తూ ఈ "పునర్మూల్యాంకనం" పుస్తకం గ్రంథానికి స్వాగతం పలుకుతున్నాను.

***

# పుస్తకనేపథ్యం

సృజన సాహిత్యాన్ని చదువుతున్నప్పుడు వస్తువు, దాన్ని అభివ్యక్తీకరించిన పద్ధతి కొన్ని సార్లు ఆసక్తిని కలిగిస్తుంటుంది. దాన్ని ఇతరులతోనూ పంచుకోవాల్సిపిస్తుంది. విశ్వవిద్యాలయంలో బోధన వృత్తిలో ఉండటం వల్ల వివిధ అంశాల్ని చదివిన వెంటనే వాటిని విద్యార్థులతో పంచుకునే అవకాశం కలుగుతుంది. అదొక విధంగా అదృష్టమనే చెప్పుకోవాలి. కొన్ని రచనల్ని కొంతమందితో చర్చించినప్పుడూ, వాళ్ళకి ఉపయోగాపడతాయని భావించినప్పుడూ లేదా తమ ఆలోచన దృక్పథాన్నే మార్చేశాయని మనస్ఫూర్తిగా ఎవరైనా చెప్పినప్పుడూ చాలా అనందం కలుగుతుంది. ఆలా ఆనందానికి గురిచేసిన వ్యాసాలు దీనిలో ప్రచురిస్తున్నాను.

ఈ పుస్తకంలో ఒకటి రెండు వ్యాసాలు తప్ప మిగిలినన్నీ దళిత సాహిత్యాన్ని పునర్మూల్యాంకనం చేస్తున్నవే. అందువల్ల ఈ పుస్తకానికి పునర్మూల్యాంకనం అనే పేరు పెట్టాను. దీనిలో నేను ప్రతిపాదించిన ప్రధానాంశాలు.

1. మాదిగ సాహిత్యానికి ప్రత్యేక అస్తిత్వం ఉంది. దాన్ని గుర్తించకుండా, దళిత సాహిత్యంలో అంతరాగంగా పరిగణించడం సాహిత్యాన్ని సరిగ్గా అంచెనా వేయడమవ్వదు.

2. సాహిత్యం పునర్మూల్యాంకనం చేసేటప్పుడు ఎవరికోణాల నుండి వారు విశ్లేషించే అవకాశం ఉంటుంది.

3. దళిత సాహిత్యాన్ని దళితేతరులు అర్థం చేసుకునేటప్పుడు, దళిత సాహిత్యంలోని భిన్న కోణాల్ని పరిగణనలోకి తీసుకోవాలి.

4. మైనార్టీ వాదమనేది కేవలం ముస్లిం సాహిత్యంగానే భావించకూడదనే వాదనను ముందుకి తీసుకొస్తూ, సూర్య, ఆంధ్రప్రభ సాహిత్యానుబంధాల్లో వ్యాసాల్ని ప్రచురించిన తర్వాత సాహితీ వేత్తలు “మైనార్టీ

సాహిత్యం' నిర్వచనంలోనే మార్పుని గుర్తించారు.

5. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రవాదన వేగవంతమైన తర్వాత, తెలంగాణేతరులను అర్థం చేసుకుంటున్న తీరుని చూసినప్పుడు, ఇటువంటి స్వభావమే ఉన్న దళిత సాహిత్యాన్ని అధ్యయనం చేయవలసిన పద్ధతుల్లోనూ మార్పులు అవసరమనిపించింది. దళిత భావజాలాన్ని ప్రచారం చేయడంలో "దళిత' కులంగానే భావించేటప్పుడు దళితేతరుల రచనల్ని, వారి ఆచరణను ఎప్పటికీ దళితులు అంగీకరించలేరని గుర్తించాల్సిన అవసరం ఉందనిపించింది. అందుకే కొన్ని పారిభాషిక పదాల్ని పునర్నిర్వచించుకోవాల్సిన అవసరం ఉందనిపించింది.

ఇవి ప్రధానంగా ఈ పుస్తకంలో పునర్మూల్యాంకనం చేయవలసిన అంశాలు. ప్రస్తుత వాతావరణంలో వీటిని మాట్లాడవలసిన వాళ్ళే మాట్లాడాలి తప్ప, మరొకరు మాట్లాడితే వచ్చే ఇబ్బందులు తెలుసు కనకనే ముందుమాటలుగా రాసేవాళ్ళు చాలా జాగ్రత్తలు తీసుకుని భంగ్యంతరంగా చెప్పేప్రయత్నం చేస్తారని అనుభవపూర్వకంగా గ్రహించాను.

ప్రముఖకవి, విమర్శకుడు, మా తెలుగు శాఖాధ్యక్షుడు ఆచార్య బేతవోలు రామబ్రహ్మం గార్కి ఈ వ్యాసాలను ఇచ్చి ఆశీస్సులు అందించమన్నాను. తీరా నా వ్యాసాలు చూసిన తర్వాత బహుశా ఆయన చాలా ఆలోచించి ఉంటారనుకుంటున్నాను. అంతకు ముందొక సారి వీచిక పుస్తకానికి అభిప్రాయం రాయమన్నప్పుడు దానిలోని వివిధ వ్యాసాల్లోతుల్లోకెళ్లి వారి నిర్ణయాల్ని ప్రకటించారు. అందులోనూ ఆయనకి ఇబ్బందికరమైన రెండు మూడు వ్యాసాలున్నప్పటికీ, చాలా లౌక్యంగా వాటిని తప్పించి తమ అభిప్రాయాల్ని గుత్తగా చెప్పినట్లు చెప్పేశారు. ఇప్పుడు మళ్ళీ నా వ్యాసాల్ని పునర్మూల్యాంకనం పేరుతో పుస్తకంగా వేస్తున్నానని అభిప్రాయం రాయమన్నాను. వారేమి చేయాలి? ప్రస్తుతం సాహిత్య వాతావరణం చాలా వేడిగా ఉంది. అదీ దళిత సాహిత్యంలో అస్తిత్వం కోసం జరుగుతున్న వాదోపవాదాలు బలంగా సాగుతున్న సమయం. ఇటువంటి పరిస్థితిలో ముందుమాట

రాయడమంటే కత్తిమీద సామే! ప్రస్తుతం వారు మా తెలుగు శాఖాధ్యక్షులు. నేను రాసేదీ, చేసేదీ ఆయన తెలుసుకోవాలనే తపన మా అధ్యాపకులందరికీ ఉన్నట్లే నాకూ ఉండటం సహజం కదా!

ఇప్పుడు వారెన్ని ఆలోచనల మధ్య తమ అభిప్రాయాన్ని రాశారో నాకైతే తెలియదు. కానీ, 14 – 4 – 2010 వ తేదీన ఒక ముందుమాట రాసిచ్చారు. వారాలు, నెలలు దగ్గర పెట్టుకోకుండా వెంటనే రాసిచ్చారు. అది ముందుగా నాకు సంతోషం కలిగించింది. వారు రాసిన ముందుమాటను వెంటనే చదివేశాను. అప్పుడు నాకేమీ అనిపించలేదు. తర్వాత ఇంటికి వెళ్ళి ఆ ముందుమాటను మళ్ళీ చదివాను. ప్రతీ కామా, ఫుల్‌స్టాప్ వంటి గుర్తులతో సహా పరిశీలించాను. ఆయన సంతకం కింద ఏప్రిల్ 14 వ తేదీని గమనించినప్పుడు మనసులో వెంటనే డా. అంబేద్కర్ జయంతి స్ఫురించింది. ఆహా! ఏమి నా భాగ్యం అనుకున్నాను. ఆరోజుకి మరో విశేషం కూడా ఉంది. ఆరోజు అమావాస్య! ఎంత కవి హృదయం!!

గురువు గారు వారి అభిప్రయానికి పెట్టిన పేరు త్రీ చీర్స్...!" దీనిలో వీరు యూనివర్సిటీ అధ్యాపకులకు ఉండవలసిన మూడు అంశాల్ని గుర్తించారు. ఒకటి బోధన, రెండవది బోధించిన, వివిధ సెమినార్స్‌లో మాట్లాడిన అంశాల్ని రాయవలసిన అవసరం, మూడోది శాస్త్రీయంగా సూత్రీకరణ చేసినా ప్రకటించే ధైర్యం ఉండటం అవసరం అని ఆ మూడింటినీ ఈ పుస్తకంలో గమనించాను. టైటిల్ పెట్టడంలోనే సమకాలీనత పాటించారు.

ప్రస్తుతం క్రికెట్ మ్యాచెస్ రంజుగాజరుగుతున్నాయి. ఈ మధ్య క్రికెట్‌లో చీర్‌గాళ్స్ పెద్ద ఎట్రాక్షన్! ఫోర్, సిక్స్ రన్స్ కొట్టినప్పుడూ, అలాగే వికెట్ పడిపోయినప్పుడూ మరో బృందం ఆనందంతో డ్యాన్స్ వేస్తుంటారు. ఈ రెండు బృందాల్ని చూస్తున్న ప్రేక్షకులకూ ఆనందమే. ఆ విధంగా " త్రీ చీర్స్ " నామసార్థక్యం కాగా, మరోలా కూడా అన్వయించుకునే అవకాశం ఉందనుకుంటున్నాను. ఈ పుస్తకంలో నేను నియోలాగిజమ్స్ పై ఒక వ్యాసం రాసిన దాన్ని స్ఫురించేలాఈ అభిప్రాయాన్ని కూడా ఒక నూతన

అర్థంలో చెప్పారనుకుంటున్నాను. సాధారణంగా చీర్స్" అనేది ఒకానొక ఆనంద సమయంలో సంతోషంతో చెప్పుకునే సందర్భం! "అప్పుడు' నిజాలు బయటకొచ్చేస్తాయంటుంటారు – ఆ అనుభవజ్ఞులు. ఎవరేమనుకుంటారనే ఆలోచన కంటే ఆ మాట అనేయడమే ఆ సందర్భంలో జరుగుతుంటుందనీ అంటుంటారు. ఆ ఆనంద సమయంలో ఆరితేరిన వాళ్ళైతే అప్పుడు కూడా నోరు చాలా జాగ్రత్త పెట్టుకుంటారనీ అనుభవజ్ఞులు అంటుంటారు. అప్పుడప్పుడే ఆ ఆనంద సమయంలో అనుభవం పంచుకుంటున్న వాళ్ళు చాలా" ధైర్యం'తో అనేస్తుంటారు. అందులో వాస్తవాస్తవాలు తర్వాత తెలుస్తాయి. నా పుస్తకంలో కొన్ని స్టేట్మెంట్స్ అలాంటివి ఉన్నాయి. వాటినీ సూచింపజేస్తున్నారేమో అనిపిస్తుంది.

"మాదిగ' పదంలో మూడు అక్షరాలున్నాయి. నా ఈ పుస్తకంలో మాదిగ సాహిత్య దృక్కోణమే ప్రధానంగా ఉంది. దాన్నిక్కడ సంఖ్యావాచకంతోనూ, మూడు చుక్కలతోనూ సూచిస్తున్నారేమో! ఏమో!!

ఆ తారీఖు వేయడంలో మరో అర్థాంతర సూచన కూడా కలుగుతుంది. 14–4–2010 అంబేద్కర్ జయంతితో పాటు అమావాస్య అని కూడా అనుకున్నాం కదా! అమావాస్య ''ఐ''పోయిన తర్వాత ప్రారంభమయ్యేదేమిటి? శుక్లపక్షం ! అప్పటి నుండీ వెలుగు రేఖలు ప్రారంభమౌతాయి. అవి వెంటనే వెలుగునివ్వకపోవచ్చు. కానీ, కొన్ని రోజుల తర్వాత వచ్చే పౌర?మి నాటికి చల్లని వెలుగునిస్తుంది. అది అందరికీ ఆనందాన్ని కలిగిస్తుంది. కొన్ని ప్రతిపాదనలు మొదట్లో చిన్న చిన్న వెలుగు రేఖల్లానే కనిపిస్తున్నా, తర్వాత కాలంలో పున్నమి రోజులా అందరూ అంగీకరించే రోజొకటి వస్తుంది. అప్పుడు మాదిగలు చేసుకునే గొప్ప ఆనందోత్సవ సమయమే అవుతుంది.

వీటితో పాటు ఆ తేదీ నాటి సంఖ్యలన్నీ కూడినప్పుడు వచ్చే సంఖ్య కూడా మూడు! ఇవన్నీ వారి అభిప్రాయంలో ఉన్నాయో లేదో గానీ లేని ఊహలు పెడుతున్నావని ఎవరన్నా నాకెందుకో అవి ఉన్నాయనే అనిపిస్తుంది.

ఆయనిది కవిహృదయం! అంతకు ముందు  అటువంటి రెండు, మూడు వారి ముందు మాటల్లోని గల చమత్కారానికి ఆనందించిన వాణ్ణి.  అందుకే అలా ఆలోచించాను.

ఇక, దీనిలోని ప్రతిపాదనలకు సోదాహరణ సమన్వయాలను చూపేప్రయత్నం చేశాను. వీటితో విభేదించేవారుంటే, వారు కూడా వీటికి సమాధానంగా మరికొన్ని వ్యాసాలను రాయమని కోరుతున్నాను.

–దార్ల వెంకటేశ్వరరావు

# సమగ్రాంధ్ర సాహిత్య యుగ విభజన
# ఆరుద్ర భావ పరిణామం

సాహిత్య చరిత్ర రచనలో యుగవిభజనను అందరూ ఆమోదించే శాస్త్రీయమైన ఒక పద్ధతిని నిర్దేశించడం సాధ్యం కాదు. తెలుగులో వచ్చిన సాహిత్య చరిత్రలను పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. ఇటువంటి సమస్యలను బేరీజు వేసుకునే ఆరుద్ర సాహిత్య చరిత్రల్లోని యుగవిభజనను తనదైన ప్రణాళిక వేసుకొని సమగ్ర ఆంధ్ర సాహిత్యం రాశారు. కొంత మంది రాసిన ఆంగ్ల సాహిత్య చరిత్రలో పోషకులను ఆధారంగా చేసుకొని యుగ విభజన చేసుకున్నట్లే తెలుగు సాహిత్య చరిత్రలో యుగ విభజన కాలాన్ని అనుసరించి, చారిత్రక పరిస్థితుల్ని క్రమంగా అధ్యయనంచేయడానికి వీలుగా ఆరుద్ర రాజుల, పోషకుల్ని అనుసరించి చేశారు. అయితే, మొదటి సంపుటి నుండి చివరి (13వ) వరకూ ఈ పద్ధతిని కొనసాగించగలిగారా? అనేది యుగ విభజనలో ఏకసూత్రతను తెలియజేస్తుంది. సూత్రం అంటే ఒక నియమం. మొదటి నుండీ ఒకే నియమాన్ని పాటించడం "ఏకసూత్రత' క్రమబద్ధమైన నిర్మాణపద్ధతి ఉంటేనే ఏక సూత్రత ఉన్నట్లవుతుంది. వేసుకున్న ప్రణాళిక ప్రకారమే ఆ నిర్మాణం సాగడం దీనిలో జరగవలసి ఉంటుంది.

యుగ విభజనను ఆరుద్ర (తొలి ముద్రణ) తొ.ము.లో ఉజ్జాయింపు ప్రణాళిక అని మరికొన్ని మార్పులు చేసిన యుగవిభజన అని, మొదట్లో వేసుకున్న ప్రణాళిక అని చాలా సార్లు యుగ విభజనను మార్పు చేశారు. సమగ్రాంధ్ర సాహిత్యం, మొదటి సంపుటి నుండి యుగ విభజనను సమర్థించుకుంటూ రచన కొనసాగించినా, ఆరవ సంపుటి నవాబుల – అరవీటి రాజుల యుగాల నుండి "సమర్థింపు'లో కొంత మార్పు కనిపిస్తుంది. కవుల

స్వభావాల్ని రాజుల్ని అతిగా కీర్తించడంలో గల ఆంతర్యాన్ని విశదీకరించే దిశగా రచన కొనసాగింది. (పు.ము.vi – పు.4) ఇబ్రహీం కుతుబ్‌షాహీని హరిశ్చంద్రుడు, నలుడు... వీళ్ళ వరుసలో మల్కిభరామచంద్రుడే ఏడవ చక్రవర్తి పదునేడవ రాజు ధరాతలమ్మునన్" అనే పద్యాన్ని "చాటుపద్య మణిమంజరి' నుండి స్వీకరించి ఈ యుగ కవుల రచనా స్వభావాల్ని వివరించారు. అయినా, జమీందారి నవ్య సాహిత్య యుగాల్ని వివరించేటప్పటికి ఆరుద్ర భావజాల వివరణలో పరిణామం కనిపిస్తుంది. పదకొండవ సంపుటిలో రాజ్యాలు, రాజ లాంచనాలు, బిరుదులు పోయిన పాలకులు, తమ ఆశ్రితులను పోషించలేక పోయారు. ఎందరికో జీవనోపాధులు పోయాయి.

బ్రిటీష్ వాళ్ళు ఆర్థికంగా తెచ్చిన మార్పుల వల్ల సంస్థానాధీశ్వరులు తమని తాము కాపాడుకోవడానికే సరిపోయేది. విక్టోరియా మహారాణికి "బ్రిటీష్ దేశపు మహారాణి' బిరుదుతో పాటు "ఎంప్రస్ ఆఫ్ ఇండియా' (భారత దేశపు చక్రవర్తిని) అనే బిరుదు అవసరమని భావించి, బ్రిటీష్ పార్లమెంట్ "రాయల టైటిల్' చట్టాన్ని ఆమోదించింది. ఇండియాలోని సమస్త జనులు సంస్థానాధీశ్వరుల సమక్షంలో ప్రకటించాల్ని నిర?యించడం, ఢిల్లీలో (1877 జనవరి ఒకటవ తేదీన) నిర్వహించదలపెట్టిన "ఇంపీరియల్ దర్బారు' హడావిడిలోనే సంస్థానాధీశ్వరులు మునిగిపోయారు. ఈ పరిస్థితుల్లో కొక్కొండ వేంకటరత్నంతో పాటు కందుకూరి వీరేశలింగం కూడా మహారాణిని కీర్తిస్తూ పద్యాల్ని వరించారనడంలో మొదటి సంపుటి నుండి పదకొండవ సంపుటికొచ్చేసరికి రాజుల, పోషకుల యుగ విభజనలో గల పరిణామం బాగా స్పష్టమవుతుంది. ఈ పరిణామాన్ని ఆధారం చేసుకుని, ఆర్థిక అంశాలు సాహిత్య సృష్టిని లేదా ఉత్పాదన చేయడంలో దిశా నిర్దేశం చేస్తుంటాయనే మార్క్స్ సిద్ధాంతంతో సమన్వయించడానికి ఆరుద్ర ప్రయత్నించారు.

మార్క్సిజానికి ఆర్థిక అంశాలు పునాది. ఈ పునాది మీద ఆధార పడిన అనేక ఉపరితల అంశాలలో సాహిత్యం ఒకటని సైద్ధాంతిక చర్చలో తేలింది. రచనను చారిత్రక సందరరే పరిశీలించడం, సామాజిక వాస్తవాల్ని

భౌతిక దృక్పథంతో పరిశీలించడం, జీవితాన్ని నడిపించే శక్తులేవో, అడ్డుపడేవేవో, వాటిని సమర్థించేవారిని వ్యతిరేకించేవారిని పరిశీలించాలనేది మార్క్సిస్టు ద ృక్పథంతో చేసే వివేచన అవుతుంది. ఈ అంశాల్ని ఆరుద్ర యుగ విభజన చేయడంలో వచ్చిన పరిణామంతో సమన్వయించి చూసినట్లయితే, అస్తిత్వం నుండి చైతన్యం పుడుతుందనే భౌతిక వాదం అవగాహనే ఆరుద్రలో కనిపిస్తుంది. సమగ్రాంధ్ర సాహిత్యం చివరి సంపుటిని "ఆధునిక అభ్యుదయ యుగం'గా పేరు పెట్టారు. దీనిలో యుగ విభజనను కాలానుసరణ, చారిత్రక పద్ధతిలో రాజుల్ని, పోషకుల్ని ఆధారం చేసుకున్నారు. కొంత మందిని వివరించేటప్పుడు ప్రక్రియను ప్రధానంగా చేసుకున్నారు. కానీ, కేవలం తొ.ము.నే.పరిశీలించే వారికి ఈ పద్ధతి అవగతం కాదు. పైగా, ఒక యుగంలో ఉండవలసిన కవుల్ని మరొక యుగంలో కూడా చేర్చారు. అప్పుడు కాలానుసరణ తప్పినట్లయ్యింది. అందుకనే తొ.ము. వెలువడుతున్నప్పుడే కొందరు ఈ యుగ విభజనను విమర్శించారు.

తొలి ముద్రణను నెల నెలా పత్రిక వలే వెలువరించారు. అప్పుడే పత్రికల్లోనూ, సమగ్రాంధ్ర సాహిత్య సంపుటికి రాసిన "పీఠిక'ల్లోనూ కొంతమంది ఆరుద్ర చేసిన యుగ విభజనకు సరైన ప్రణాళిక లేదనీ, అవకతవకలున్నాయనీ విమర్శించారు. అంతేకాకుండా ఒక యుగంలో ఉండవలసిన కవులు మరొక యుగంలో కనిపిస్తున్నారనీ, గజపతుల పేరుతో ఒక ప్రత్యేక యుగం పెట్టవలసిన పని లేదనీ, కొంతమంది కవుల గురించి విస్తారంగా పేర్కొని, ఆ కవి పేరుతో కాకుండా, ఆ కాలం నాటి రాజుల పేరుతో యుగ విభజన చేశారనీ, తెనాలి రామకృష్ణుని చిత్రలేఖనం వలే విడ్డూరంగా కనపడుతుందనీ యుగ విభజన గురించి విమర్శలు చేశారు. వీటిని వివరించడంలో ఆరుద్ర ఎంత వరకు క ృతకృత్యుడయ్యాడో పు.ము. సమగ్ర ఆంధ్ర సంపుటుల్ని పరిశీలించడం వల్ల అర్థమవుతుంది.

తొ.ము. రెండవ సంపుటిని విమర్శిస్తూ విశ్వనాథ సత్యనారాయణ '*'మొత్తం రెండువందల యాభై మూడు పుటల్లో తిక్కనగారి గురించి 85*

*పుటల్ని, తక్కిన 168 పుటలలో పదహారుగురు గురించి రాశా*”రన్నారు. *ఈ లెక్కలో “కాకతీయ యుగం’ అనడం కంటే తిక్కన యుగం అంటేనే బాగుంటుందేమో! అదే అనగూడదేమో! కాకతీయ యుగమే బాగుంది”* అన్నారు.

తొలి ముద్రణ కాకతీయ యుగం (రెండవ సంపుటి) విశ్వనాథ వారన్నట్లు 250 పుటలు మాత్రమే కాదు. ఇన్నర్ టైటిల్, ముందు మాటలు, ఉపయుక్త గ్రంథ సూచికలు కాకుండానే 253 పుటల్లో ఉంది. తిక్కన సోమయాజి గురించి 50 నుండి 134 పుటల వరకు వివరించారు. అంటే 85 పుటల్లోనే విశ్లేషించారు. పునర్ముద్రణ 260 పుటల్లో ఉన్న సంపుటిలో తిక్కన గురించి 54 నుండి 118 పుటల వరకు 84 పుటల్లోనే పేర్కొన్నారు. విశ్వనాథ వారి విమర్శలో కొంత సవిమర్శక దృష్టి గోచరిస్తుంది. ఒకే కవిని గురించి అన్ని పుటల్ని చెప్పినప్పుడు, “తిక్కన యుగం’ అంటే సరిపోతుంది కదా!” అని వెంటనే “కాదనీ’ ఆరుద్ర విభజనే సమజసం అన్నారు విశ్వనాథ. కానీ, శివకవుల గురించి వివరిస్తూ ‘*‘తిక్కనను చూచి శివకవులు రాయలేదు, ఆనాటి సారస్వతం మీద శివకవుల ముద్రే ఎక్కువగా ఉంది. పాల్కురికి సోమనాథుని గురించి తగినంత రాయలేద*”ని విశ్వనాథ అన్నారు.

దీన్ని సహ ృదయ విమర్శగా భావించిన ఆరుద్ర, పునర్ముద్రణలో పాల్కురికి సోమనాథుడి గురించి మరింత సమాచారాన్ని పెంచి రచించడమే కాకుండా తాత్త్విక చర్చ కూడా చేశారు. అయితే, తిక్కన గురించి ఎక్కువగా రాశారనే దాన్ని ఆలోచిస్తే తెలుగులో వెలువడిన భారతంలో గల 18 పర్వాల్లో 15 పర్వాల్ని చక్కని తెలుగు పలుకుబడులతో అందించడం వల్ల విస్తృతంగా రాసినా, పు.ము.లో తగ్గించలేదు. భారతమే కాకుండా నిర్వచనోత్తర రామాయణం కూడా తెలుగు సాహిత్యానికి విశిష్టమైన భావాల్ని అందించింది. విశ్వనాథవారి విమర్శ, తిక్కన గురించి చేసినప్పటికీ, మిగిలిన సంపుటాలలోనూ కొంతమంది పట్ల ప్రత్యేక శ్రద్ధని ఆరుద్ర కలిగి ఉండటం వల్ల పుటల విస్తరణ, సమగ్రతకు కొంత భంగం వాటిల్లేటట్లు “యుగ విభజన’ తయారైంది.

తిక్కన గురించే అధికంగా విశ్లేషణ చేసికూడా తిక్కన యుగం” అని

పేరు పెట్టకుండా "కాకతీయ యుగం' అని పేరు పెట్టడాన్ని పరిశీలించడం అవసరం. ఈ యుగంలో జైనులు, శైవుల శృంగారలీలల్ని "బసవ పురాణం' "పండితారాధ్య చరిత్ర'లను బట్టి వివరించారు. ముగ్ధ సంగయ్య కథ, అమాయకుడైన భక్తుడు వేశ్యల ఇంటికెళ్లిన పరిస్థితిని బట్టి, ఆనాటి భక్తులలో ఉండే రసికతను వివరించారు (పు.ము. II- పు.8). రాజసేవలో వారకాంతలు "*లలితమంజుల విమలాంగ లతలు వెలుగ సూక్ష్మ వస్త్రాభరణం'*లో సంచరించే వారిని కామంధక నీతి శాస్త్ర గ్రంథాన్ని బట్టి నాటి సామాజిక జీవనాన్ని విశ్లేషించారు.

సామాజిక వాస్తవాల్ని వర్ణిస్తూనే, గణపతి దేవ చక్రవర్తి మరిది జాయప సేనాని "నృత్తరత్నావళి'; విశ్వనాథుని "ప్రతాప రుద్ర యశోభూషణం' వెలువడినవి ఈ కాకతీయ యుగంలోనే! ప్రతాప రుద్రుని ఆస్థానంలో సుమారు 200 మంది తెలుగు కవులు ఉండేవారనీ అందరి గురించి తెలుసుకొనే అవకాశం లేకపోయినా తెలియవచ్చినంత మందిని వివరిస్తానన్నారు. తిక్కన, వారి కుటుంబం మంత్రుల పోషణలో ఉండగానే అనేక రచనలు వెలువరించారు. మనుమసిద్ధికి రాయబారం వహించిన అనుభవంతో భారతంలోని "ఉద్యోగ పర్వం' "యుద్ధ పంచకం' కళ్ళకు కట్టినట్లు వరి?ంచగలిగారన్నారు (పు.ము. ×× – 106). రాజుల పోషణలో తిక్కన ఉన్నట్లు, ఆ అనుభవం రచనకు ఉపయోగ పడినట్లు చెప్పడం కూడా ఆరుద్ర తాను చేసుకున్న "యుగ విభజన'ను సమర్థించుకోవడమే అవుతుంది.

ఈ యుగంలో శివదేవయ్య అనే కవి గణపతి దేవ చక్రవర్తి, రుద్రమ దేవి, ప్రతాపరుద్రుడు దగ్గర మంత్రిగా ఉంటూనే (పు.ము. II పు.131). శివదేవ ధీమణి శతకం రచించినట్లు తెలుస్తుందని (పు.133) అన్నారు. కేతన "దశకుమార చరిత్ర'ను తిక్కనకు అంకితమివ్వడంలో కూడా పరోక్షంగా ఏదో ఒక పోషణకై జరిగిన ప్రయత్నం ఉండవచ్చు. మెజారిటీ అభిప్రాయాన్ని రాజు గౌరవించవలసి వచ్చేదంటూ, కేతన అనువదించిన "విజ్ఞానేశ్వరీయం'లో

*"పెక్కుంద్రు గుడి సమయం*

*బొక్కటి గల్పించి నడుపుచుండ్రు మరేమిన్*

*నిక్కముగా వాసమయము*

*దక్కొని చెల్లించుటయను ధర్మము పతికిన్*"అనే పద్యాన్ని వివరించారు (పు.ము. 2–165). "కేయూరబాహు చరిత్ర' రచించిన మంచన, క్రీ.శ. 1182–1206 ప్రాంతాలలో వెలనాటి చోడులలో ఆఖరి వాడైన పృథ్వీశ్వరుని దగ్గర మంత్రిగా పనిచేసే నండూరి గుండయ మంత్రికి అంకితమిచ్చాడు (పు.ము.××–172). మనుమసిద్ధి చనిపోయాక, క్రీ.శ. 1285 నుంచి నెల్లూరును రెండవ తిక్కరాజు పరిపాలించాడు. ఈతని ఆస్థానంలో పెద్దయామాత్యుడు అనే కవి ఉన్నట్లు జక్కన విక్రమార్క చరిత్రను బట్టి తెలుస్తుంది.

ఇలా కొంత మందిని రాజులు, మంత్రులు, మంత్రుల దగ్గర పనిచేసే కవి మంత్రులూ "కవుల్ని' పోషించినా, మరికొంత మందిని పోషించకపోయినా, కాలానుక్రమణలో చారిత్రక వాస్తవాల్ని వివరించడానికి రాజుల, పోషకుల యుగ విభజనను ఆరుద్ర చేశారనీ, అలా చేయడంలోనూ, ఆ కాలంలో ప్రసిద్ధమైన తెలుగు పాలకుల పేరుని పెట్టారని అర్థమవుతుంది.

అందుకనే, మొదట్లో "తిక్కన యుగం' అంటే బాగుంటుందని కూడా కాకతీయ యుగమని పేరు పెట్టడమే సమంజసమని విశ్వనాథ వారు మళ్ళీ ఆరుద్ర విభజనను సమర్థించారనుకోవచ్చు. ఈ రెండవ సంపుటి (కాకతీయ యుగం)ని తొ.ము. లో '*'రాజ్య స్థాపన క్రీ.శ. 1000 లో జరిగినా, గణపతి దేవ చక్రవర్తితో కాకతీయ ప్రాభవం ప్రసూటంగా కనపడుతుంది. అందుకు యుగం 1199 నుండి ప్రారంభం అది రుద్రమ దేవి తోనే తగ్గిందని చెప్పవచ్చు. రెండవ ప్రతాప రుద్రుని కాలంలో కొత్తగాలులు వీచాయి. కనుక యుగం 1290 తో అంతమవవచ్చు."అని చెప్పగా, పు.ము.××లోఇది మహా సాజమ్రాజ్యమైంది క్రీ.శ. 1200 తర్వాతనే. క్రీశ. 1323 లో ఈ వంశం లోని ఆఖరి రాజు ప్రతాపరుద్రుడు డిల్లీ సైన్యాలకు పట్టుబడి ఈ మహా సామ్రాజ్యం అంతరించింది. కాబట్టి కాకతీయ యుగం క్రీ.శ. 1200 నుండి*

*1325 దాకా ఉజ్జాయింపుగా పరగణిద్దాం'* అన్నారు.

"లక్షణ దీపిక' రచించిన గౌరన క్రీ.శ 1445 ప్రాంతాల్లో జీవించాడనీ, అథర్వణాచార్యుడితో తన గ్రంథంలో పేర్కొనడం వల్ల కనీసం అథర్వణాచార్యుడు, గౌరన కంటే ఒక శతాబ్దం ముందువాడై ఉంటాడని (పు. 252), అథర్వణాచార్యుడితో, రెండవ సంపుటిని ముగించారు. దీన్ని బట్టి కూడా కాలానుక్రమంగా, చారిత్రక దృష్టితో యుగ విభజన చేశారని తెలుస్తుంది.

యుగ విభజన గురించి మరికొంత మంది ఆయా సంపుటులకు రాసిన ముందుమాటల్లో మరికొన్ని విమర్శలు చేశారు. గిడుగు సీతాపతి "*ఆరుద్ర యుగ విభజనను విమర్శిస్తూ సాహిత్య పోషకులైన ప్రభు వంశముల పేర్లు పెట్టి యుగ విభజన చేయడం మంచిదే కానీ, ఈ ఐదవ సంపుటికి పెట్టిన పేరు తిక్కన సంపుటాలకు పెట్టిన పేర్ల వలే అంతగా సార్థకం కాదని నా అభిప్రాయం. గజపతులు సంస్కృత సాహిత్యాన్ని పోషించలేదు. అంతేకాదు శ్రీనాథుని విషాద విషయం తలుచుకుంటే దురరేం కాక తప్పదు. ఈ విషయం ఆరుద్రగారు గుర్తించకపోలేదు. ఏదో ఒక సాకు చూపి గజపతుల పేర ఒక యుగాన్ని పేర్కొని దాన్ని రెడ్డి రాజుల, తొలి రాయల యుగాలకు అనుబంధంగా జమ కట్టుకుందాం అన్నార*ని యుగ విభజనలో గల కొన్ని లోపాల్ని ఎత్తి చూపారు.

"*తొలిరాయల యుగం అనే పేరు బాగానే ఉంది. అయినా, గజపతుల పేర ఒక సంపుటి వెలయగా నరపతుల పేర ఎదుకుండరాదు. అందుగుల వెంకయ్య అనే కవి "నరపతి విజయం' రాశాడు. ఆరవీటి వంశ చరిత్ర వరకే దానినతడు పరిమితం చేశాడు'* అని ఖండవల్లి లక్ష్మీరంజనం విమర్శించారు.

నేలటూరి వెంకట రమణయ్య దీనిపై తన అభిప్రాయాన్ని తెలుపుతూ "*యుగ విభజన బహు విద్దూరంగా ఉంది.... తెనాలి రామకృష్ణుని చిత్రలేఖనం వలే వికటంగా కనపడుతుంది. రెడ్లతో సంబంధం లేని కవులు రెడ్ల యుగంలోను, పద్మ నాయకుల పోలు పొందెరుగని కవులు పద్మ నాయక*

*యుగంలోనూ వస్తారు. నవాబుల యుగం అని పేరు పెట్టినారు. ఒక యుగానికి సుల్తానుల యుగం అని పేరు పెడితే యుక్తంగా ఉండేది. వచ్చీపోయీ ఆంధ్ర వాఙ్మయాన్ని ఆదరించి పోషించిన వాండ్లు కుతుబ్ షాహీ సుల్తానులు ఇద్దరు. మల్కిభరామున్ను, ఆయన కొడుకున్ను "ఏ సింగిల్ శ్వారో డజ్ నాట్ మేక్ సమ్మర్' అన్నట్లు వీరిద్దరి మూలాన అది నవాబుల యుగం అవుతుందా?'* అని ప్రశ్నించారు.

తొ.ము. పదకొండవ సంపుటి– నాయక రాజుల యుగానికి కప్ప గంతుల లక్ష్మణ శాస్త్రి రాసిన '*పీఠిక'లోసాహిత్య చరిత్రలో పదునేడవ శతాబ్ది కాలమును ఏ యుగముగా పరిగణింపవలయునను విషయము వివాదాస్పదముగా నున్నది. ఇది క్షీణయుగమనియు, అనంతర ప్రబంధయుగమనియు, నాయక రాయుల యుగమనియు, సాహిత్య చరిత్రకారులు వివిధముగా పేర్కొనినారు. సాహిత్య ప్రక్రియా వైవిధ్యముగల ఈ యుగమును అనంతర ప్రబంధ యుగమనుటయే సమంజసముగా నున్నది'*అన్నారు.

వీటిని పరిశీలించినప్పుడు కింది విమర్శనాంశాలు సమీక్షించుకోవలసి వస్తుంది.

1. తన ప్రణాళికను సమర్థించుకోవడానికి అవసరం లేకపోయినా ఆరుద్ర ఏదో ఒక సాకు చూపి పోషకుల పేరుతోనే యుగ విభజన చేశారు.

2. పోషకుల పేరు పెట్టినా, ఆనాటి ప్రసిద్ధులైన, ఆ సంపుటిలో విస్త ృతంగా చర్చించిన కవి పేరుతోనే ఆ యుగాన్ని పిలవడం జరుగుతుందనేది గిడుగు సీతాపతి విమర్శ.

3. యుగ విభజన సమంజసంగా, సమర్థనీయంగా లేదు. విచిత్రంగా ఉంది.

4. ఏదో ఒకరిద్దరు పోషకుల వల్ల ప్రత్యేకగా ఒక యుగానిక ఆ వంశం పేరు పెట్టవలసిన అవసరం లేదు.

5. కేవలం పోషకులను అనుసరించి మాత్రమే యుగ విభజన

చేయడం వల్ల ప్రక్రియా ప్రత్యేకతని విమర్శించినట్లవుతుంది.

6. ఒక యుగంలో ఉండవలసిన కవులు మరొక యుగంలోకి వెళ్ళిపోయారు. కాలానుసరణం తప్పినట్లయింది.

7. ఆరుద్ర ప్రణాళికను అనుసరించి చూసినా, తెలుగు సాహిత్యాన్ని పోషించని పాలకుల పేరుతో యుగ విభజన చేయడం లోపభూయిష్టమైన పద్ధతి తన ప్రణాళికను తానే అతిక్రమించినట్లయ్యింది.

8. పోషించిన వారి పేరు పెట్టడానికి ఒక్క కావ్యం, కవి ఆధారం దొరికినా ఒక యుగాన్ని పెట్టవచ్చు. కానీ, కొన్నింటిని వదిలేశారు.

9. రాజులు పోయారు. రాజ్యాలు పోయాయి. ప్రజా పాలన వచ్చింది. కవులు మిగిలారు. కవులు స ృష్టించిన కవితా సామ్రాజ్యం మిగిలింది. సాహిత్యంలో కవులకీ, కావ్యాలకీ స్థానమివ్వవలసింది పోయి, రాజుల, పోషకులకి స్థానమిచ్చి, వారి పేరుతో సాహిత్య యుగ విభజన చేయడం సరైంది కాదు.

ఇలా విశ్లేషణకు అవసరమైన అనేకాంశాలుగా విమర్శకుల అభిప్రాయాల్ని తీసుకొనే అవకాశం ఉంది. వీటిని సమగ్రాంధ్ర సాహిత్యం తొలి ముద్రణ, పునర్ముద్రణలను అధ్యయనం చేస్తూ సమీక్షించడం వల్ల “యుగ విభజన' ఏకసూత్రత చాలా వరకూ లోపించిందని స్పష్టమవుతుంది.

***

# మైనారిటీసాహిత్యం - మరో చూపు

ప్రపంచ వ్యాప్తంగా గానీ, భారతదేశంలో గానీ, ముస్లింలు సంఖ్యా పరంగా మైనారిటీలు కాదు. భారతీయ జనాభా లెక్కల ప్రకారం చూసినా ముస్లింలు రెండవ స్థానంలో ఉన్నారు. అటువంటప్పుడు వీరిని మైనార్టీల్ని ఎలా పిలవాలి? అలా పిలవడం వెనుక గల కారణాలేమిటి? అని అలోచించవలసి ఉంది. నా అభిప్రాయం ప్రకారం మైనారిటీ సాహిత్యం అంటే కేవలం ముస్లిం సాహిత్యం మాత్రమే కాదు. క్రైస్తవ సాహిత్యం కూడా మైనారిటీ సాహిత్యమే అవుతుంది. అయితే ఆ మతాన్ని ఆధారం చేసుకుని ఆ ప్రజలపై జరుగుతున్న దాడులను, అభద్రతను పరిగణలోకి తీసుకొని దాన్ని నిర?యించవలసి ఉంది. ఆ మతం వల్ల వారిపై జరుగుతున్న అల్ప సంఖ్యాక భావమే వారి రచనల్లో వ్యక్తమైతే అప్పుడు అది మైనారిటీ సాహిత్యం అవుతుంది.

ఈ సందర్భంలోనే ఒక విషయాన్ని చర్చించాలి. “దళితులు” అని చాలా మందిని కలిపి పిలుస్తున్నా, వాస్తవంలో దళితులంటే మాల, మాదిగల తదితర ఉపకులాల వారనే అభిప్రాయమే వ్యక్తమవుతుంది. ఉమ్మడిగా దళితుల్లో తమకి రావలసిన హక్కులను తమకి రావాల్ని వాదిస్తూ మాదిగ తదితర ఉపకులాల వాళ్ళు ఉద్యమంతో పాటు, సాహిత్యాన్ని కూడా రాస్తున్నారు. కానీ, ముస్లిం మైనారిటీ సాహిత్యానికి లభిస్తున్న ప్రాధాన్యత, దళితుల్లో అంతర్గతంగా జరుగుతున్న వ్యధలను వ్యక్తీకరిస్తూ రాస్తున్న సాహిత్యానికి లభించడం లేదు. ఆ విధంగా మాదిగ సాహిత్యం “‘మైనారిటీ తనాన్ని” “సంతరించుకుంది.

సామాజికంగానూ, వృత్తి చేతా, సహజీవనం చేయవలసిన వారి చేతా అవమానింపబడుతూ, దాని గురించి రాస్తే ఏమవుతుందో అనేటంతటి

అభద్రతతో అనేక మంది మాదిగ సాహితీవేత్తలు ఆలోచిస్తున్నారు. అందుకని బహిరంగంగా మాట్లాడడాని గానీ, రాయడానికి గానీ ముందుకు రావడం లేదు. ఎవరైనా వచ్చినా తగిన ప్రాధాన్యత లభించక పోగా, వారిపై మూకుమ్మడిగా దాడి చేస్తున్నారు. సాహిత్యంలో మాదిగ వాదాన్ని రాసినందుకు డా॥ఎండ్లూరి సుధాకర్ పై అనేక మంది దాడి చేస్తున్నారు.

కలంపేర్లతో సాహిత్య దాడులు చేస్తున్నారు. వ్యక్తిగతంగా కూడా నిందలు చేస్తున్నారు. ఈ దాడిలో కూడా మాదిగల వాదాన్ని బలపరిచే డా॥ఎండ్లూరి సుధాకర్ గారి వాదాన్ని సమర్థిస్తూ రాసే వారి రచనలు ప్రచురణకే నోచుకోవడం లేదు. దానికి అనేక కారణాలను చూపినా, మాదిగల వాదం బయటకు రావడంలేదు.

ఇదంతా మాదిగ సాహిత్యం "మైనారిటీ" కి గురికావటం కాదా? ఉమ్మడిగా దళితులుగా ఉండటం లేదా అలా పరిగణన పొందటం వల్ల మాదిగలకు జరుగుతున్న అన్యాయం కాదా?

దేశంలోని అనేక చోట్ల క్రైస్తవ మతాన్ని స్వీకరిస్తున్న దళితులపై కొంతమంది దాడులు చేస్తున్నారు. ఆ దాడుల్ని ఖండిస్తూ వెలువరించే ఎన్ని ప్రకటనలు న్యూస్ అవుతున్నాయి? అసలు ఆ దాడులు వెలుగులోకి రావాలంటే ఎన్నాళ్ళు పడుతుంది? ఇదంతా క్రైస్తవులుగా మారేటప్పుడు దళితులు మైనారిటీ తత్వానికి గురికావడం కాదా? ఆ విషయాలన్నీ రాస్తే వాటిని ప్రచురించే సంస్థ లెన్ని ఉన్నాయి? తమ సమస్యల్ని, తమ ఫీలింగ్స్ ని రాయడానికి భయపడుతున్న స్థితిలో ఉండటం మైనారిటీ భావం కాదా?

తెలుగులో ముస్లింలు తమ అభద్రతను రాస్తుంటే వెంటనే ప్రచురించడమే కాకుండా, వాటిపై అనేక విశ్వవిద్యాలయాలు పరిశోధనలు కూడా చేయిస్తున్నాయి. ఈ స్థితి మాదిగ సాహిత్యానికి దక్కుతుందా? దళితుల్లోని మిగతా ఉప కులాల వారికి లభిస్తుందా? కనుక మైనారిటీ సాహిత్యం అంటే కేవలం ముస్లిం సాహిత్యమే అనుకోవడం సరైంది కాదు. కానీ, సంఖ్యాపరంగా వాళ్ళు హిందువుల తర్వాత స్థానంలో ఉన్నా, అనేక కారాణల వలన ముస్లింలను

మైనారిటీల్ని, వారు రాసే సాహిత్యం మైనారిటీ సాహిత్యం" అనీ పిలుస్తున్నారు. కానీ, తెలుగులో వస్తున్నా ముస్లిం సాహిత్య పుస్తకాలపై ఎక్కడా తమ సాహిత్యం "మైనారిటీసాహిత్యం"అని కనిపించట్లేదు. దీన్ని సాహితీవేత్తలు గమనించవలసి ఉంది.

నిజానికి " మైనారిటీ'అనే పదం ప్రధానంగా సంఖ్యా వాచకాన్ని సూచిస్తుంది. దాన్ని మనం అల్ప సంఖ్యాక వర్గంగా భావిస్తున్నాం. 2005 సర్వే లెక్కల ప్రకారం ఎన్ సైక్లోపీడియా బ్రిటానియా ప్రకారం ప్రపంచ జనాభా 33 శాతం క్రైస్తవులు, 20 శాతం ముస్లింలు, 13 శాతం హిందువులు, 5.9 శాతం బౌద్ధులు ఉన్నారు. 2001 జనాభా లెక్కల ప్రకారం భారతదేశంలో 80.5 శాతం (82, 75,868) హిందువులు, ముస్లింలు 2.3 శాతం (240, 80, 016), క్రైస్తవులు 1.9 శాతం (1,92,15,730), సిక్కులు 0.8 శాతం (79, 55, 207), బౌద్ధులు 0.4 శాతం (42, 25, 053) జైనులు ఉన్నారు. అలాగే 0.6 శాతం (66, 39, 626) పర్షియన్లు మరియు ఇతర మతస్థులు ఉన్నారు. మత గుర్తింపు లేకుండా 0.1శాతం (7, 27, 588) ఉన్నారు. ఒక్క భారత దేశంలో ఉన్న సుమారు 102 కోట్ల జనాభాని ఆధారంగా తీసుకుని మాట్లాడినా ముస్లింలు రెండవ స్థానంలో ఉన్నారని తెలుస్తుంది.

సంఖ్యా పరంగా చూసినపుడు హిందువులు కంటే ముస్లింలు అల్ప సంఖ్యాక వర్గం అవుతారు. కానీ, ముస్లింల కంటే అల్ప సంఖ్యాక వర్గంగా క్రైస్తవులు, బౌద్ధులు, తదితర మత వర్గానికి చెందిన వారవుతారు. కనుక, ముస్లింలను మాత్రమే మైనారిటీ వర్గం అని ఎందుకు పిలవాలి? అనేది ఒక ప్రశ్న. ప్రపంచవ్యాప్తంగా చూసినా, క్రైస్తవులు మొదటి స్థానంలో ఉన్నారు. ముస్లింలు రెండవ స్థానంలో ఉన్నారు. ఇవన్నీ అధికార లెక్కల ప్రకారం మాత్రమే. ఇంకా అనేక మంది ఉండవచ్చు. ఇక్కడ మనం ముఖ్యంగా ఆలోచించవలసింది ఒకటి ఉంది. భారతదేశంలో ముస్లింలను మైనారిటీ వర్గం అని పిలవడం సమంజసమేనా? అలా పిలవడంలో ఉన్న అంతర్యం ఏమిటి?

1) ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న ఉగ్రవాద దాడుల్లో ముస్లిం వర్గానికి చెందిన వాళ్ళే కీలక వ్యక్తులుగా ఫోకస్ కావడం కనిపిస్తుంది.

2) ముస్లిం మతంలో అల్లా బోధనల్లో ఉన్నవి ఏమైనా గానీ, "జీహాద్"పట్ల ముస్లిమేతర సమాజానికి వాస్తవ విషయాలు తెలుస్తున్నాయో లేదో తెలియదు. "జీహాద్' అనగానే ఒక మత యుద్ధం" అనే భావన ప్రచారంలో ఉంది. తమ మతాన్ని అభివృద్ధి చేసుకోవడానికి చేసే యుద్ధం అని కూడా ప్రచారంలో ఉంది. ఇలాంటి కారణాల వల్ల ముస్లింల పట్ల ప్రపంచ వ్యాప్తంగా, ఒక ద్వేషపూరిత వాతావరణం ఏర్పడిందనిపిస్తుంది. ప్రపంచంలో ఎక్కడ ఉగ్రవాద కార్యక్రమాలు జరిగినా, ఆ ఉగ్రవాదుల్లో ముస్లింలు పేర్లు కన్పించినా దాని ప్రభావం వల్ల కూడా అందరి ముస్లింలపై ఆ అనుమానపు చూపులు
చూస్తున్నారనే అభిప్రాయం వినిపిస్తుంది.

3) భారతదేశంలో ముస్లింలు రెండవ స్థానంలో ఉన్నప్పటికీ, వారి కంటే తర్వాత స్థానంలో ఉన్న మతస్థులకున్నంత స్వేచ్ఛ ముస్లింలకు లేదనే అభిప్రాయం వినిపిస్తుంది. భారతదేశంలో ఉగ్రవాద కార్యకలాపాలు అత్యధికంగా జరుగుతున్న ప్రాంతాలుగా జమ్మూ- కాశ్మీర్, ఉత్తరప్రదేశ్, గుజరాత్, ఢిల్లీ, ఆంధ్రప్రదేశ్ తదితరాలుగా వార్తలను బట్టి తెలుస్తుంది. ఈ ప్రాంతాలలో జనాభాని పరిశీలించినా ప్రథమ స్థానంలో ముస్లింలు 67, 93, 240, రెండవ స్థానంలో హిందువులు 30, 05, 349 ఉన్నారు. ఉత్తర ప్రదేశ్ లో హిందువులు 13, 39, 79,263 మంది, ముస్లింలు 3, 07, 40, 150 మంది ఉన్నారు. మహారాష్ట్ర లో హిందువులు 7, 78, 59, 385 మంది ముస్లింలు 1, 02, 70, 485 మంది ఉన్నారు. ఢిల్లీలో హిందువులు 1,13, 58, 049 మంది ముస్లింలు 16, 23, 520 మంది ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ లో హిందువులు 6, 78, 36, 688 మంది, ముస్లింలు 69, 86, 856 మంది ఉన్నారు.

ఈ లెక్కలను చూసినపుడు జమ్మూ- కాశ్మీర్ లో తప్ప మిగతా అన్ని

చోట్లా ఇంచుమించు హిందువులే అధిక సంఖ్యాకులుగా ఉన్నారు. జమ్మూ-కాశ్మీర్ లో ముస్లింలు అధిక సంఖ్యాకులు. వీటన్నింటినీ చూసినపుడు ముస్లింలు నిజంగా అల్ప సంఖ్యాక వర్గానికి చెందినవారే అవుతారా? అనేది ఒక బలమైన ప్రశ్న.

భారతదేశంలో హిందువులు తర్వాత ముస్లింలే అధిక సంఖ్యాకులన్నది నిజమే కావచ్చు. కానీ, 1992 డిశంబర్ 6వ తేదీన బాబ్రీ మసీదు కూల్చివేత తర్వాత ముస్లింలు రెండవ స్థానంలో ఉన్నప్పటికీ తామంతా అల్ప సంఖ్యాక వర్గమనే భావం మరింత బలపడింది.

ఆ తరువాత 2002లో గుజరాత్ లో జరిగిన మత కల్లోలాలు ముస్లింలలో మరింత అభద్రతా భావాన్ని పెంచాయి.

మరొక వైపు భారత స్వాతంత్ర్యానికి ముందు తెలంగాణ ప్రాంతాన్ని పరిశీలించిన నిజామ్ నవాబుల పాలన, ఆ కాలంలో నవాబుల చర్యల వల్ల ప్రచారంలో ఉన్న అభిప్రాయాలు నేటి ముస్లింల పట్ల ద్వేషపూరిత భావాన్ని కలిగిస్తున్నాయని ముస్లిం రచయితల రచనల బట్టి తెలుస్తుంది.

ఈ అభిప్రాయాలన్నింటితో పాటు ఈ చారిత్రక నేపథ్యాన్ని చూసినపుడు ముస్లింలు దేశ వ్యాప్తంగా ద్వితీయ స్థానంలో ఉన్నప్పటికీ అభద్రతకు గురవుతున్నారనేది సత్యం.

ఇదిలా ఉండగా, ముస్లింలుమనోభావాలను సాహితీకరించటంలో తెలుగులో ప్రధానంగా మూడు ధోరణులు కనిపిస్తున్నాయి.

1. ముస్లిమేతరులు ముస్లిం గురించి రాయడం. ఇది రెండు రకాలుగా జరుగుతుంది.

ముస్లింల గురించి ముస్లిమేతరులు తమ ద ృక్కోణంతో తమకు తెలిసిన జీవితాన్ని మాత్రమే రాయడం. ఒకటైతే మరో కోణంలో ముస్లింల పట్ల విషపూరిత భావాల్ని పెంచటం రెండవది.

2) ముస్లింలే తమ మనోభావాల్ని వ్యక్తీకరించటం.

3) మత, కుల, వర్గ పరంగా జరుగుతున్న అన్ని వివక్షలను ప్రశ్నిస్తూ

కొంత మంది ముస్లింలే రాయడం.

ఆధునిక సాహిత్యంలో వచ్చిన వివిధ ధోరణి లేదా వాదన లేదా ఉద్యమాలలో స్త్రీ, దళిత, ముస్లిం మైనారిటీ సాహిత్యం అనే విభజన ఇంచుమించు సాహితీవేత్తలందరూ అంగీకరించారు.

జల్ జలా, అజా, గుజరాత్ గాయం, అలావా, జగనే కీరాత్, నఖాబ్, ముల్కీ, వతన్,తదితర ముస్లిం సాహిత్య గ్రంథాలు వెలువడ్డాయి. అంతక ముందుచిక్కనవుతున్న పాట, పదునెక్కిన పాట ,బహువచనంతదితర కవితా సంకలనాలలో కూడా ముస్లిం వేదనను తెలిపే రచనలు ఉన్నాయి. నిజానికి ముస్లిం సాహిత్యం, ఆ వాదనలను కేవలం హైదరాబాదు కేంద్రంగానే కాకుండా, రాష్ట్రంలో అన్ని ప్రాంతాల వారి మనోభావాల్ని సమీకరించే దిశగా జరగాలనే వారు ఉన్నారు.

ముస్లిం రచనలపై అనేక విశ్వవిద్యాలయాలు పరిశోధనలు చేస్తున్నాయి. ముస్లిమేతర సాహిత్య విమర్శకులు కూడా ఈ సాహిత్యాన్ని గుర్తించారు. ఇప్పుడు చెప్పుకున్న ముస్లిం రచయితల రచనలలో కూడా తమ వాదాన్ని బలమైన స్వరంతోనే చెప్పుకున్నారు.

ముస్లిం సాహిత్యలో కూడా ముస్లిం స్త్రీవాద సాహిత్యం అనే విభాగాన్ని కూడా సాహితీ వేత్తలు గుర్తిస్తున్నారు. అయితే ఆయా పుస్తకాలలో గానీ, ఆ పుస్తకాలపైన గానీ ఎక్కడా కూడా తమది మైనారిటీ సాహిత్యమని పేర్కొనలేదు. కానీ అత్యధిక సంఖ్యాకవర్గం దగ్గర నివసించే అల్ప సంఖ్యాక వర్గం పొందే అభద్రతా భావమే వారి రచనల నిండా ప్రతిఫలిస్తుంది. కనుక" మైనారిటీ'అనేది ఆ ప్రజల మానసిక భావనగానూ, దానిని అనుసరించి "మైనారిటీ సాహిత్యం"అని అనగానే ముస్లింలు అభద్రతను తెలిపే సాహిత్యంగానూ సామాన్యీకరిస్తున్నారు.

తెలుగులో అత్యధిక రచయితలు ముస్లింలు రాసిన కవితలు, కథలు, వ్యాసాలు పైభావననే ప్రచారం చేస్తున్నాయి. ముస్లిం సాహిత్యంలో కూడా కొన్ని అంతర్గత విభేధాలు ఉన్నప్పటికీ వారందరిలో కనిపించే మౌలిక సూత్రం

అభద్రతను ప్రతిఫలింపజేయడమే. అంతేకాకుండా తమని ద్వితీయ శ్రేణి పౌరులుగా చూస్తున్నారని దాని కోసం ప్రతి చోటా దేశభక్తిని నిరూపించుకోవలిసి వస్తుందని వాదిస్తున్నారు.

పాకిస్తాన్, బంగ్లాదేశ్ తదితర ముస్లిం దేశాలలో జరిగే మత, సామాజిక, కార్యక్రమాలలో భారతీయ ముస్లింలను కూడా ఒకే గాటికి కట్టేసి చూడటం జరుగుతుందనీ, కానీ, తాము ముందుగా భారతీయులమని గుర్తించాలనీ వాదిస్తున్నారు. ఇలా అనేక కారణాల వల్ల ముస్లింలు రాసే సాహిత్యమేమైనారిటీ సాహిత్యం గా మన తెలుగులో చాలా మంది పరిగణిస్తున్నారు. దీన్ని లోతుగా చర్చించవలసిన అవసరం ఉంది.

భారతదేశంలో మతపరంగా జరిగినట్లే కుల, ప్రాంత, లింగ వివక్ష కూడా కొనసాగుతుంది. షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు, వారిలోనే అనేక ఉపకులాలు అలాగే బి.సి.ల లోని అనేక ఉపకులాలు ఉన్నాయి. వీరికి ఎవరి అస్తిత్వం వారికి ఉంది. వీళ్ళందరికీ రాజ్యాంగం ప్రకారం లభించవలసిన హక్కులు సమానంగా లభించటం లేదు. కొన్ని ఉపకులాల వారికి అన్యాయం జరుగుతుంది.

ప్రాంతాలవారీగా చూసినపుడు కూడా ఈ వివక్ష కనబడుతుంది. కనుక నిర్దిష్ట ఉపకుల సాహిత్యంలో అల్ప సంఖ్యాక వర్గ తత్వమే కనిపిస్తుంది. భారతదేశంలో దళితులంతా అనేక పేర్లతో ఉన్నారు. రాష్ట్రానికి, రాష్ట్రానికి మధ్య వారి కుల నామాలు భిన్నంగా ఉన్నాయి. దానిని బట్టి వారి వృత్తి, సాంఘిక హెూదా, దానిని అనుసరించి వారి ఆర్థిక పరిస్థితి నిర్ణయించబడుతుంది. భారతదేశంలో సుమారు అర్థ శతాబ్దం క్రితం జరిగిన సర్వేలను అనుసరించి ఏర్పడిన కుల జాబితాలే నేటికీ కొనసాగుతున్నాయి. వాటిని అనుసరించి రూపొందించినవే చట్టాలుగా అమలులోకి వచ్చాయి. వాటి వల్ల సమైక్యత పేరుతో ఉన్న షెడ్యూల్డ్ వల్ల కొన్ని కులాలు, ఉప కులాల వారు దోపిడికి గురవుతున్నాయి. వాటిని గుర్తించిన మేధావులు సామాజిక న్యాయం కోసం ప్రయత్నిస్తున్నా, అభివృద్ధి నిరోధక శక్తులు ఆ చర్యలను

తీవ్రంగా వ్యతిరేకిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్ లో వర్గీకరణ ఉద్యమం అలాంటిదే. అందువల్లమైనారిటీఅనేది కులాలు, ఉపకులాలను బట్టి కూడా ఉంటుందని గమనించాలి.

స్వాతంత్ర్యానంతరం దళితులకు కొన్ని రిజర్వేషన్స్ వల్ల కొన్ని ప్రయోజనాలు నెరవేరాయి తప్ప, కుల్నిర్మూలన జరగకపోగా దళితులపై దళితేతరులకు మరింత ద్వేష భావం పెరిగిపోయింది.

మరో వైపు దళితుల్లోనూ కొన్ని వర్గాల వాళ్ళే రాజ్యాంగం ప్రకారం రావలసి హక్కుల్ని పొందడంలో, మరికొన్ని దళిత వర్గాల్లో అసంత ృప్తి పెరిగిపోయింది. దాని కోసం దళితులుసమైక్యతఅనేది అన్ని రకాలుగా పంపిణీ జరిగినపుడే జరుగుతుందని భావించే స్థితికి చేరుకుంది. దాన్ని కొన్ని దళిత వర్గాలు అంగీకరించక పోవడంతో వర్గీకరణ ఉద్యమాలు రాక తప్పలేదు. అలాగే పంజాబ్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో వర్గీకరణ ఉద్యమం తీవ్రమైంది. ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ కూడా వర్గీకరణలో గల సంమంజస్యాన్ని అంగీకరించింది. దీనితో దళితుల్లోని ప్రధాన వర్గాలైన మాల-మాదిగలలో ప్రత్యేక అస్తిత్వం కోసం పోరాడుతున్నారు. మాదిగ సాహిత్యం ఇప్పుడు "మైనారిటీ సాహిత్యమైంది. తెలుగు సాహిత్యంలో మాలలు ఆధిపత్యాన్ని చెలాయిస్తున్నారు. అది దళిత సాహిత్యం పేరుతో సాగిస్తున్న ఆధిపత్యం!

మాదిగల రచనల్ని చూసీ చూడనట్లు వదిలేస్తున్నారు. అది కావాలనే చేస్తున్నారు. దీనితో పాటు దేశంలో జరుగుతున్న క్రైస్తవులపై, క్రైస్తవులు జరుపుతున్న దాడుల్ని, ఖండిస్తూ రాస్తున్న సాహిత్యం కూడా మైనారిటీ సాహిత్యమే అవుతుంది. అలాగే తెలంగాణాపై జరుగుతున్న వివక్షను తెలిపే సాహిత్యం కూడా మైనారిటీ సాహిత్యమే అవుతుంది. ఇది సమకాలీన సాహిత్యాన్ని గమనించే వారు గుర్తించగలిగే కొత్త ధోరణి అని తెలుసుకోగలుగుతారు.

***

# ప్రపంచీకరణ అంటే ఏమిటి?

ప్రపంచమంతా మారుమోగిపోతున్నా, "ప్రపంచీకరణ' అంటే ఏమిటో స్పష్టంగా చెప్పలేమని ప్రపంచ వ్యాప్తంగా మేధావులు అంటున్న మాట. వివిధ రచనల్ని అధ్యయనం చేసిన తర్వాత ప్రపంచీకరణ అంటే ఏమిటో నాకు కలిగిన అవగాహనను వివరిస్తాను.

"*Globalization can be defined as a process which denotes a transformation in the spatial organization of social relations and transactions"* (Samir Das Gupta : The changing face of Globalization, 2005: 15)

'Global' అనే పారిభాషిక పదం మార్పులకి గుర్తుగా మారింది. ఇది 1960లలో ప్రపంచవ్యాప్తమయ్యింది. 1964లో Marshall McLuhan "The Global village" అనే పారిభాషిక పదాన్ని ప్రాచుర్యంలోకి తెచ్చాడు. ప్రపంచవ్యాప్తంగా వస్తున్న ఆధునిక శాస్త్ర సాంకేతిక రంగాల్లోని మార్పుల్ని కమ్యూనికేషన్ సాధనాల ద్వారా విశ్వవ్యాప్తం చేయవచ్చని గుర్తించారు. అది ఇంటర్నెట్‌తో ఒక్కసారిగా ప్రపంచీకరణ" విశ్వరూపాన్ని చూపగలిగింది.

"ప్రపంచీకరణ' భావన అతి ప్రాచీన కాలమైందేనని అంటున్న వాళ్ళున్నారు. ((Samir Das gupta 2005: 17) దీని భావనలు 15, 16వ శతాబ్దాల్లోనే కనిపిస్తున్నాయన్నారు. అయితే Wallerstein "World system theory" ప్రపంచీకరణ భావనను మరింత లోతుగా, సాధ్యమైనంత స్పష్టంగా వివరించే ప్రయత్నం చేసింది. మార్క్స్ ఏంగెల్స్ ప్రతిపాదించిన ప్రపంచకార్మికులారా ఏకంకండని పిలుపునిచ్చిన ప్రపంచం" కంటే, Wallerstein "'World system theory''

పరిధి, స్వభావం భిన్నమైనవనీ, విస్తృతమైనదనే అభిప్రాయాలు వినిపిస్తున్నాయి.

*"Globalization as the process by which markets and productions in different countries are becoming increasingly inter dependent due to the dynamics of trade in goods and services and flowers of capital and technology"* ( The European commission నిర్వచించింది.

సమీర్ దాస్ గుప్తా వివరణలో Globalization ని ఇలా వివరించుకోవచ్చు. " *This is mainly a result of change in the Global economy and information and communication technology, which have had a great in pact on this cultural social, and political shift."*

Huizer ప్రపంచీకరణ గురించి మాట్లాడుతూ అది ఎలాంటిదో ఒక కథ చెప్తున్నట్లు వివరించారు. దాని సారాంశాన్నిలా వివరించుకోవచ్చు.

Global villageలో 100మంది ఉన్నారనుకుంటే. దానిలో 70 మంది నిరక్షరాస్యులు. ఒకడు మాత్రమే కళాశాలలో ఉన్నత విద్యను అభ్యసించగులుగుతున్నాడు. సగానికి పైగా ప్రజలు పోషక విలువల్లేని ఆహారంతో, 80 మంది నివాసయోగ్యం కాని ఇళ్ళలో ఉంటున్నారు. ఆ వందమందిలో 6 గురు అమెరికా జాతీయులే! మిగిలిన 94 మందికి చెందవలసిన దాన్నీఆ ఆరుగురు పొందగలుగుతున్నారు. మిగిలిన సగభాగాన్ని మాత్రమే 94 మందీ పంచుకోవల్సి ఉంటుంది. ఇది ఎలాంటి ఆరోగ్యకరమైన వాతావరణాన్ని కలిగించగలుగుతుంది. అన్నింటిలోనూ అభివృద్ధి చెందిన ఆరుగురు అమెరికా జాతీయులూ "గ్లోబల్ విలేజ్' లో సగభాగాన్ని ఆక్రమించేస్తే, మిగిలిన 94మంది ఆ ఆదాయంతో ఎలా సుఖ సంతోషాలతో జీవించగలుగుతారు? ఇదే "ప్రపంచీకరణ' ప్రక్రియలో కనిపిస్తుందని కొంతమంది వాదన. ఇలాంటి వాదనలు రావడానికి చాలా కారణాలున్నాయి.

మార్కెట్ చేసుకోవడంలో ఆయా కంపెనీలు చూపిస్తున్న శ్రద్ధ, ఆ

వస్తువుల్ని తయారు చేసేవారిపై చూపడం లేదు. పనిచేసినందుకు ప్రతిఫలం ముట్టచెప్పి చేతులు దులిపేసుకోవవడమే తప్ప, ఆ వస్తువులు ఉత్పత్తి చేసిన వారి సంక్షేమం గురించి పట్టించుకోవట్లేదు. తమ వస్తువుల ఉత్పత్తి వరకే ఆ కార్మికులతో సంబంధం ఉంటుంది. తర్వాత వారి గురించి పట్టించుకోవట్లేదు. అందుకనే ఇది సరాత్మక అభివృద్ధి (Positive Development) కాదనే విమర్శలు ఎక్కువైయ్యాయి. "వస్తు సంస్కృతి'కీ, ఉత్పత్తికీ ఇచ్చే విలువ, మానవ సంబంధాలకివ్వకపోవడం వల్లనే ప్రపంచీకరణ" ప్రక్రియలో జరుగుతున్న అనేక ఒప్పందాల్ని ప్రజలు వ్యతిరేకిస్తున్నారు. ప్రపంచంలో ఎక్కడ ఇలాంటి విధాన నిర?యాలు తీసుకొనే సమావేశాలు జరుగుతున్నా, ప్రజలు వాటిని తీవ్రంగానే వ్యతిరేకిస్తున్నారు. అభివృద్ధి చెందిన దేశాల వారికే అవి ప్రయోజనకారి అవుతుంటాయని వ్యతిరేకించే వారంటున్నారు. వీరి సంఖ్య రోజు రోజుకీ పెరిగిపోతుంది. ఆ తిరుగుబాటులు స్వేఛ,' సమానత్వం, సామాజిక న్యాయం, మానవీయ విలువల ప్రాతిపదికగా జరగడం విశేషం! అందుకనే ప్రపంచీకరణ" అంటే ప్రపంచాన్ని ఎలా తమ గుప్పిట్లోకి తీసుకోవాలో బహుళజాతి కంపెనీలు అలా ప్రయత్నించటమే"గా నిర్వచించుకొనే పరిస్థితి ఏర్పడింది.

1998లో ప్యారీస్ కేంద్రంగా MAI (Multilateral Agreement on Investment) కి పెద్ద సంఖ్యలో బహుళ జాతి కంపెనీ ప్రతినిధులు హాజరైయ్యారు. జెనీవాలో WTO (World Trade Organization), కార్డిఫ్ లో SEC (Single Europeean Currency) సమావేశాలు జరిగాయి. అలాగే బర్మింగ్ హెూమ్, యు.కె., జి-8 సమావేశాలు, IMF (INternational Monetory Fund) వంటి సంస్థలు జరిపిన సమావేశాలన్నీ బహుళ జాతి కంపెనీల ప్రయోజనమే ప్రధానంగా జరిగాయని నిరసన కారులు పెద్ద సంఖ్యలో సభలు సమావేశాలు నిర్వహించారు. వీటి దగ్గర ఆయా ఒప్పందాలను వ్యతిరేకిస్తూ ప్రజలు పెద్ద ఎత్తున ఆందోళనలు చేశారు. అయినా ఆ ప్రజలపై కాల్పులు జరిపైనా సమావేశాల్ని నిర్వహించి, వివిధ ఒప్పందాలపై సంతకాలు చేయడం, అవి

ప్రపంచ వ్యాప్తంగా అమలు జరగడం జరిగిపోతున్నాయి. ఇప్పుడు పల్లెల్లో SEZ (Special Economic Zones) ల రూపంలో వ్యవసాయాన్ని పెట్టుబడిదారులు ఆక్రమిస్తున్నారు. దాన్ని అడ్డుకోవాల్ని ఎంతో ప్రయత్నించినా అవి ఆగడం లేదు.

ప్రపంచవ్యాప్తంగా జరిగిన, జరుగుతున్న ఈ ఒప్పందాలు, పరిణామాల వెనుక, ప్రపంచ బ్యాంక్, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థల పెట్టుబడులు ఉన్నాయి. అవి అధికారం ఉన్న ప్రభుత్వ ప్రతినిధులతో తమ ఒప్పందాలను అమల్లోకి తీసుకొస్తున్నారు పెట్టుబడిదారులు పరోక్షంగా అధికారాన్ని కూడా కొనేస్తున్నారు. వెనుకబడిన, అభివృద్ధి చెందుతున్న దేశాల కోసమే పెద్ద ఎత్తున అప్పులిస్తున్నట్లు ప్రకటిస్తున్నా, కనిపిస్తున్నా, వాటి వెనుక పెట్టుబడిదారుల ప్రయోజనాలే ప్రధానంగా ఉంటున్నాయి. వ్యాపారమే ముఖ్యంగా కనిపిస్తుంది. అధికారంలోఉన్నవాళ్ళు వ్యవస్థ కోసమే, వ్యవస్థ అభివృద్ధి కోసమే పాటు పడుతున్నట్లు చెప్తున్నా, ప్రతి ప్రాజెక్టు వెనుక పర్సెంటేజీల రూపంలో పెద్ద ఎత్తున వ్యక్తిగతంగా లాభాలు అర్జిస్తున్నారనే ఆరోపణలు వినిపిస్తున్నాయి. అనేక మంది జీవితాల్ని కొద్దిమంది కొన్ని తరాల వరకు కూర్చొని తిన్నా తరగని ఆస్తుల్ని కూడబెట్టుకొనే దిశగా ప్రపంచీకరణ" అవకాశం కలిగిస్తూ, సమాజంలో ఒడిదుడుకులకు కారణమవుతుంది. అభివృద్ధిలా కనిపిస్తూనే, అది నిజమైన అభివృద్ధి కాదనే వాస్తవాన్ని నెమ్మదిగా తెలియజేస్తుంది. ఇలాంటి పరిస్థితుల్ని చాలా వరకు తెలుగు కవులు పట్టుకోగలుగుతున్నారు.

# భిన్నపార్శ్వాల్లో ప్రపంచీకరణ కవిత్వం

కవికి జీవితానుభవాలు ప్రధానం. జీవితంలో ఎదురయ్యే సుఖ దుఃఖాలకు కవి స్పందిస్తాడు. తన సుఖ దుఃఖాలకు కారణాలేమిటో తెలిసినా, తెలియకపోయినా తనకెదురైన అనుభవాన్ని వ్యక్తీకరిస్తాడు. అవన్నీ తన అనుభవాలే కానక్కర్లేదు. సహానుభూతితో కూడా స్పందిస్తాడు. పరగత సుఖ దుఃఖాల్ని తనవిగా భావిస్తాడు. తన జీవితంలోగల ఒడిదుడుకులకు గల కారణాలేంటో కూడా వివరించే కవులూ కొంతమంది ఉంటారు. జీవితానుభవమే తప్ప, దానికి గల హేతువుల్ని ప్రస్తావించని కవులు, హేతువుల్ని అన్వేషించే కవులు అనే రెండు ప్రధాన ధోరణులు గల వాళ్ళు తెలుగులో కవిత్వం రాస్తున్నారు. మార్క్సిజం తనకు తెలియదంటూనే దానిలో తత్త్వాన్ని తన కవిత్వంలో పెట్టిన శ్రీశ్రీ లాంటి వాళ్ళ లాగే, ప్రపంచీకరణ ప్రభావం వల్ల అలా జరుగుతుందని చెప్పలేకపోయినా, చెప్పడానికిష్టంలేకపోయినా దాన్ని వ్యతిరేకిస్తూ కవిత్వం రాసే వాళ్ళెంతో మంది ఉన్నారు.

ఈ మధ్య కాలంలో సాహిత్యంలో .ప్రపంచీకరణ అనే పదాన్ని వాడటం ఒక ఫ్యాషన్ అయిపోయింది అభ్యుదయ సాహిత్యం ఒక ఉద్యమరూపం సంతరించుకుంటున్నప్పుడు కూడా ఇలాంటి అభిప్రాయాలే వ్యక్తమయ్యాయి.. మళ్ళీ ఇప్పుడు రెండు మాటలు వినిపిస్తున్నాయి. ఒకటి ప్రపంచీకరణ. రెండవది పోస్టుమోడర్నిజం. ఈ రెండు పదాలను చాలా మంది తమ ప్రసంగాల్లో, వ్యాసాల్లో అలవోకగా, నిర్లక్ష్యంగా వాడేస్తున్నారు. ఆధునికత నుండి ప్రపంచీకరణను విభజించి చూపడం కూడా క్లిష్టమన్నట్లే కనిపిస్తుంది.ప్రపంచీకరణను కొంత మంది సాహితీవేత్తలు వేదకాలం నుండీ నేటి కాలం వరకూ జరుగుతున్నదంతా ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రపంచీకరణ జరుగుతునే ఉందటున్నారు.. మరికొంతమంది ఆధునికతకు,

ప్రపంచీకరణకూ మధ్య వ్యత్యాసాన్ని చాలా జాగ్రత్తగా చూడాలంటున్నారు. విశ్వనాథ సత్యనారాయణ వేయిపడగలు, గుర్రం జాషువ విశ్వనరుడను నడాన్ని, కాళీపట్నం రామారావు యజ?ం కథనూ కొంతమంది ప్రపంచీకరణలో భాగంగానే మాట్లాడుతున్నారు. మరికొంత మంది కాదంటున్నారు. ఈ పరిస్థితుల్లో ప్రపంచీకరణను ఎలా అర్థం చేసుకోవాలి?

ఎటువంటి ఆంక్షలు లేకుండా వివిధ దేశాల మధ్య మూలధనం, వస్తువులు, సేవలు ప్రవహించగల పరిస్థితినే ప్రపంచీకరణ అంటారని కొంతమంది భావిస్తున్నారు. గ్లోబల్ విలేజ్ (The Global village) అనే పదాన్ని 1964 లో మొట్టమొదటిసారిగా (మార్షల్ మెక్ లూహన్ (Marshall Mc Luhan )ఉపయోగించాడు. 1989లో మొదటిసారిగా "గ్లోబలైజేషన్" అనే పదాన్ని వాడినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి.

ప్రపంచవ్యాప్తంగా ముఖ్యంగా అమెరికా ఆర్థిక వ్యవస్థలో వచ్చిన మార్పులు, శాస్త్ర సాంకేతిక రంగాల్లో సాధించిన అభివృద్ధి "ప్రపంచీకరణ' ప్రక్రియను వేగవంతం చేసింది. ఉపగ్రహాల ప్రయోగాలు విజయవంతం కావడంతో రేడియో, టెలివిజన్ ప్రసారాలు అన్ని దేశాల్లోనూ కమ్యూనికేషన్ రంగంలో ప్రపంచాన్ని నిజంగా ఒక "గ్రామాన్ని' చేసేశాయి. అది ఇంటర్నెట్ అందుబాటులోకి రావడంతో మరింత వేగాన్ని పుజుకుంది.

భారతదేశంలో ప్రపంచీకరణను గుర్తించడం మాత్రం 1991 తర్వాత వచ్చిన ఆర్థిక సరళీకృత విధానాలు, దాని వల్ల వేగవంతమైన ప్రయివేటీకరణ ప్రక్రియలతో విదేశీకంపెనీలు అత్యధిక సంఖ్యలో ప్రవేశించడంతో ప్రపంచీకరణను 90 దశకం తర్వాతగానే భావించేటట్లు చేస్తుంది. న ్ ్వ సాధారణంగా ఆర్థికంగా శక్తివంతమైన దేశాలు, బలహీనమైన ఆర్థిక వ్యవస్థగల దేశాలపై ఆధిపత్యాన్ని చెలాయిస్తుంటాయి. దీన్నే "సామ్రాజ్యవాదం'గా పిలుస్తుంటారు. ఎప్పుడైతే ఆర్థిక, రాజకీయ ఆధిపత్యం ప్రారంభమైందో, సాంస్కృతికంగా కూడా ఆ దేశాలదే పైచేయిగా ఉంటుంది. అప్పుడది సాంస్కృతిక "సామ్రాజ్యవాదం'గా మారిపోతుంది. ఇవి సర్వసాధారణంగా కమ్యూనికేషన్

రంగాన్ని ఆసరా చేసుకొని విస్తరిస్తుంటాయి.

నూతన వలసవాదం, అమెరికనైజేషన్, బహుళ జాతి సంస్థల ప్రాబల్యం పెరగడం, ప్రపంచ మార్కెట్‌ను ఒకటిగా చేసే ప్రక్రియ వేగవంతం కావడం,...... అన్ని దేశాల మధ్య స్వేఛ్ఛా మార్కెట్ విధాన రూపకల్పన, సబ్సిడీల ఎత్తివేత, నిరుద్యోగం... ఇవన్నీ ప్రపంచీకరణలో భాగాలుగా కనిపిస్తున్నాయి. Global village లో 100మంది ఉంటే అందులో 6గురు అమెరికా జాతీయులే అవుతారని, వాళ్ళే సగం ఆదాయాన్ని అనుభవిస్తుంటారని, మిగిలిన 94మంది మిగితా సగభాగాన్ని పంచుకోవాలనే విమర్శ కూడా ఉంది

ప్రపంచీకరణ వల్ల సాధారణంగా కంపెనీలకు కొన్ని ప్రత్యేక సదుపాయాలు లభిస్తాయి. వాటిలో ప్రధానమైనవి. 1. అనుకూలమైన దేశంలో పెట్టుబడి పెట్టుకొనే స్వేఛ్ఛ కలిగి ఉండటం. 2. ఫ్యాక్టరీలను స్థాపించుకొనే అవకాశం కలగడం, 3. తమకిష్టమైన దేశంలో తమ ఉత్పత్తుల్ని అమ్ముకొనే సావకాశం కలగడం అనేవి ముఖ్యమైనవి. వీటి వల్ల ప్రపంచ దేశాలకు కొన్ని ప్రయోజనాలు కలుగుతాయని కూడా వాదిస్తున్నారు. ప్రతిదేశ ఆర్థిక వ్యవస్థ ప్రపంచ దేశాల ఆర్థిక వ్యవస్థలతో అనుసంధానింపబడుతుంది.. ఏకీకృత మార్కెట్ వ్యవస్థ ఏర్పడుతుంది. ముడిసరుకులు తక్కువ ధరకు లభిస్తాయి., మానవ వనరుల లభ్యత, కాలుష్య రహిత ప్రాంతం లేదా పరిశ్రమల్లో కాలుష్యాన్ని నిర?యించటంలో నిబంధనల సరళీకరణ ఉండే దేశాలు. బహుళ జాతి కంపెనీలకు అవకాశం కలిగించగలుగుతాయి. ఔట్ సోర్సింగ్ ద్వారా అనేక పనులు తక్కువ ఖర్చుతో, వేగంగా సాధించుకోవచ్చు.

ధరలు పెరగటం, టెర్మినేటెడ్ సీడ్స్ ప్రవేశించటం, వీటికి తోడు కల్తీవిత్తనాలు రైతుల్ని కుంగదీశాయి. అత్యధిక శాతం ప్రజలు గ్రామాల్లోనే జీవించడం వల్ల సహజంగానే ఈ ప్రభావమంతా గ్రామీణ జీవన విధానంలో కనిపించడం ప్రారంభమైంది. జీవనాధారమైన వ్యవసాయం వాణిజ్య పంటల పరమౌతుంది. పచ్చని పొలాలు రొయ్యల, చేపల చెరువులైపోతూ కాలుష్యం

మరింతగా పెరిగిపోవడం వల్ల వాతావరణ సమతౌల్యం దెబ్బతింటుంది.

దీనికి తోడు యంత్రాలతో వ్యవసాయం చేయడం ఎక్కువయ్యింది. దీనితో చేతివృత్తులు, కుటీర పరిశ్రమలపైనే ఆధారపడి జీవించే వారి జీవితం దుర్భరమైపోతోంది. ప్రపంచీకరణ వల్ల కులవృత్తులు, చేతి వృత్తులు నాశనమైపోతున్నాయనే ఆందోళన కనిపిస్తుంది. ఈ దిశగా చాలా మంది కవిత్వం రాసారు.

*"సహస్రవృత్తుల సమస్త చిహ్నాలు*
*సంస్కరణాగ్నిలో సమిధలై పోయాయి*
*ప్రవేటీకరణ రాజసూయ యాగంలో*
*అన్ని వర్ణాలూ, వివర్ణాలౌతున్నాయి'* 'అని డి. కృష్ణమూర్తి "నిషిద్ధ రైతు" కవితలో వర్ణించారు. వృత్తులు పోతున్నాయనే బాధే తప్ప, ఆ వృత్తులకు మన వాళ్ళెంత గౌరవమిస్తున్నారనే విషయాన్ని ప్రస్తావించడం లేదు.

*"వృత్తులు కూలీ ఉపాధీ పాయె*
*ప్రత్నామ్నాయం లేకనెపాయె*
*కూలిన బ్రతుకుల నిలుపుటకైన*
*కుటీర పరిశ్రమలైనా లేవు*
*బహుళ జాతి కంపెనీల మాయల్లోనా మా యన్నల్లారా*
*భారత పల్లెలు నలిగిపోయి కుమిలె ఓ అయ్యల్లారా'* "పల్లె కన్నీరు పెడుతుందో.." అనే గేయంలో గోరేటి వెంకన్న కరుణ రసం ఉట్టిపడేలా రాసి, గానం చేశాడు.

ఇక్కడే ఒక విషయాన్ని చర్చించుకోవాలి. కులవృత్తులు, చేతి వృత్తులు ఒకటి కాదు. భారత దేశంలో కొన్ని కులాలకు నిర్దేశించిన వృత్తులు లాభదాయకమైనవి కాదు, లేదా వారి జీవితాల్లో అవి వెలుగులివ్వకపోగా, మరింత దిగజారిపోవడానికి కారణమవుతున్నాయి. కొన్నింటికి అత్యంత గౌరవం లభిస్తూ, మరికొన్నింటికి అగౌరవం కలుగుతుంది. ఇది కులవృత్తుల్లో కలుగుతున్న వాస్తవం. కులవృత్తి చేతి వృత్తిగా మారలేదు.

ఎవరు ఏ వృత్తినైనా చేసుకొనే స్వేచ్ఛలేదు. మన సమాజంలో కులం అనివార్యం. కులంతోనే అత్యధికులకు గుర్తింపు కలుగుతుంది. అందువల్ల కొన్ని కులాలకు కొన్ని వృత్తులు వంశపారంపర్యంగా కొనసాగుతూ వస్తున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో అన్ని కులవృత్తులకు సమాన గౌరవం ఎలా లభిస్తుంది? కుల వృత్తి చేతి వృత్తిగా మారడం, అన్ని వృత్తులకు సమాన గౌరవం లభించడం జరగడం లేదు. ఇది గ్రామాల్లో అసలు సాధ్యం కావడం లేదు. అలా ప్రయత్నిస్తే ఘర్షణలు, కొట్లాటలు జరిగిపోతున్నాయి.

పట్టణం, నగరాల్లో కుల వృత్తి చేతి వృత్తిగా మారి సాంఘిక, ఆర్థిక రంగాల్లో గౌరవం కలుగుతుంది. కులవృత్తి చేతివృత్తిగా మారడానికి మనం ముందుగా ప్రయత్నించాలి. అప్పుడు ప్రపంచీకరణ పరిస్థితుల్లో వృత్తులు" నాశనమైపోతున్నాయని బాధ పడటంలో నిజమైన ఆవేదన కనపడుతున్నట్లవుతుంది.

పారిశ్రామికీకరణ, పాశ్చాత్యీకరణ, ఆధునికీకరణల ఫలితంగా దళితుల జీవితాల్లో చాలా వరకూ అభివృద్ధికరమైన మార్పులే వచ్చాయి. అంతవరకూ లేని విద్యావకాశాలు లభించాయి. కాల క్రమంలో కుల వృత్తి, చేతి వృత్తిగా మారింది. మతపరమైన హింస తగ్గింది. సామాజికంగా గౌరవం పెరిగింది. ప్రజాస్వామ్యం అందించిన స్వేచ్ఛ సమానత్వం, సౌభ్రాతృత్వం వంటి భావనలు దళితుల్ని ప్రధాన జీవన స్రవంతికి తీసుకోని రావడానికి ద్వారాలు తెరిచేలా చేసింది. కుల వృత్తిని మానేసి మరోవృత్తి చేసుకోవడం ద్వారా వచ్చే మార్పుల్ని దళితులు అభివృద్ధికరమైన వాటిగానే భావిస్తున్నారు.

*"మా ముత్తాత చెప్పులు కుట్టేవాడు*
*మా తాత కూలిపని కెళ్ళేవాడు*
*మా అయ్య అక్షరం కోసం ఆశగా చూసేవాడు*
*నేనిప్పుడు కవిత్వం రాస్తున్నాను*
*రేపు నా కొడుకు ప్రొఫెసరవుతాడు'* అని కవి (దార్ల వెంకటేశ్వరరావు)

అనడంలో దళితులు సాధించిన అభివృద్ధి పరిణామం వెనుక కులవృత్తి మారి, తమ జాతి స్వేచ్ఛ, సమానత్వం కోసం తరతరాలుగా ఎదురు చూసిన వైనం కనిపిస్తుంది.

ప్రజాస్వామ్యం కూడా ప్రపంచీకరణలో భాగమే అయినప్పుడు దాని వల్ల దళితులకు కొంత మేలే జరిగిందని చెప్పవచ్చు. ప్రజాస్వామ్యం వల్ల దళితులకు ఓటు హక్కు వచ్చింది. దీనితో దళితుల సంక్షేమం గురించి అన్ని పార్టీలు ఆలోచించవలసిన పరిస్థితులే దళితుల అభివృద్ధికి ఎంతగానో ఉపయోగకరంగా మారాయి. దీనిలో భాగంగానే హాస్టల్స్ ఏర్పడ్డాయి.

వీటి వల్ల దళితులు ఎంతోమంది చదువుకోగలుగుతున్నారు. తమ ఇంటి దగ్గర తినడానికి లేని పరిస్థితుల్లో తాము తింటున్న ఆహారాన్ని చూసి దళితులు ఎలా ఫీలవుతుంటారో సిద్దంకి యాదగిరి రాసిన ఒక కవితను చూస్తే తెలుస్తుంది.

*హాస్టల్ల.....*
*బువ్వ కలుపుతూ మెతుకుల్ని జూస్తే*
*ఒకపారి అయ్యవ్వ యాదికొచ్చి*
*మతిల కుతి కొట్టు కుంటది....*
*జెండా వందనం నాడు బోంది వెడితే*
*అడవిల కంకులు, కాయలు కాల్చి దెచ్చిన "అయ్య'*
*మంగలం పెంకల ప్యాలాలు ఏంచిన "అవ్వ'*
*అంగి జేవుల వోసిన "నాయినవ్వ'*
*బుక్కసా... బుక్కమనే మా "తాత' మాటలు*
*చెవులు మరిసినా కండ్లు మారవలేదు."*

ప్రపంచీకరణ ప్రభావంతో అన్నీ మారుతున్నా "కులం' అంతరించి పోవట్లేదు. కులం వల్ల కలిగే ద్వేషాలు, అంటరాని భావన పోవట్లేదు. దీన్నీ అన్ని ప్రాంతాల కవులూ రాస్తున్నారు. కత్తుల కిషోర్ కుమార్ కులం వాసన

పోని ఊరు గురించి చెప్తూ....

*"ఊరి గురించి మాట్లాడాలంటే*

*మా కన్నీళ్ళను,*

*మా ఆకలి అవమానాల్నీ తవ్వుకోవడమే'*నంటాడు కవి.

ప్రపంచీకరణ ఒక్కసారిగా వచ్చినది కాదని నమ్మితే అది దళితుల్ని కొంత ముందుకి తీసుకెళ్ళడానికీ, విద్యావకాశాలకి అవకాశం కలిగించిందనీ ఒప్పుకోక తప్పదు. దీన్ని తైదల అంజయ్య అనే కవి ఇలా వర్ణించాడు.

*"కరువుకు*

*మనుషులను అమ్ముకున్నట్టి*

*ఆకలి చావు మా తాత*

*అప్పులను తీర్చుటకు*

*కడుపు గట్టుకున్న*

*వలస బతుకు మా అయ్య*

*చినిగిన అంగీ లాగుతో*

*బడిలో చేసే జండా వందనం నేను"*ఇలా వర్ణించడంలో దళితులు కనీసం పాఠశాలల్లో కైనా వచ్చే పరిస్థితి కనిపిస్తుంది. అయినా, ఈ మార్పు పునాదిలో కూడా రావాలి. కులం గ్రామాల్లో చూపే ప్రభావాన్ని ప్రపంచీకరణ కూడా ఏమీ చేయలేకపోతోంది. అందుకే వర్గం : కులం" పట్ల భిన్నమైన సిద్ధాంతాలు బయలుదేరాయి.

మరో కోణంలో చూస్తే, గ్రామాల్లో యంత్రాలతో వ్యవసాయం చేసే పరిస్థితి పెరిగిపోవడం, పంట పొలాలు రొయ్యల చెరువులుగా మారిపోవడంతో కూలీ పనిమీద ఆధారపడి జీవించే వాళ్ళు బతుకుతెరువు వెతుక్కొంటూ పనిచేసుకోవడానికి వలసలు పోక తప్పట్లేదు. వలస వెళ్ళవలసిన పరిస్థితుల్ని గమనిస్తే ఎంతో దయనీయమైన పరిస్థితి కనిపిస్తుంది. దీని గురించి కవులు అన్ని ప్రాంతాల నుండీ కవిత్వం రాస్తున్నారు. తమ జీవనాధారమైన పశువుల్ని అమ్ముకోవలసివస్తుందంటూ...

*మా సీమలో కరువు*
*బిడ్డ లాంటి పశువును*
*అడ్డంగా అమ్మిస్తోంది*
*ఊళ్ళకు ఊళ్ళే ఖాళీ చేయించి*
*మనుషుల్ని*

*వలస పక్షుల్ని చేయిస్తోంద* 'ని రాచపాళెం చంద్రశేఖరరెడ్డి "అద ృశ్యమవుతున్న దృశ్యం మన కళ్ళకి కట్టినట్లు చూపిస్తున్నారు. ఇలాంటి కరువు ఇప్పుడు అన్ని ప్రాంతాల్లోనూ కనిపిస్తుందని మరికొంతమంది రాస్తున్నారు.

*"మా కరువిప్పుడు*
*ప్రాంతీయవేదన కాదు*
*ఇది జాతీయ విపత్తు*
*మా గ్రామీణ జీవన సౌందర్యాన్ని*
*కాలరాస్తున్న ఈ కరువు*
*మన సామాజిక, సాంస్కృతిక విలువల్ని*
*కాటేస్తున్న ఈ కరువు*
*ఉమ్మడి కుటుంబ వ్యవస్థని*

*ఊరుమ్మడి బతుకులుగా ఛిద్రంచేస్తున్న ఈ కరువు"* కలిసిమెలిసి ఉమ్మడి కుటుంబంగా జీవించటం గ్రామీణ సంస్కృతిలో ఒక భాగం. విద్య, ఉద్యోగాల వల్ల ఇతర ప్రాంతాలకు వెళ్ళవలసి రావడం ఆధునిక కాలంలో ఎలాగూ తప్పదు. కానీ, పొలాల్లో నీళ్ళులేక, పంటలు పడించుకోలేక, వలస పోవలసిన పరిస్థితి ఘోరం. ఒకవేళ నీళ్ళు ఎలాగో కొద్దోగొప్పో అందినా, కల్తీ విత్తనాలు, ఎరువుల వల్ల సర్వం కోల్పోయి, పెట్టిన పెట్టుబడులు తీర్చలేక ఆత్మహత్యలు చేసుకొనేవాళ్ళు, పట్నం, నగరం వెళ్ళి పనో, పాటో చేసుకొని, అప్పులూ తీర్చవలసిన పరిస్థితుల్లో ఉమ్మడి కుటుంబం విఛిన్నమై పోవడం విషాధకరం. కార్పొరేట్ విద్య, వైద్యం వల్ల, వ్యవసాయంలో పెట్టుబడులకు తాముచేసిన అప్పులు

తీర్చలేక అవయవాల్ని అమ్ముకోవడమో, వ్యభిచార కూపంలోకి దిగిపోవడమో జరుగుతుంది. అందుకని గ్రామాల్ని వదిలి నగరాలకు వలసలు వెళ్ళిపోతున్నారు. ఇది ప్రపంచీకరణ ప్రభావం ఫలితంగా ఎక్కువైంది.

తెలంగాణా, రాయలసీమ, కళింగాంధ్ర, మధ్యాంధ్రలలో ఏ ప్రాంతాన్ని చూసినా విఛిన్నమై పోతున్న ఉమ్మడి కుటుంబం, దాని వెనుకగల ప్రపంచీకరణ ప్రభావాన్ని ఆ ప్రాంత కవులు వాటిని కవిత్వీకరిస్తున్నారు.

పచ్చని పొలాలతో కళకళలాడిన పల్లెల్లు రొయ్యల చెరువులుగా మారిపోయిన పరిస్థితి కోస్తాంధ్రలో కనిపిస్తుంది. కోడికూతలతో, పక్షుల కిలకిల రావాలతో, సుప్రభాతాలతో నిద్ర లేచే పల్లెలు ఇప్పుడు యంత్రచప్పుళ్ళతోనే మేల్కొనవలసి వలసి వస్తుందంటున్నారు పాటిబండ్ల రజని.

*"రూపాయిలు డాలర్లకు మారకపోయాక*

*వరిచేలు వ్రయ్యలయ్యి రొయ్యకయ్యలయాక*

*పల్లె"* చల్ల చిలికే చప్పుళ్ళతో కాక ఐస్‌క్రషర్ల మోతతో గొప్పగా మేల్కొంటుంది ప్రతి కుటుంబానికి సర్వసాధారణంగా డబ్బున్నా లేకపోయినా గ్రామాల్లో పండగ వచ్చిందంటే గొప్ప హడావిడి ఉండేది.

*"సంకురాత్రి పండుగొచ్చిందటే*

*సకినాలే సకినాలు*

*వాకిట్లో అడుగు పెట్టటం యమ కష్టం*

*ముగ్గు తొక్కినోని వీపంతా నుగ్గునుగ్గయ్యేది* ' అని కందుకూరు శ్రీరాములు నాటి పండగల్లో ప్రధానంగా ముగ్గులు పెట్టుకొనేటప్పుడు కనిపించే హడావిడి వర్ణించాడు. సహజత్వానికి దూరంగా పండుగలు జరుపుకోవడం గ్రామాల్లోనూ కనిపిస్తుంది.

సమాచార రంగంలో వచ్చిన విప్లవాత్మక మార్పుల వల్ల గ్రామీణ ప్రాంతాల్లోనూ ఫోను, సెల్ ఫోను వాడేవారి సంఖ్య గణనీయంగానే పెరిగింది. కొన్ని అవాంచనీయ కార్యకలాపాలు సెల్ ఫోను వల్ల కలిగినా, దళితులకు, నిరక్షరాస్యులకు కొంత ఆత్మగౌరవాన్ని కలగజేసిందనే చెప్పాలి. ఒకప్పుడు

నిరక్షరాస్యులు తమ బంధువులకు ఒక ఉత్తరం రాయాలన్నా, వచ్చిన ఉత్తరం చదివించుకోవాలన్నా అనేక ఇబ్బందులను ఎదుర్కోవలసి వచ్చేది. అత్యధిక శాతం దళితులు నిరక్షరాస్యులు. కనుక, ఆ సమస్యను ఎక్కువగా వాళ్ళే ఎదుర్కోవలసి వచ్చేది. అయినా, ఇతర వర్గాల్ని, వరా?ల్ని చూసినప్పుడు చాలా మంది సెల్ ఫోన్ తోనే ఎక్కువ సమయాన్ని గడుపుతూ, దగ్గరున్న వాళ్ళతో మాట్లాడకుండా కాలం గడిపేసేవాళ్ళూ కనిపిస్తున్నారు. ఇలాంటి వాళ్ళ గురించి చాలా మంది కవులు కవిత్వం రాసారు.

*"సంక్రాతి వస్తోందంటే ఊరంతా కడిగిన ముత్యమయ్యేది*
*బీదాబిక్కీసైతం కొత్తబట్టల్లో కళకళలాడేవారు*
*రచ్చబండలు, గుళ్లూ, నీటి తగాదాలు, కొట్లాటలు,*
*కపిలబావులు, ఆలమందలు, "గొర్రెల' గుంపులు......*
*తాటి ముంజెలు*
*గంగమ్మ జాతరలు,*
*పొంగళ్లు, కొలుపులు,*
*వీధి భాగవతాలు అన్నీ ఒకటే'* 'అన్నట్లు గ్రామాలు ఉండేవని చీకోలు సుందరయ్య వరి?ంచడం వెనుక నాటి గ్రామీణ సంస్కృతి తెలుస్తుంది. మరి నేటి పండగల గురించి చెప్తూనే అన్నీ ఎలా మార్కెట్ అవుతున్నాయో చెపుతూ పాటిబండ్ల రజని ఇలా వరి?స్తున్నారు.

*"ఇక విదేశీ మార్కు ప్లాస్టిక్ గొబ్బిళ్ళొస్తాయి!...*
*బహుళ జాతుల భయంకర కోరల్తో*
*మకరరాశి సిద్ధంగా ఉంది!*
*తన పంచనామా రిపోర్టుపై తానే సంతకమైన*
*సూర్యుడ్నది కొద్దికొద్దిగా మింగేస్తుంది!*
*చీకట్ని తలుచుకొని చింతపడకండి!*
*మకరం బ్రాండ్ మల్టీనేషన్ కంపెనీలు*
*వెలుతుర్నిక వాక్యూమ్ ప్యాక్‌లలో అమ్ముతాయి!'* ' ఇప్పుడు అనేక

వస్తువులను అలాగే అమ్ముతున్నారు. పేటెంట్ సంపాదించి బహుళజాతి కంపెనీలు ఎప్పుడు ఏమి అమ్ముతాయో చెప్పలేని పరిస్థితిలో ఉన్నామనే ఆందోళన ఈ కవితల్లో కనిపిస్తుంది.

ఉన్న కొద్ది పొలాల్లో కూడా ఫెస్టిసైడ్స్ వాడకం పెరిగింది. ఉత్పత్తి పెరిగినా వాతావరణ కాలుష్యంతో సహజంగా లభించే స్వఛమైన గాలీ, నీరూ కలుషితమై పోతున్నాయి. అలాగే వ్యాధులు కూడా పెరిగిపోతున్నాయి. వాటిని తగ్గించడానికి వాడే మందులు కూడా కల్తీలమయమయ్యాయి.

పేదల సంక్షేమానికి పాటుపడే ప్రభుత్వ శాఖలు ఆర్థిక సరళీకృత విధానాల వల్ల నిర్వీర్యమైపోతున్నాయి. అనేక ప్రభుత్వ వైద్యుల, మందుల కొరత వల్ల కార్పోరేట్ హాస్పటల్స్‌లో వైద్యమే దిక్కవతుంది. అది ఖరీదైపోయి, ఏ రోగమొచ్చినా ఆసుపత్రికి వెళ్ళడం కంటే ఆత్మహత్య చేసుకోవడమో, ఎలాగోలా కొన్నాళ్ళు బతికి తనువు చాలించడమో మంచిదనే ధోరణి పెరిగిపోతుంది. ఖరీదైన వైద్యం చేయించుకోలేక మంత్ర తంత్రాలకు బలవుతున్నారు.

మరోవైపు కుటుంబంలో కొంతమందినైనా బతికించుకోవాల్ని, ఆ కుటుంబంలోని మరి కొంతమంది అనేక "తప్పనిసరి త్యాగాలకు" పాల్పడవలసి వస్తుంది. రక్తాన్ని, కిడ్నీల్ని, పిల్లల్ని కూడా అమ్ముకోవడం. ఇలా తమలో పనికొచ్చే మానవ అవయవాల్ని అన్నింటినీ అమ్ముకోవడం చాలా గ్రామాల్లో కనిపిస్తుంది. అక్కడా మళ్ళీ దళారుల మోసాల్లో చిక్కుకోవడం గ్రామీణుల్లోనే ఎక్కువగా జరుగుతుంది. దీనికి నిరక్షరాస్యత కూడా తోడవుతుంది.

అప్పుడప్పుడూ పత్రికలు, టీ.వీ. ఛానల్స్ ఈ వార్తల్ని బయటపెట్టినా వాటిని అరికట్టడానికి పాలకులు వివిధ కమిటీలు వేస్తున్నాయి. అయినా, కిడ్నీ రాకెట్స్, అవయవ వ్యాపారం ఆగడంలేదంటే, ఆకలి, కరువు గ్రామాల్లో ఎంతగా తాండవిస్తుందో తెలుస్తుంది.

ఒకప్పుడు జాతర్లు జరిగితే ఊరివాళ్ళంతా కలిసిమెలిసి కళలను ఆస్వాదించేవారు. జానపద కళలు ప్రదర్శించేవారు. దాని వల్ల కళలు కాపాడబడేవి, కళాకారుల కడుపు నిండేది. ఇప్పుడు టి.వి.లు వచ్చిన తర్వాత అందరూ కలిసి మెలిసి కళల్ని ఆస్వాదించే పరిస్థితి ఎలాగూ లేదు. కనీసం ఆ కళాకారులకు ప్రత్యామ్నాయ ఉపాధిలేకుండా పోయింది. ఈ ఆవేదనను కవులు తీవ్రంగానే వ్యక్తంచేశారు.

*"ఇప్పుడు గల్లీకో కాన్వెంటు స్కూలు*
*ఆర్.ఎం.పి. డాక్టర్లు*
*పంచాయితీ ఆఫీసు రేడియో గ్రామసీమల్లేవు*
*టీ.వి. యాంటీనాలు డిష్ టీ.వి. కేబుల్ వైర్లు తప్ప*
*జానపదాలు – ఏ జాతరలో తప్పిపోయాయో పత్తాలేవు కదా–"*

*అని వి.పి. చందన్ రావు ఊళ్ళలోకి వస్తున్న కొత్త సంస్కృతిని* వర్ణిస్తున్నాడు. *"ఆరుమైళ్ల పాఠశాలకు నడచి వెళ్లిన పిల్లవాడు*
*చీకటిపడ్డా ఇంటికి తిరిగిరాలేదని*
*చేతిలాంతరుతో ఆదుర్దాతో ఎదురొచ్చే నాన్నలు*
*చిన్న ప్రయాణం పెట్టుకుని సంచీ సర్దుకోగానే*
*కన్నీళ్లు కన్పించకుండా రెప్పలు సర్దుకునే*
*అమాయకపు అమ్మలు*
*ఏమై పోయారు? ఏ మాయుకులోనై పోయారు?'* అని

డా॥కలువ గుంట రామమూర్తి నాటి గ్రామీణ సంస్కృతిలో అనేకాంశాలు ఔట్‌డేటెడ్ ఆనందాలు"గా మారిపోతున్నాయంటున్నాడు కవి. అంతే కాదు ఇలా కవులు ఆవేదన పడటం వెనుక విద్యావిధానంలో వచ్చిన మార్పులు కనిపిస్తున్నాయి.

అలాంటి విద్యావిధానం వల్ల కోల్పోతున్న మమతానుబంధాల్ని గుర్తుచేస్తున్నారు. ఒకప్పుడు చదువు విజ్ఞానం కోసం జరిగేది. ప్రపంచీకరణ తెచ్చిన అవకాశాలు, తెచ్చిపెడతాయనే ఆశలతో దగ్గరున్న పాఠశాలల కంటే,

కార్పోరేట్ విద్య వైపు చిన్నప్పటినుండే పిల్లల్ని చదివిస్తున్నారనేది కవుల ఆందోళనలోని ఆంతర్యం!

ఇంకోవైపు ఆడపిల్లల్ని అమ్ముకోవడం, వయసులో ఉన్నవాళ్ళు వ్యభిచారంలో అయిష్టంగానే దిగినా, దాన్నే వృత్తిగా మార్చేసుకోవడం, ఆ తర్వాత ఎయిడ్స్ వంటి భయంకరమైన రోగాలతో మరణించడం గ్రామీణప్రాంతాల్లోనూ కనిపిస్తుంది.

టీ.వి. ఇంటర్నెట్, సెల్ ఫోన్‌ల వినియోగం పెరిగింది. అవి గ్రామాల్లోకీ తెచ్చిన ఘనత ప్రపంచీకరణదే అయితే అవి ప్రవేశించిన తర్వాత వాటిని వినియోగించేవారి ప్రవర్తనలో, వాళ్ళు మాట్లాడే భాషలో సంస్కృతి పరంగా ఎన్నో మార్పులు కనిపిస్తున్నాయి. అశ్లీలత పెరిగింది. ఎస్.ఎమ్.ఎస్, బ్లూటూత్, వంటి సౌకర్యాలు దుర్వి నియోగమవుతున్నాయి. చాలా మంది ఫోటో కెమేరా, రికార్డింగ్ సౌకర్యాలున్న సెల్ ఫోన్‌లను అసభ్యకార్యక్రమాలకు వినియోగిస్తూ గ్రామీణ సంస్కృతిలో భయకంపిత వాతారణాన్ని సృష్టిస్తున్నారు. అది మార్కెట్ చేసుకొనేవరకూ పయనిస్తుంది. గ్రామాల్లో కూడా కంప్యూటర్ వినియోగం పెరుగుతుంది. ఇప్పటికే పట్టణాలు, నగరాలలో కంప్యూటర్ లేకపోతే ఏ పనీ జరగని పరిస్థితి నెలకొంది. దీని దగ్గర కూర్చుంటే మానవ సంబంధాలన్నీ యాంత్రిక సంబంధాలే అవుతున్నాయి.

*"చతురస్రాకారపు నీలితెర ఇప్పుడతని ఆకాశం*
*ఇప్పుడతని సర్వస్వం*
*తన ఎలుకను*
*మీటేవేలుగా మారింది*
*ఎలుకను మీటటం ఏనుగు నెక్కటానికేననీ తేలిపోయింది*
*కుశల ప్రశ్నలూలేవు, కులాసా కబుర్లూలేవు*
*ఉభయకుశలోపరులు అసలే లేవు*
*వస్తువ్యామోహంలో – వస్తు సహవాసంలో*
*మనిషి ఒక ప్రాణమున్న వస్తువు, వేళ్ళులేని మొక్క....*

*....   .....   ....   .....*

*విశ్వం కుగ్రామమైనందుకు క్షణం గర్వపడదాం*

*విశ్వం విపణి వీధిగా మారినందుకు*

*మనసులోనే తనివితీరా విలపిద్దాం*"అని ఇలాంటి వ్యవస్థను "వైరస్'గా పెన్నా శివరామక ృష్ణ వర్ణిస్తున్నాడు.

నేడు ఆంగ్ల భాషతెలిసిన వాళ్ళకి ప్రపంచవ్యాప్తంగా అవకాశాలు కూడా విస్తృతమవడంతో స్థానిక మాత ృ భాషలు అంతరించిపోయి ఆంగ్లభాష తన పెత్తనాన్ని చెలాయించే పరిస్థితి ఏర్పడింది అందువల్లనే ఎక్కువ మంది తమ పిల్లల్ని ఆంగ్లే భాషను చదివించాలనే తహతహలతో ఉన్నారు. దాన్ని చదువుకోలేని వాళ్ళు తెలుగు మీడియంలో చదువుకోవడం వల్ల పెద్దపెద్ద ఉద్యోగాలు రావనే నిరుత్సాహానికి గురవుతున్నారు. దీని వల్ల నిరక్షరాస్యత మరింత పెరిగే అవకాశం కనిపిస్తోంది.

మరో వైపు ప్రభుత్వం విద్యను అందించే పనిని కార్పోరేట్ సంస్థలకు పరోక్షంగా ఒప్పజెప్పేస్తుందనే విమర్శలు వినిపిస్తున్నాయి. మార్క్సిస్టు భావజాలం గల పార్టీలు ఈ దిశగా ప్రచారాన్ని కొనసాగిస్తున్నాయి.

*"పొద్దుణ్ణించి రాత్రిదాకా*

*మెదళ్ళ పొలాల మీద ట్రాక్టరులా మోగుతున్న టి.వి.*

*పసి మట్టిలో టెర్మినేటర్లు నాటుతుంది*

*వేల, లక్షల ఇంగ్లీషు మీడియమే స్కూళ్ళు*

*శబ్దాలతో బద్దలైపోతున్న ఆకాశం*

*..........*

*సంస్కృతి నా యిల్లైతే*

*భాష నా వీధి గుమ్మం*

*సంస్కృతి నా జీవితమైతే*

*భాష నా శ్వాస మార్గం*

*సంస్కృతి నా అమ్మైతే*

*భాష నా ఆరాధనా గీతం*
*వీధి గుమ్మాన్ని మోతరాకుండావాడు పగల గొడుతుంటే*
*ఇల్లుకన్నీటి గోడలై పునాదుల్లోకి యింకి పోతుంది.*
*శ్వాస మార్గాల్ని కొత్త యాసలు కోసేస్తుంటే*
*జీవితం చీలికలైన నాలుకల్లోకి వలస పోతుంది'*అని అద్దేపల్లి రామ్మోహనరావు వర్ణించాడు.

గ్రామీణ సంస్కృతిలో కనిపించే భిన్నపార్శ్వాలను చాలా వరకూ తెలుగు కవులు పట్టుకోగలుగుతున్నారు. కళింగ ఆంధ్ర కవులు "తూరుపు" (కళిగాంధ్ర కవిత్వం); తెలంగాణా కవులు "మత్తడి", "పొక్కిలి", "గుజరాత్ గాయం", రాయలసీమ కవులు "వొరువు" మొదలైన కవితా సంకలనాల్ని ప్రచురించారు. రంజని సంస్థ ప్రత్యేకించి "అమ్మ", "మా ఊరు" పేర్లతో రెండు కవితా సంకలనాలను తీసుకొచ్చింది. తెలంగాణా ప్రాంతం నుండీ అన్వర్ సంపాదకత్వంలో నాయిన"కవితా సంకలనం వచ్చింది. ప్రజాసాహితి, అరుణతార, నేటినిజం, ప్రస్థానం వంటి పత్రికలు ప్రపంచీకరణ వ్యతిరేక కవిత్వాన్ని అధికంగానే ప్రచురించాయి. ప్రపంచీకరణ ప్రభావంతో రాసిన కవితల్ని దిన పత్రికలు కూడా సాహిత్యానుబంధాల్లో ప్రచురించాయి.

అలాగే, తెలంగాణా ప్రాంతం నుండి మత్తడి" పొక్కిలి" వంటి కవితా సంకలనాల్ని ప్రచురించారు. రాయలసీమ ప్రాంతం నుండి రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, శాంతి నారాయణల సంపాదకత్వంలో "వొరువు' సంకలనం వచ్చింది. మధ్యాంధ్ర ప్రాంతం నుండి ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ ప్రత్యేకించి ఒక సంకలన గ్రంథం వచ్చినట్లు దాఖలాలు కనిపించడం లేదు. కానీ, కవులు విడివిడిగా ప్రచురించుకున్న కవితా సంపుటాల్లో ప్రపంచీకరణ వ్యతిరేక కవిత్వం కనిపిస్తుంది.

ఇవే కాకుండా రాష్ట్రంలోని అన్ని గ్రామీణ ప్రాంతాల్లోని వాళ్ళూ వృత్తులు, ఉద్యోగాల నిమిత్తం పట్టణ ప్రాంతాల్లో జీవిస్తూ కూడా, తమ తమ గ్రామాల్లోకి వెళ్ళినప్పుడు కనిపించే "సంస్కృతి'ని, తాము నివసిస్తున్న పట్టణ,

నగర సంస్కృతులతో పోల్చుకుని కవిత్వం రాస్తున్నారు. అలాంటి వాటిలో కొన్నింటిని రంజని సంస్థ "అమ్మ', "మా ఊరు' పేర్లతో కవితా సంకలనాలుగా ప్రచురించింది. వీటన్నింటిలోనూ అత్యధిక శాతం మంది కవులు గ్రామీణ సంస్కృతిలో భాగమైన ఉమ్మడి కుటుంబం, కుటుంబం, వ్యవసాయం, రైతుజీవనం, వలసల గురించి తమ తమ అనుభవాలను వరి?ంచారు. కోల్పోతున్న మానవ సంబంధాలను, అన్నీ "మార్కెట్' అయిపోతున్నందుకు ఆందోళనలు వ్యక్తమవుతున్నాయి.

***

# తెలుగులో దళిత పత్రికల తీరుతెన్నులు

19వ శతాబ్దంలో దేశవ్యాప్తంగా వచ్చిన అనేకమైన మౌలికమైన మార్పుల్లో పత్రికల స్థాపన ఒకటి క్రైస్తవ మిషనరీలు ప్రధానంగా తమ మత ప్రచారం కోసం ముద్రణ యంత్రాలను విరివిగా స్థాపించారు. ఆ తరువాత కొంత మంది సాంస్కృతిక పునర్జీవనంలో భాగంగా సంస్కరణోద్యమాలకు వేదికగా మరికొన్ని పత్రికలను స్థాపించారు. అంతటితో ఆగకుండా జాతియోధ్యమ సూార్తీని నలు దిశలా వ్యాపింప చేయడానికి కూడా పత్రికలు ప్రధాన సాధనంగా ఉపయోగపడతాయని గుర్తించ గలిగారు.

స్త్రీవిద్య ఆవశ్యకత, మూఢ విశ్వాసాల ఖండన, గ్రాంథిక, వ్యావహారిక భాషోద్యమాలు, వాటి వాద ప్రతివాదాలు మొదలైన వన్నీ నాటి పత్రికలలో ప్రముఖంగా కనిపించేవి. ఈ నేపథ్యంలో భారతదేశ వ్యాప్తంగా మతాంతరీకరణలో భాగంగా దళితులను ప్రస్థావిస్తూ వారి ఆర్థిక, సాంఘిక పురోభివ ృద్ధి కోసం మతాంతరీకరణ జరుగుతుందనే ద ృక్పథంతో అనేక పత్రికలు ప్రచారాన్ని కొనసాగించాయి. వార్తలు, కథలు, నవలలు, గేయాలు మొదలైన రూపాలలో కూడా ప్రచారంలో జరుగుతూ ఉండేది. దళితుల నిజ జీవితాలను, వారి అనుభవాలను వ్యక్తీకరించే ప్రసార, ప్రచార మాద్యమాల లోపాన్ని అప్పుడే నాటి దళిత మేధావులు గుర్తించగలిగారు. ఆ ఆలోచనల నుండి దళిత పత్రికలను స్థాపించాలనే ఆలోచన ప్రారంభమైంది.

భారత రాజ్యాంగం ప్రకారం షెడ్యూల్డ్ కులాలు, షెడ్యూల్డ్ తెగలు అనే విభజన ఉన్నప్పటికీ, దళితులు అనే పదం ప్రధానంగా అణచివేతకు గురవుతున్న కింది వరా?ల వారనే అవగాహనలో ప్రచారంలోకి వచ్చింది. కానీ, క్రమేపీ వెనుకబడిన తరగతులు, ముస్లింలు, గిరిజనులు తమ తమ

ప్రత్యేకతను చాటుకుంటూనే ముందుకు వస్తున్నారు.

ఈ పరిస్థితులలో దళితులు అంటే మాల, మాదిగ తదితర షెడ్యూల్డ్ కులాల వారనే అవగాహనే స్థిర పడిపోయింది. కనుక, దళితులనే పారిభాషిక పదంలాగే దళిత పత్రికలు అంటే ఏమిటో నిర్వచించేటప్పుడు కూడా కొన్ని సమస్యలు వస్తున్నాయి. దళితుల గురించి రాసిన పత్రికలు దళిత పత్రికలు అవుతాయా? దళితులు నిర్వహించిన పత్రికలు దళిత పత్రికలు అవుతాయా? అనేది నిర?యించేటప్పుడు ఈ సమస్య పైకి వస్తుంది. ఈ రెండింటినీ పరిగణలోకి తీసుకొంటూనే, దళిత సమస్యలను ప్రధానంగా చర్చించిన పత్రికలను లేదా దళిత సమస్యలనే ప్రధానంగా చేసుకొని వారిని చైతన్య పూరితం చేసేటట్లు నిర్వహించిన పత్రికలను దళిత పత్రికలు అనడం సమంజసంగా ఉంటుంది. ఈ అవగాహనతోనే ఈ వ్యాసంలో దళిత పత్రికలను గుర్తించే ప్రయత్నం చేస్తాను.

భారతదేశ వ్యాప్తంగా చూసినప్పుడు జోతీరావ్‌పూలే చేసిన దళిత ఆత్మగౌరవ పోరాటాలను ఆయన భావాలను విస్తృతంగా ప్రచారం చేసిన "దీన బంధు' పత్రికను తొలి దళిత పత్రికగా చెప్పవచ్చు. 1870లో జ్యోతిరావ్ పూలే సత్యశోధన సమాజం అనే సంస్థను స్థాపించారు. ఈ సంస్థకు సన్నిహితంగా ఉంటూ, వరా?శ్రమ ధర్మాన్ని, కర్మ కాండలను ఖ?ండిస్తూ 1880 ప్రాంతంలో నడిచిన దీనబంధు పత్రికకు నారాయణ రావ్ మేఘాజీలో ఖండే దీనికి సంపాదకుడుగా వ్యవహరించారు. డా॥ బి.ఆర్. అంబేద్కర్ 1922లో "బహిష్కృత హితకారిణి' సంస్థను స్థాపించారు. ఈ సమాజం "బహిష్కృత భారత్' అనే పత్రికను నడిపింది. శివరామ్ కాంబ్లీ "సోమవంశీ మిత్ర' అనే మాస పత్రికను నడిపారు.

1922 ప్రాంతంలోనే డా॥బి.ఆర్. అంబేద్కర్ "మూక్ నాయక్' అనే పత్రికను స్థాపించారు. దేశ వ్యాప్తంగా ఇలా వివిధ భాషల్లో దళిత పత్రికలు ప్రారంభమయ్యాయి. దళిత పత్రిక, దర్పణం, ప్రబుద్ధ భారత్, అస్మితాధర్మ, ప్రమేయ, నికాయ, జాయజా, భీం పత్రిక, జనతా, సింహగర్జన, శ్రామిక్

నివార్ మొదలైన పేర్లతో వివిధ భాషల్లో దళిత పత్రికలు వెలువడ్డాయి. ఈ నేపథ్యంలోనే జ్యోతి బాపులే, సాహూ మహారాజ్, పెరియార్ రామస్వామి నాయకర్, డా॥బి.ఆర్. అంబేద్కర్ మొదలైన వారి భావజాల ప్రభావంతో వారు తెచ్చిన చైతన్యంతో తెలుగులో కూడా దళిత పత్రికల స్థాపన ప్రారంభమైంది.

ఆంధ్రప్రదేశ్‌లో వేమూరి రాంజీరావు పంతులు 1917 నుండి మచిలీపట్నం కేంద్రంగా చేసుకొని నడిపిన “దీన బంధు’ పత్రికలో దళితులకు సంబంధించిన వార్తాంశాలు వచ్చేవి. ఆ తర్వాత హైదరాబాదు కేంద్రంగా చేసుకొని మన్య సంఘం ఆధ్వర్యంలో “పంచమం’ పత్రిక కూడా వెలువడేది. వీటిలో దళితులకు సంబంధించిన వార్తలు ప్రచురించినా, అవి దళితులకుఒక సైద్ధాంతికమైన సూార్తేని ఇవ్వలేక పోయాయని' 'తెలుగులో దళిత పత్రికలపై పరిశీలన' చేసిన గౌరీశ్వరరావు అభిప్రాయ పడ్డారు.

1942లో మద్రాసు నుంచి బి.ఎస్. మూర్తి “నవజీవన' పత్రికను ప్రచురించారు. 1950లో “వ్యవసాయకూలీ' పేరుతో బోయి భీమన్న సంపాదకత్వ సహకారంతో వేముల కూర్మయ్య ఒక పత్రికను నడిపారు. 1933లో జాలా రంగస్వామి “వీర భారతి' పత్రికను, చంద్రు మల్ల వెంకటరత్నం రాజమండ్రి కేంద్రంగా “జీవన జ్యోతి' పత్రికను, దిడ్ల పల్లయ్య 1927లో “ఆది ఆంధ్ర' పత్రికను, గెద్దాడ బ్రహ్మయ్య అమలాపురం కేంద్రంగా “ఆదిమాంధ్ర' పత్రికను, పాము రామ్మూర్తి కాకినాడ కేంద్రంగా “ఆది హిందూ' పత్రికను నడిపినట్లు ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర గ్రంథంలో యాగాటి చిన్నారావు (2007: 66, 132) పేర్కొన్నారు.

1937 ప్రాంతంలో కుసుమ ధర్మన్న సంపాదకుడుగా “జయభేరి' పత్రిక వెలువడింది. 1931 ప్రాంతంలో భాగ్యరెడ్డి వర్మ “భాగ్య నగర్' పేరుతో ఒక వార పత్రికను నడిపినట్లు తెలుస్తుంది. ఇది 1937లో “ఆది హిందూ' పత్రికగా మారింది. (విజ్ఞాన సర్వస్వం 1988: 421) బొజ్జా అప్పలస్వామి (జ్యోతి), జొన్న కోట ఆశీర్వాదం (మూక్ నాయక్), ఐ.వి. చిన్నయ్య (ఆంధ్ర రిపబ్లికన్), ఆర్. రహ్మద్ జోసఫ్ (సమతా వాణి), కె.జి. సత్యమూర్తి (ఎదురీత),

బి.ఎస్.రాములు (గబ్బిలం), కాత్యాయని (చూపు), ఇర్లపాటి వెంకన్న (చైతన్య వికాస్) ఫాదర్ అరుల్ రాజా (విద్యార్థి విశ్లేషణ)లు వివిధ పేర్లతో పత్రికలను నడిపినట్లు కొండపల్లి సుదర్శన రాజు (2002:10) పేర్కొన్నారు. వీటిలో ఎదురీత పత్రిక దళితులను చైతన్యవంతం చేయడానికి విశేషంగా కృషి చేసింది. చూపు పత్రికలో అందెశ్రీ వంటి వాళ్ళ ఇంటర్వ్యూలను, దళిత కవిత్వంలో అమ్మ వంటి వ్యాసాలను ప్రచురించింది. గౌతు లచ్చన్న "బహుజన' పత్రికను 1960లోను, "మహాజన' వార పత్రికను 1983లోను స్థాపించి నడిపారు.

తెలుగులో దళిత పత్రికలు పరిశీలన" పేరుతో కొంకే గౌరీశ్వరరావు ఎం.ఫిల్ కోసం ఒక పరిశోధన వ్యాసాన్ని ఆచార్య ఎన్.ఎస్. రాజు గారి ఆధ్వర్యంలో హైదరాబాదు విశ్వవిద్యాలయానికి సమర్పించారు. దీనిలో కొన్ని దళిత పత్రికల వివరాలు ఉన్నాయి. కానీ, వాటి స్వభావాన్ని ఆ పరిశోధన పరిధుల ద ృష్ట్యా వివరించలేదనిపిస్తుంది. అందువల్ల ఆ పత్రికలను పేర్కొంటూనే వాటిలో నేను గమనించిన ఆ పత్రికల స్వభావాన్ని విశ్లేషించే ప్రయత్నం చేస్తాను.

శెట్టి కన్నమరాజా "పీడిత జన' (1983), పొనుగుమట్ల విష్ణుమూర్తి "జనమిత్ర' (1985), ఐప్ప మధుకర్ "అరుంధతి' (2005) నెల్లి నాగేశ్వరరావు "ఉషోదయం' (2006) లు వార పత్రికలలో పేర్కొనదగినవి. వీటిలో జనమిత్ర వారపత్రిక అంబేద్కరిజంతో పాటు స్థానిక దళిత సమస్యలను ప్రచురిస్తున్నది. అయితే, ఈ పత్రిక చాలా కాలం నుండి ఒక శాసన సభ్యుడిని టార్గెట్ చేసుకొని అతని చర్యలను ఖండించే దిశగా కొనసాగుతున్నది. పేర్లు లేని లేఖలను కూడా ప్రచురిస్తున్నది. ఆ శాసన సభ్యునికీ, ఎడిటర్‌కీ మధ్య ఏవో వైయిక్తిక కారణాల వల్ల ఇలాంటి వార్తలు, వార్తాంశాలు ప్రాధాన్యత సంతరించుకుంటున్నాయని ఆ పత్రికలలోని కథనాలను పరిశీలిస్తే అర్థమవుతుంది. దీనిలో అంబేద్కర్‌పై మాత్రమే కాకుండా, గాంధీజీ పై కూడా కవితలు ప్రచురించారు. హేతు వాదానికి సంబంధించిన వ్యాసాలు కూడా

వచ్చాయి.

కేవలం దళిత రచనలకే కాకుండా, ఇతర రచనలకు కూడా ప్రాధాన్యతను ఇచ్చారు. ఎస్.సి., వర్గీకరణకు వ్యతిరేకంగా పనిచేస్తున్న పత్రిక. వర్గీకరణకు వ్యతిరేకంగా రాసిన అనేక వ్యాసాలు, కవితలను కూడ ప్రచురించింది. సాధారణంగా వార పత్రికల్లో ఉండే ఇంటి, వంట విషయాల కంటే సామాజిక సమస్యలనే ప్రధానం చేసుకోవడం దళిత వార పత్రికల ప్రత్యేకతగా చెప్పుకోవచ్చు.

గోవాడ నిరీక్షణ రావు'భాగ్య నగర్' (1956), బి.వి. రమణయ్య "జయ్ భీమ్' (1975) డా// యెండ్లూరి చిన్నయ్య "ప్రజా బంధు' (1984), వి. వామనదాస్ "బీట్-రూట్' (1985), బొజ్జా తారకం "నలుపు' (1990) పత్రికలు ప్రముఖమైనవి.

భాగ్య నగర్ కొన్ని ప్రత్యేక సంచికలను కూడా ప్రచురించింది. అంబేద్కర్, గాంధీ సంస్కరణోద్యమాల ప్రభావం ఈ పత్రికలపై ఎక్కువగా కనిపిస్తుంది. విలువైన వ్యాసాలు దీనిలో ఉన్నాయి. నలుపు పత్రికలో స్త్రీ సమస్యలను కూడా లోతుగా చర్చించే వ్యాసాలు ప్రచురించారు. వామ పక్ష భావాల రచనలు ఎక్కువగా దీనిలో కనిపించేవి. కవితలు, పుస్తక సమీక్షలు, దళిత సమస్యలను కుల, వర్గ దృక్పథాల సమన్వయంతో రాసిన అనేక రచనలను దీనిలో ప్రచురించారు.

ఉండ్రు సుబ్బారావు "హరిజన' (1933), కొత్తపల్లి సరళ "భీమ్‌భేరి' (1989), కత్తి పద్మారావు "దళిత రాజ్యం' (1994), వి.టి. రాజశేఖర్ "బహుజన సమాజ్' (1995), వి.టి. రాజశేఖర్ "దళిత వాయిస్' (1995), కె.జి. సత్యమూర్తి "ఈనాటి ఏకలవ్య' (1996), అంబేద్కర్ ఎడ్యూకేషనల్ సొసైటీ సభ్యులు "సంఘమిత్ర' (1998), ఎస్. రఘుపతి రావు "మనవాణి' (2001), దుడ్డు ప్రభాకర్ "కుల నిర్మూలన' (2001), యమలా సుదర్శన్ "దళిత శంఖారావం' (2001), బుద్ధకోటి "బహుజన కెరటాలు' (2002), సత్యానందం "దళిత బహుజన శ్రామిక విముక్తి' (2002), సాక్షి హ్యూమన్

రైట్స్ వాచ్ ఎ.పి. సంస్థ "సాక్షి' (2003), పిల్లి డేవిడ్ కుమార్ "దళిత కమెండో' (2003), అంబేద్కర్ మిషన్ సభ్యులు "అంబేద్కర్ మిషన్' (2004), సి. హెచ్. విద్యాసాగర్ ప్రధాన సంపాదకుడు, ప్రచురణకర్తలుగా "దండోరా' (2008), ఎల్.ఎస్. రావు ప్రధాన సంపాదకులుగా "అరుంధతీయవాణి' (2008) పత్రికలు ముఖ్యమైనవి.

దళిత రాజ్యంలో కత్తి పద్మారావు, దేవరపల్లి మస్తాన రావుల రచనలే అధికంగా కనిపిస్తున్నాయి. ఇది దళిత మహా సభకు కరపత్రంలా ఉండేది. కత్తి పద్మారావు రచనలకు వేదికగా ఉండేది. వీటిలోని వ్యాసాలు తర్వాత కాలంలో కొన్ని పుస్తకాలుగా కూడా ప్రచురించారు. దళిత చరిత్ర, సామాజిక, సాంస్కృతిక అంశాలపై సాధికారికమైన వ్యాసాలు ప్రచురించారు. ఈ పత్రిక కూడా ఎస్.సి. వర్గీకరణకు వ్యతిరేకంగానే పనిచేసింది. దళిత సమైక్యత పేరుతో రచనలను ప్రకటించింది. బహుజన సమాజ్, దళిత వాయిస్ పత్రికలు దళిత దార్శనికతను ద ృష్టిలో పెట్టుకొని దళితుల్లోని అత్యధిక కులాల భావాలను సమీకరించే దిశగా కొనసాగింది. దళిత సాహిత్యానికి సంబంధించిన ప్రత్యేక సంచికను కూడా ప్రచురించడం ఒక విశేషంగా చెప్పుకోవచ్చు.

ఈనాటి ఏకలవ్య దళితుల్లో గొప్ప ఆశను కలిగించింది. దళిత వార్తలను, విశ్లేషణలను ప్రచురిస్తూనే, దళిత సాహిత్యంలో వస్తున్న కొత్త ధోరణులను కూడా స్పృశించగలిగింది. దళిత సౌందర్యంపై విలువైన వ్యాసాలను కలిపి ఒక ప్రత్యేక సంచిక కూడా ప్రచురించింది. మంచి కవితలు, కథలు, సమీక్షలు, ఇంటర్వ్యూలను ప్రచురించింది. మాదిగ సాహిత్యానికి, ఎస్.సి. వర్గీకరణకూ కొంత వరకూ వేదికగా నిలిచింది. అయినంత మాత్రం చేత పూర్తిగా సమర్థించిందని చెప్పలేం. కానీ, కొంత ప్రజాస్వామిక ధోరణిని ప్రదర్శించింది. నాగప్పగారి సుందర్రాజు ఇంటర్వ్యూని ప్రచురించిన ఏకైక తెలుగు దళిత పత్రిక ఇదే! విద్యావంతులు, మేధావులు, కళాకారులను ఒక వేదికపైకి తేవాలనే ఆరాటం ఆ పత్రిక రచనలు, ఆశయాలు, లక్ష్యాలలో

కనిపించినా, ఆ పత్రిక లక్ష్యం నెరవేరకుండానే ఆగిపోయింది. మంచి క్వాలిటీ పేపర్‌తో నడిపిన మొట్టమొదటి దళిత పత్రిక అని అభివర్ణించగలిగే పూర్తిగా అవకాశం ఉంది.

మనవాణి పత్రికలో బౌద్ధ మత భావాలు, అంబేద్కర్ రచనల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. భారతీయ సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ వారి ప్రకటనలు, దళిత సభల వివరాలు వంటి వాటిని ఎక్కువగా ప్రచురిస్తుంది. ఇది కూడా ఎస్.సి. వర్గీకరణను సమర్థించకపోగా, దాన్ని వ్యతిరేకిస్తూ సంపాదకీయాలను రాసింది. బహుజన సమాజ్ పార్టీకి సంబంధించిన రాజ్యాధికార వార్తల దిశగా కొనసాగుతుంది. తిరుమల తిరుపతి దేవస్థానం వారి శ్రీ వేంకటేశ్వరస్వామికి సంబంధించిన ప్రకటనలు దీనిలో ఎక్కువగా కనిపిస్తాయి.

వి. నందగోపాల్ ప్రచురణ కర్తగా సాక్షి హ్యూమన్ రైట్స్ వాచ్, ఆంధ్రప్రదేశ్ వాళ్ళు బై మంత్లీగా “నిఘా’ పేరుతో ఒక పత్రికను తీసుకొస్తున్నారు. అయితే, దీన్ని ప్రైవేటు సర్క్యులేషన్‌గా ప్రకటించారు. దేశంలో, రాష్ట్రంలో వివిధ ప్రాంతాలలో దళితులపై జరుగుతున్న హత్యాచారాలను తేదీలతో సహా ప్రకటించటం ఈ పత్రిక ప్రత్యేకత. అలాగే, రాజ్యాంగంలో పేర్కొన్న వివిధ హక్కులను, చట్టాలను,ఆ పూర్తి వివరాలను అందిస్తుంది. అలాగే, దళిత ఉద్యమంలో విద్యారంగంలో నిషా?తులైన వారి చేత ఎంతో సాధికారితతో రాయించిన వ్యాసాలను ప్రచురిస్తున్నారు. సంఘటనలు ప్రత్యక్షంగా పరిశీలించిన వివరాలను అందించడం కూడా మరో ప్రత్యేకత. అయితే, దీన్నెందుకు ప్రైవేటు సర్క్యులేషన్‌గా ప్రకటించారో తెలియాలంటే ఆ పత్రికలన్నీ లోతుగా విశ్లేషించవలసి ఉంటుంది. కొసమెరుపుగా ఈ పత్రికలో ఒక కవితను ప్రచురిస్తుంటారు.

“కుల నిర్మూలన’ పత్రిక వర్గ ద ృక్పథంతో దళిత సమస్యలను వివరిస్తున్నది. గేస్ నిర్మల ఆధ్వర్యంలో “దళిత’ త్రైమాసిక పత్రిక (2005) నడుస్తున్నది. దీనిలో దేవదాసీ వ్యవస్థ గురించి వ్యాసాలు ప్రచురిస్తున్నారు.

దండోరా పత్రిక మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి వాళ్ళ అధికారిక పత్రికలా ఆ వార్తలకే అధిక ప్రాధాన్యం కనిపిస్తుంది. కలర్‌తో ప్రచురిస్తున్నారు. పత్రికలో ప్రచురించే అంశాల పట్ల మరింత స్పష్టత అవసరం. సినిమా విషయాల నుండి ఇంటి చిట్కాల వరకూ దొరకిన ప్రతీ విషయం ప్రచురిస్తున్నట్లు కనిపిస్తుంది. వ్యాసాల విషయంలో ప్రామాణికత సాధించవలసిన అవసరం ఉంది. హిందూ భావజాలాన్ని కూడా వివిధ వ్యాసాల్లో ప్రచురిస్తుండడం ఆశ్చర్యకరం. తెలంగాణ ప్రాంత దళితులకు అధిక ప్రాధాన్యతనిస్తున్న పత్రిక, సమకాలీన రాజకీయ సమస్యలను వ్యాఖ్యానిస్తూ సంపాదకీయాలు రాస్తుంటుంది.

అరుంధతీయ వాణి పత్రిక కూడా దండోరా నడుస్తున్న దారిలోనే నడుస్తున్నట్లు కనిపిస్తున్నా, దాని కంటే కొంచెం విలువైన వ్యాసాలను ప్రచురిస్తున్నది. అయితే, క్రైస్తవ మత, దైవ ప్రచారం ఈ పత్రికలో అంతర్గతంగా కనిపిస్తుంది.

ప్రస్తుతం వస్తున్న దళిత పత్రికలలో సాధ్యమైనంత వరకూ అంబేద్కర్ లక్ష్యాలకు దగ్గరగా నిలుస్తూ, ఒక ప్రామాణిక పద్ధతిలో కొనసాగుతున్న పత్రిక మాత్రం బహుజన కెరటాలు. దీన్ని కలర్ అయిల్ పెయింట్ కవర్ పేజీతో ఆకర్షణీయంగా ప్రచురిస్తున్నారు. దీనిలో సంపాదకీయాలు, వ్యాసాలు, కవితలు, సమీక్షలు, వార్తాంశాలు, ఫోటోల ఎంపికలో, ప్రచురణలో చాలా జాగ్రత్తను పాటిస్తున్నారు. రాజ్యాధికారానికి కావలసిన భావజాలాన్ని అందించడమే కాకుండా, సాంస్కృతిక అంశాలపై కూడా దృష్టిని కేంద్రీకరించడం ఈ పత్రిక మరో ప్రత్యేకత, ఊరు నుండి ప్రపంచం వరకూ దళిత, పీడిత ప్రజల ఆలోచనలను ఆశయాలను, విజయాలను విశ్లేషిస్తూ రచనలను ప్రచురిస్తున్నారు. ఉత్తర భారతదేశంలోనే దళిత వర్గాల్లో వచ్చిన రాజకీయ చైతన్యాన్ని దీప్తి వంతం చేస్తూ కాన్షీరామ్ ఆలోచనల వేదికగా ఈ పత్రిక నడుస్తున్నట్లు అనిపిస్తుంది. రాజకీయ అధికారం సాధించడం ద్వారా దళితుల సమస్యలెన్నీ పరిష్కారమవుతాయనే లక్ష్యంతో పయనిస్తుంది. ఈ

వ్యూహంలో భాగంగానే ఎస్.సీ వర్గీకరణను సమర్థిస్తూ ఒక ప్రత్యేక సంచికను కూడా ప్రచురించడం చారిత్రాత్మక విశేషం. అయితే దీనిలోని వ్యాసాల విశ్లేషణల పట్ల భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నా, దళిత పత్రికల్లో మొట్టమొదటి సారిగా ఒక ప్రజాస్వామిక రీతిలో వర్గీకరణను సమర్థిస్తునట్లు ప్రకటించడం హర్షణీయం.

కవులపై కూడా ప్రత్యేక సంచికలను ప్రచురించడమే కాకుండా, ఆ పత్రికల్లో వచ్చిన వ్యాసాలను కొన్నింటిని ఎంపిక చేసి పుస్తకాలుగా కూడా తీసుకొని రావడం జరుగుతుంది. ప్రజారాజ్యం కూడా ఇలాంటి పని చేసినా, అది ఒకరిద్దరి రచనలపై దృష్టి కేంద్రీకరించడమే ప్రధానంగా కనిపిస్తే, ఈ పత్రిక ఒక భావజాలాన్ని ప్రచారం చేసే దిశగా పుస్తక ప్రచురణను చేపట్టడం దీని ప్రత్యేకతను తెలుపుతూ, ప్రజారాజ్యం పత్రిక కంటే ఒక అడుగు ముందుకు నిలిచేలా ఉంది.

కొన్ని విషయాల్లో ముఖ్యంగా మాల రచయితలకు వారి రచనలకే ప్రాధాన్యతనిస్తున్నారనే విమర్శలను గుర్తించి వాటిని సరిదిద్దుకోగలిగితే భవిష్యత్తులో తెలుగు దళిత పత్రికల్లో ఉత్తమ పత్రికగా నిలుస్తుందనే ఆశ కల్పిస్తుంది. దళితులు కూడా సమర్థవంతంగా, ప్రామాణికమైన వ్యాసాలను రాస్తూ, పత్రికను నడపగలరని నిరూపించగలిగే సత్తా ఉన్న పత్రికగా పేర్కొనే అవకాశం ఉంది.

మొత్తం మీద దళిత పత్రికలను పరిశీలించినప్పుడు, ప్రధానంగా కింది ఆశయాలు కనిపిస్తున్నాయి.

అస్పృశ్యత నిర్మూలన, కుల నిర్మూలనలకు కృషి చేయడం;

స్థానిక, రాష్ట్ర, జాతీయ దళిత విశేషాలను తెలియజేయడం;

దళితుల అభివృద్ధి కోసం పాటుబడిన వారి వార్తలను ప్రచురించి దళితులలో నూతన చైతన్యాన్ని, దళిత సూార్తిని పెంపొందించడం;

దళిత కవులను వారి జయంతి, వర్ధంతులను, ఆ సందర్భంగా వచ్చిన వార్తలను ప్రచురించడం;

దళిత నాయకులను వారి జయంతి, వర్థంతుల వార్తలను ఆ సందఠరేగా ప్రత్యేక వ్యాసాలను ప్రచురించి సమకాలీన దళిత సమస్యలను సమీక్షిస్తూ దళితులను చైతన్యవంతం చేయడం;

వివిధ ప్రాంతాలలో దళితులపై జరుగుతున్న దాడులను, హత్యాచారాలను, అత్యాచారాలను తెలుపుతూ అలాంటివి జరగకుండా ఉండటానికి దళిత సంఘాల ఆవిరావే ఆవశ్యకతను తెలపటం;

దళితులపై జరిగిన లేదా జరుగుతున్న వివిధ సంఘటనల పూర్వా పరాలను తెలుసుకొని వాస్తవ విషయాలను అందించటానికి ప్రయత్నించటం;

దళితుల అభ్యున్నతి కోసం ప్రభుత్వం చేస్తున్న వివిధ సంక్షేమ కార్యక్రమాలు, ఆ పథకాల, ఆ ప్రభుత్వ ఉత్తర్వుల వివరాలను అందించటం;

డా॥బి.ఆర్. అంబేద్కర్, జ్యోతి బాపులే, కాన్షీరామ్, మాయావతి మొదలైన దళిత నాయకుల రాజకీయ లక్ష్యాలను, భావ జాలాన్ని విస్తృతంగా వ్యాపింప జేయాలనుకోవటం;

దళితులను చైతన్యవంతం చేసే కవితలు, కథలు, పాటలు, పుస్తకాల సమీక్షలు, దళిత కవుల, కళాకారుల పరిచయాలు... ఇలాంటి వాటిని కూడా ప్రచురించడం;

ఇలా అనేక లక్ష్యాలతో దళిత పత్రికలు నడుస్తున్నాయి. ప్రారంభించిన కొంత కాలానికే ఆర్థిక పరమైన ఇబ్బందుల వల్ల చాలా పత్రికలు మూత పడిపోవటం ఒక విషాదకరమైన విషయం. దళితుల సాంస్కృతిక అంశాలను లోతుగా చర్చించడానికి తగినన్ని పుటలను దళిత పత్రికల్లో చేర్చలేక పోవడం కూడా ప్రధానంగా కనిపిస్తుంది. "బహుజన కెరటాలు', "నీలి జెండా' (జ్ఞానేశ్వర్) పత్రికలలో దళితుల సాంస్కృతిక పరమైన అంశాలపై దృష్టి పెట్టినా, నిషా?తులై ఉండి ముందుకు రాని దళిత రచయితలు కొరత కూడా కనిపిస్తుంది.

దళిత రచయితలలో కూడా అనేక మంది విషయ నిషా?తులు ఉన్నా, వారి పరిశోధనాంశాలను దళిత పత్రికలలో ప్రకటించడానికి చాలా

మంది ఆసక్తి చూపించడం లేదా? లేకపోతే దళిత పత్రికలు ఉన్నట్లే వారికి తెలియడం లేదో పరిశీలించవలసి ఉంది. దళిత రచయితలంతా దళిత పత్రికలలో ప్రచురణకు ప్రామాణిక వ్యాసాలను సంక్షిప్తం చేసి అందిస్తే ఆ పత్రికలకు మరింత శక్తి పెరుగుతుంది. ప్రస్తుతం ఆ కొరత కూడ దళిత పత్రికల్లో కనిపిస్తుంది. అందువల్ల "బహుజన కెరటాలు' పత్రిక చాలా తెలివైన నిర?యం తీసుకొని ఆయా రంగాలలో నిషా?తులైన రచయితలను సంపాదక, సలహా వర్గాలుగా భాగస్వామ్యం చేసి వాళ్ళు రాయడాన్ని ఒక సామాజిక బాధ్యతగా గుర్తింపజేస్తుంది.

విశాఖపట్నం నుండి వెలువడే "ప్రకాశిని' మాస పత్రికను ఆచార్య యోహన్ బాబు, డా॥ కే.యస్. ఎన్. రాజులు జనరల్ పత్రికగ?, నడుపుతూనే దళిత రచయితలకు ప్రాధాన్యతనిస్తున్నారు. ముఖ్యంగా దళిత రచయితలు రాసిన పరిశోధన పత్రాలను ప్రచురిస్తున్నారు.

తెలుగులో దళిత పత్రికలు వస్తున్నప్పటికీ ఆర్థిక కారణాల వల్ల ఆనతి కాలంలోనే మూత పడుతున్నాయి. దళితుల అన్ని పార్శ్వాలను స్ప ృశించాలంటే కనీసం దళిత రాజకీయ వేత్తలు, సివిల్ సర్వీసెస్ ఉద్యోగులు, విశ్వ విద్యాలయ అధ్యాపకులు, ఆర్థికంగా అందుకోగలిగిన దళితులు మేధావులతో కలిసి దిన పత్రికను, ఒక మాస పత్రికను నడపవలసిన అవసరం ఎంతైనా ఉంది. అప్పుడు మాత్రమే దళితులలో ఉన్న చైతన్యాన్ని సమర్థవంతంగా ప్రదర్శించడానికి వీలవుతుంది. ఆ దిశగా దళితులంతా ఆలోచిస్తారని ఆశిద్దాం.

## ఆధార గ్రంథాలు:


గౌరీశ్వర రావు, కొంకే. 2007, తెలుగులో దళిత పత్రికలు-పరిశీలన. (ఎం.ఫిల్ అముద్రిత పరిశోధన వ్యాసం) హైదరాబాదు విశ్వ విద్యాలయం: హైదరాబాదు.

చిన్నారావు, యాగాటి. 2007, ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర (1900-1950). హైదరాబాదు బుక్ ట్రస్ట్ ప్రచురణ: హైదరాబాదు.

రామరాజు, బిరుదురాజు. (సంపాదకులు) 1988, విజ్ఞాన సర్వస్వం (తెలుగు సంస్కృతి–2) తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ: హైదరాబాదు.

లక్ష్మణరెడ్డి, వి. 2002, తెలుగు జర్నలిజం అవతరణ వికాసం. రచనా జర్నలిజం కళాశాల ప్రచురణ: హైదరాబాదు.

వెంకటేశ్వరరావు, పొత్తూరి. 2004, ఆంధ్రజాతి అక్షర సంపద తెలుగు పత్రికలు. ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ ప్రచురణలు: హైదరాబాదు.

సత్యనారాయణ, ఎస్వీ. (సంపాదకత్వం) 2000, దళిత వాద వివాదాలు. విశాలాంధ్ర ప్రచురణ: హైదరాబాదు.

హైమావతి. 1978, పాలేరు నుంచి పద్మశ్రీ వరకు బోయి భీమన్న. సన్మాన సంఘ ప్రచురణ: హైదరాబాదు.

***

# మాష్టార్జీ సాహిత్యంలో మట్టిపరిమళాలు

మాష్టార్జీ పేరు అనగానే మూలవాసి సిద్ధాతం గుర్తుకొస్తుంది. మూలవాసి సిద్ధాంతం పేరు విన్నా మాష్టార్జీ గుర్తుకొస్తాడు. ఆయన తెలుగులో ఆ సిధాంతాన్ని అంతా అలా ప్రచారం చేసాడు. ఆయన ప్రతి పాటలోనూ మూలవాసి ప్రస్తావన కనిపిస్తుంది. అందుకో దండాలు బాబా అంబేద్కరా...

పాట విన్నా తెలిసిన వాళ్ళందరికి మాష్టార్జీ గుర్తుకు వస్తాడు. వీటన్నింటితో పాటు ఆయన గురించి ప్రత్యక్షంగా తెలిసిన వారికి మాష్టార్జీ ఒక నటుడు, దర్శకుడు అని కూడా సూరిస్తాడు. ఆయన అసలు పేరు గంగాధరి శ్రీరాములు. అయినా ఆ పేరు కంటే అందరికి ఆయన మాష్టార్జీగానే సుపరిచితులు. పాటల్ని పాడటం. అనేక మంది నేర్పి మాష్టార్జీ అయ్యాడు. ఆయనలోని కళా నైపుణ్యం మాష్టార్జీ అని గౌరవించేలా చేసింది. జీవనోపాధి కోసం "మాష్టార్జీ' అని గౌరవించేలా చేసింది. జీవిత వివరాల లోతుల్లోకి వెళ్ళితే ఆయన వృత్తి వేరు. ప్రవృత్తి వేరు. జీవనోపాధి కోసం మాష్టారుగా బతకడం లేదు. కళను బతికించడం కోసం మాష్టారుగా జీవిస్తున్నాడు. ఆయన భారత ఆహార సంస్థలో ఒక ఉద్యోగి. అత్యంత దిగువ స్థాయి ఉద్యోగిగా చేరి నేడు ఆ స్థాయిలో మరింత కొంత ముందుకెళ్ళగలిగాడు. ఆ ఉద్యోగం ఉపాధి కలిగిస్తుంది. అది చాల్నికుంటే ఒక గొప్ప కళాకారుడు తయారయ్యేవాడు కాదు. తెలుగు సాహిత్యానికి అనేక మానవ విలువల్ని బోధించగలిగే అనుభవపూర్వక సృజనాత్మక సత్యాలందేవి కాదు.

మాష్టార్జీ పాటైనా, ఆటైనా ఆయనకు ఒక్కసారిగా పుట్టుకొచ్చింది కాదు. చిన్ననాటి నుండే అనుభవపూర్వక ఆవేదన నుండి, అవమానాల నుండి అణచివేతల నుండి, ఆశల నుండి పుట్టుకొచ్చింది. ఆయన సాహిత్యంలో ఉండేదేమిటంటే అసలైన జీవితమని అది గమనించిన ప్రతి వాళ్ళకీ తెలుస్తుంది.

మాష్టార్జీ తెలంగాణ ప్రాంతంలోని బొల్లారంలో 7 సెప్టెంబరు 1952 న సత్తెయ్య, రాజెమ్మలకు జన్మించాడు. ఇది సికింద్రాబాదుకి దగ్గరలోనే ఉంటుంది. వీరి పూర్వీకులు మాత్రం మెదక్ జిల్లాలోని అనాజ్ పురం గ్రామంలో ఉండేవారు. వీరి తాత, తండ్రీ వెట్టి పనిచేసే వారు. ఆకలి అన్నింటినీ నేర్పుతుందన్నట్లు దాన్ని తీర్చుకోవడానికి తాళ్ళు పేనే వారు. వాటిని ఊరూరా తిరిగి అమ్మేవారు. అలా సికింద్రాబాదులోని కంటోన్మెంటు ప్రాంతంలో కూడా ఆ తాళ్ళు అమ్మేవారు. అప్పుడే అక్కడి వాళ్ళతో బాగా పరిచయం అయ్యింది.

ఒకవైపు వెట్టి చేసినా ఆకలి తీరకపోయినా, అనేక బాధలకు గురవ్వవలసి వచ్చేది. వాళ్ళకి ఆ బాధల నుండి తప్పించుకోవాలంటే ఆ ఊరి నుండి పారిపోవడం తప్ప మరో మార్గం కనిపించలేదు. అలాంటి పరిస్థితుల్లో మాష్టార్జీ తండ్రి బొల్లారం వెళ్ళిపోయి, తెలిసిన వారి సహకారంతో అక్కడే స్థిరపడ్డారు. అక్కడే అనేక ఆటు పోట్ల మధ్య మాష్టార్జీ విద్యాభ్యాసం కొనసాగింది.

1968 నాటికి తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమం బాగా ఊపందుకున్న పరిస్థితుల్లో పాఠశాలల్ని మూసేశారు. అందువల్ల చదువు అర్థాంతరంగా ఆగిపోయింది. అప్పటికి తొమ్మిదవ తరగతి పూర్తయినా, ఎస్.ఎస్.ఎల్.సీ పూర్తి కాలేదు. అయినా పట్టుదలతో తర్వాతైనా అంటే 1974లో మెట్రిక్యులేషన్, 1986లో బి.ఏ., 1995లో ఎల్.ఎల్.బి., పూర్తిచేశాడు. ఇంకా చదువు పట్ల ఆసక్తి పోలేదు. దాన్నింకా ఆయన కొనసాగిస్తూనే ఉన్నాడు. ఈ డిగ్రీలన్నీ రెగ్యులర్‌గా అన్నీ సమకూరిన తర్వాతే చదువుకుంటే వచ్చినవి కాదు. ఒకవైపు పని, మరొక వైపు చదువు కోసం ఆరాట పడితేనే వచ్చాయి. ఆయనకీ డిగ్రీలు రాకముందు నుండే పాటల్ని రాసే అలవాటుంది. చిన్ననాటి నుండే అంబేద్కర్ పాటలు పాడటం, సినిమా పాటల్ని అనుకరిస్తూ రాయడం, క్రమేపీ సొంతంగా పాటలు రాసి, తానే బాణీలు సమకూర్చుకొని పాడటం బాగా అలవాటు చేసుకున్నాడు. ఆ తర్వాత గేయ రూపకాల్ని రాసి ప్రదర్శించడం ఇలా కళారూపాలకు సంబంధించిన

అనేక మెలకువల్ని నేర్చుకున్నాడు.

పాటలతో పాటు, నాటకాల్ని, వీధి రూపకాల్ని, కవిత్వాన్ని రాసినా తనకు పాట రాయడం, అంతకంటే దాన్ని పాడటమే తన ప్రాణంగా ఆయన భావిస్తాడు. అణగారిన వర్గాలన్నీ ఏకమై ఏదొకనాడు రాజ్యాధికారానికి రావాలనే ఆశయమే ఆ పాటల నిండా కనిపిస్తుంటుంది. అందుకే అనేక ప్రక్రియల్లో రచనలు చేసినా పాటంటేనే ఆయనకు ప్రాణం. మాష్టార్జీ మూల వాసుల పాటలు, అఖండ విప్లవ జ్యోతి – అంబేద్కర్ (సాంఘిక నాటకం), ఔనుమల్లా! (వీధి నాటకం), అంగులీమాలుడు (చారిత్రక నాటకం), బౌద్ధ గీతాలు, మట్టిపూలు (కవితా సంపుటి) ఇవన్నీ 2008లో పుస్తకరూపంలో వచ్చాయి. కానీ, వాటిలో పాటలు, కథలు చాలా వరకూ పుస్తకరూపంలో రాకముందే ప్రసిద్ధి చెందాయి. మాష్టార్జీని ప్రజావాగ్గేయ కారుణ్ణి చేశాయి.

పై విషయాలన్నీ గమనించినప్పుడుమాష్టార్జీ నిర్వచించిన మూల వాసుల సిద్ధాంతం పడికట్టు సిద్ధాంతం (అరిస్టోకారిక్ థియరీ) కాదు. ఇది నిరంతరం మారే సిద్ధాంతంగా తన ప్రతిపాదనలో సూచిస్తాడు. మానవ పరిణామ క్రమంలో ఆయా ఖండాలలో ఉదవించిన మానవ సమాజాలే మూలవాసులు. ఏ ప్రాంతానికి చెందినవారు ఆ ప్రాంతాల మీద రాజకీయ, సామాజిక, సాంస్కృతిక, ఆర్థిక, భాష ఆదిపత్యం ఉండాలన్నదే ఈ సిద్ధాంతం. నేడు దళితుల్ని పిలవబడుతున్న ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీ మతాల్లోకి మారిన అసలైన భారతీయులు మూల వాసులు' అని మాష్టార్జీ రచనలపై పరిశోధన చేసిన మద్దెల రాజు ఆ సిద్ధాంతాన్ని వివరించడంలో లోతైన పరిశీలన కనిపిస్తుంది. (మద్దెల రాజు, 1998: 26,30,31).

మాష్టార్జీ ఆంధ్రప్రదేశ్‌లో మొదటిసారిగా దళిత కళామండలిని స్థాపించి, ప్రజల్ని చైతన్యపరుస్తున్నాడు. దళితుల్ని గాంధీ హరిజనుల్ని పిలవడాన్ని మాష్టార్జీ తన పాటల్లో నిరసించాడు. ఒకప్పుడు యజ్ఞ యాగ?దుల పేరుతో ఘోరంగా పశువుల్ని వధించిన వారే దళితులు మాంసాహారాన్ని తినడాన్ని అసహ్యించుకోవడాన్ని ఖండిస్తున్నాడు కవి. హిందూ మతం దళితుల్ని

దారుణంగా అణచివేయడమే కాదు, తీవ్రంగా అవమానించడాన్ని సహించలేని తిరుగుబాటు తత్త్వం ఆయన పాటల నిండా వినిపిస్తుంది.

మాష్టార్జీ సాహిత్యంలో బహుజన హితం ఉంటుంది. మాష్టార్జీ సాహిత్యం బహుజన హితాన్ని కోరుతుంది. బహుజన వాదాన్ని బలపరుస్తుంది. ఈ దేశంలో అత్యధిక సంఖ్యాకులు ఎస్.సి., ఎస్.టి., బి.సి., మైనారిటీల్ని పిలవబడే ముస్లిం, క్రైస్తవులు సర్వ సాధారణంగా శ్రామిక వర్గానికి చెందిన వాళ్ళను మేధావులు బహుజనుల్ని పిలుస్తున్నారు. కష్టపడి పనిచేసే వాళ్ళు కూడా ఈ దేశ మూలవాసులే అనేది మాష్టార్జీ సిద్ధాంతం. వీళ్ళకే రాజ్యాధికారం దక్కాల్ని వాదిస్తారీయన. ఈ భారతదేశంలో శ్రామిక వర్గం కులవృత్తుల రూపంలో ఉంది. పరిశ్రమలు ఎక్కువైన తర్వాత, యంత్రాలతోనే పని చేయించుకుంటూ వృత్తుల్ని, మానవ వనరులన్నీ రోజురోజుకీ తగ్గిపోతున్నాయి. వైజ్ఞానికంగా అభివృద్ధి చెందినా, మానవ వనరుల్ని సక్రమంగా వినియోగించుకోకుండా, సర్వ మానవుల శ్రేయస్సుని కోరుకోకుండా జరిగే అభివృద్ధి నిజమైనది కాదని మాష్టార్జీ ఘోషిస్తున్నాడు. ఆ విధంగా ప్రపంచీకరణను కూడా వ్యతిరేకిస్తున్నాడని వేరే చెప్పాల్సిన పనిలేదేమో!

చైతన్యవంతమైన దళిత రచయితలు తమ జీవితంలో ఒక్క అక్షరమైనా తమ కోసమే జీవించిన దార్శనికుల్ని కీర్తించకుండా ఉండరు. అలాగే మాష్టార్జీ కూడా కీర్తించారు. దాని ద్వారా భవిష్యత్తు తరాలకు స్ఫూర్తినిస్తున్నాడు. ఈ దృక్పథంతో పాటల్ని రాయడంలో, పాడడంలో, ప్రదర్శించడంలో మాష్టార్జీ ఎంతో ముందున్నారు.

*అందుకో దండాలు – బాబా అంబేద్కరా*

*అంబరాన ఉన్నట్టి– చుక్కలు గురవంగో*

*ముందుగా నిను దలచి – పాటలు పాడేము*

*చీకటి మా బ్రతుకుల్లో – సూర్యుడు పొడవంగో'* (మాష్టార్జీ దళిత గీతాలు, 1994:6) అలా అంబేద్కర్ దళితులకు ఎలా చైతన్యమయ్యాడో మాష్టార్జీ వరి?ంచాడు. ఈ ధోరణిలోనే గౌతమ బుద్ధుడు, జ్యోతిరావు బాపూలే,

సావిత్రీబాయి పూలే, పెరియార్ రామస్వామి నాయకర్, జగజ్జీవన రామ్, జాషువా, నెల్సన్ మండేలా, సదాలక్ష్మీ, కాన్షీరామ్ మొదలైన వారెందరి గురించో స్ఫూర్తి దాయకమైన పాటల్ని రాశాడు. వాటిని అనేక చోట్ల తన గళంలో పలికించారు. ఆయన గొంతు విన్న వాళ్ళెంతో మంది ఆ పాటల్ని కావాలన్నారు. పుస్తక రూపంలో రానప్పుడు వాటిని రికార్డ్ చేసుకొని, దాన్ని జాగ్రత్తగ? దాచుకొని, ఆ పాటల్ని నేర్చుకొని ఆ దళిత నేతల జయంతులు, వర్ధంతుల్లో పాడుకొనే వారు. ఇప్పుడా పాటలు మాష్టార్జీ మూలవాసుల పాటలు" పేరుతో 2008లో అందరికీ అందుబాటులోకి వచ్చాయి.

మాష్టార్జీ రాసిన వచన కవిత్వంలో కూడా ఇలా దళిత దార్శినికుల్ని కీర్తించడం కనిపిస్తుంది. మాదిగ సాహిత్యావాదాన్ని తెలుగు సాహిత్యంలో ఒక ధోరణిగా గుర్తించేలా చేసిన వారిలో నాగ?ప్ప గారి సుందర్ రాజు ఒకడు. అతడు చనిపోయిన తరువాత ఎంతో బాధతో ఒక స్మృతి గీతాన్ని రాస్తూ ...

*''ఆకాశం అంచుదాకా ఎగరకుండానే*
*నేలరాలావూ...*
*ఊరి చివరకు గెంటేసిన*
*మనువాదుల మెడలు వొంచి*
*మాదిగోడిని కావ్య నాయకుడ్నే చేసి*
*తెలుగు సాహిత్య సౌందర్య శాస్త్రానికి*
*నూతన అంగ వస్త్రాన్ని కప్పావు'* ' అని గుర్తుచేసుకున్నాడు.

అలాగే గిరిజనుల కోసం పోరాడిన సాహూని కీర్తిస్తూ...

*"గిరిజనుల దు:ఖానికి ఓదార్పుగా*
*భయాన్ని పారద్రోలే భరోసాగా*
*వాళ్ళ భాషనే నేర్చిన బంధువుగా*
*వాళ్ళ జీవితంలో భాగస్వామిగా'*మారడాన్ని కీర్తిస్తున్నాడు.

సాహూ గిరిజనుల్లో తెచ్చిన చైతన్యాన్ని మరచి పోలేనిదని విశ్లేషిస్తున్నాడు

కవి. ఇలా బోయి భీమన్న గురించి కూడా రాశాడు. తమకు రావలసిన వాటా తమకు దక్కాల్ని మాదిగలు, మిగిలిన దళిత ఉప కులాల వాళ్ళు చేస్తున్న వర్గీకరణ వాదంలో సామాజిక న్యాయాన్ని సమర్థిస్తానే, రాజ్యాధికారానికి పయనించమంటున్నాడు.

తెలంగాణపై కూడా స్పందించాడు. నాటి కోటి రత్నాల వీణలా తెలంగాణ లేదని, దానికి అగ్ర వర? పాలకుల, భూస్వాముల పాలనే కారణమంటున్నాడు. ఇలా అనేక భావాలతో వచన కవిత్వల్ని కూడా రాసి వారి చైతన్యంతో ముందుకెళ్ళమని ప్రబోధిస్తున్నాడు. దళిత, బహుజనులకు నిజమైన విముక్తి కలిగించగలిగే ప్రత్యామ్యాయాన్ని బుద్ధుని బోధనల నుండి, జ్యోతి బాపులే, అంబేద్కర్ భావజాలాల నుండి స్వీకరించాల్ని భావిస్తున్నాడు.

*"మన మేడ చదువుకుంటె వాళ్ళ చేతులుండరని*
*మార్క్స్ ముసుగు తొడుగుకున్న మనువాద బ్రాహ్మణులు*
*మన చదువులనాపుతుండ్రు తమ వాదన కుట్రలతో*
*మనువు గాడు ఆపె చదువు మార్క్సిస్టు ఆపె చదువు*
*ఇద్దరొక్కటన్న మాట ఇప్పుడు తెలుసుకున్నామో..'* ' (మాష్టార్జీ దళిత గీతాలు, 1994:32) అని కొంత మంది మార్క్సిస్టులు తమ సంతానాన్ని విదేశాల్లో చదివించుకుంటూ, ఉద్యోగాలు చేయించుకుంటూ దళితుల్ని మాత్రం పోరాటాలకు ఉసిగొల్పుతున్న కుట్రను పసిగట్టవలసి ఉందని దళితులకు ప్రబోధిస్తున్నాడు. ఇక్కడ మాష్టార్జీ మార్క్సిస్టుల్ని, మార్క్సిజాన్ని నిందించడం లేదు. కులం వాసన పోని మార్క్సిస్టుల్ని
మాత్రమే నిందిస్తున్నాడు.

తన తనువులో, అణువణువునా పాట ఉందంటాడు. లక్షలాది హృదయాలను గెలుచుకోవాలని తపిస్తాడు. మాస్టార్జీ పాటని ప్రేమించాడు. పాటనే మొదటి ప్రేయసిగా చెప్పుకున్నాడు.

*"పాట నా మొదటి ప్రేయసి*
*కవిత నా హృదయ రాసి*

*రెండూ స్పృశిస్తేనే*

*నా ఆటకు దరువు చేస్తున్నాను"* అని చెప్పుకున్న మాష్టార్జీ రాసిన సాహిత్యంపై పరిశోధన చేసిన వారికి డిగ్రీలు వస్తున్నాయి. ఇప్పటికే పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయంలో మాష్టార్జీ రచనలపై పరిశోధన చేసినందుకు మద్దెల రాజుకు ఎం.ఫిల్ డిగ్రీనిచ్చింది. అది "మాష్టార్జీ దళిత గీతాలు: మూల వాసుల సిద్ధాంతం" పేరుతో 1998లో ప్రచురణ కూడా పొందింది. తాను పుట్టి పెరిగిన మట్టినుండి మహోన్నతమైన పరిమళాల్ని వ్యాపింపజేస్తున్న మాష్టార్జీ సాహిత్యంపై మరిన్ని పరిశోధనలు జరగవలసి ఉంది.

***

*పంచమం*

# తొలి దళిత ఉద్యమ నవలా?

తెలుగు సాహిత్యంలో కుల అస్తిత్వ ఉద్యమాల నేపథ్యంలో దళిత ఉద్యమం దాన్ని ఆధారంగా చేసుకొని సాహిత్యం విస్తృతంగానే వచ్చింది. అది అనేక ప్రక్రియలకు విస్తరించింది. నవలా ప్రక్రియలో తనదైన ప్రత్యేకతను చాటుకుంది. 1872లో వచ్చిన నరహరి గోపాలకృష్ణమశెట్టి రచించిన *శ్రీరంగ రాజచరిత్రము* (సోనాబాయి పరిణము), 1878లో పుస్తక రూపంలో వచ్చిన కందుకూరి వీరేశలింగం రచించిన శ్రీరాజశేఖర చరిత్రము (వివేక చంద్రిక) నవలల్లో కూడా కుల ప్రస్తావన కనిపిస్తుంది. వీటిలో ఒక దాన్ని తొలి తెలుగు నవల అని సాహితీవేత్తలు గుర్తిస్తున్నారు. దీన్ని బట్టి తొలి తెలుగు నవలలోనూ కుల సమస్య చిత్రితమైంది. అయితే అది అస్పృశ్యత రూపంలో కనిపించింది.

తెలుగులో సాంఘీక నవలగా భావించబడుతున్న కందుకూరి వీరేశలింగం గారి *రాజశేఖర చరిత్రము* (1878)లో కథానాయకుడు అస్ప ృశ్యుడు ఇచ్చిన నీళ్ళు తాగడానికి ఇష్టపడడు. కానీ నరహరి గోపాలకృష్ణమశెట్టి రాసిన '*సోనాబాయి పరిణము'* పేరు గల "శ్రీరంగరాజ చరిత్రము'(1872) లో గల గిరిజన కుటుంబంలో పెరిగిన క్షత్రియ యువతి కథ కనిపిస్తుంది. తొలిసారిగా మాల మాదిగల సమస్యలను సానుభూతితో వర్ణించిన నవల తల్లాప్రగడ సూర్య నారాయణగారి *హేలావతి*(1910). ఆ తర్వాత మాల – మాదిగల గురించి రాసిన నవలలు చాలా వచ్చాయి. వాటిలో వేంకట పార్వతీశ కవుల మాతృమందిరం (1918); ఉన్నవ లక్ష్మీనారాయణ *మాలపల్లి* (1921–22). వేలూరి శివరామ శాస్త్రి, ఓబయ్య (1920) రంగనాయకమ్మ

*బలిపీఠం* (1962). ముఖ్యమైనవి. ఇంకా నైమి శారణ్య రథచక్రాలు, కొల్లాయిగట్టితేనేమి, ఓనమాలు మొదలైన నవలల్లోనూ మాల మాదిగల పట్ల సానుభూతి కనిపిస్తుంది. అక్కినేని కుటుంబరావు *సౌరాజ్యం* (1981); *ఓల్గా ఆకాశంలో సగం* (1981) నవలల్లో మార్క్సిస్టు దృక్పథంతో కూడిన మాల మాదిగల జీవితం కనిపిస్తుంది.

తెలుగులో 1980 తర్వాత మాత్రమే చైతన్యవంతమైన మాల మాదిగల సమస్యల గురించి నవలలు కనిపిస్తాయి. స్పారటకస్ కలం పేరుతో జి. రామమోహనరావు *ఖాకీ బతుకులు* (1980– 82) బోయి జంగయ్య "*జాతర*' (1997) సదానంద శారద మంచినీళ్ళబావి (1992), కాలువ మల్లయ్య రాసిన *గద్దలాడతాండాయి* (1996), *నీ బాంచన్ కాల్మొక్కుతా* (1987), సాంబయ్య చదువు, *బతుకు పుస్తకం,* చిలుకూరు దేవపుత్ర "పంచమం"(1998), : సన్నపురెడ్డి వెంకటరామిరెడ్డి "కాడి' (1998), పి. నానరయ్య" *మాదిగపల్లి"* (1998),.కళ్యాణరావు '*'అంటరానివసంతం'*(2000), వేముల ఎల్లయ్య కక్క (2000). సిద్ది (2006), పినాక పాణి నిప్పుల వాగు (2001), గోపరాజు నాగేశ్వరరావు *దండెంమీద చిలుకలు* (2001), *మరోమార్పు* (2002), కేశవరెడ్డి *రాముడుండాడు రాజ్జెముదాది,*శాంతి నారాయణ పెన్నేటి *మలుపులు* మొదలైన నవలలో మాల మాదిగల జీవితం చైతన్యవంతంగా కనిపిస్తుంది. అయితే వీటిలో *కక్క సిద్ధి*, మాదిగ పల్లె నవలల్లో మాదిగ జీవితం, సంస్క ృతి ఎక్కువగా ప్రతిఫలించాయి. (దార్ల వెంకటేశ్వర రావు : తెలుగు సాహిత్యం మాదిగ జీవిత ప్రతిఫలనం 2008– 42,43) అలా వచ్చిన దళిత నవలల్లో పంచమం ఒకటి. దీన్ని చిలుకూరి దేవపుత్ర రాశారు. ఇది అమెరికన్ తెలుగు అసోషేషన్(ఆటా) 1998లో నిర్వహించిన నవలల పోటిల్లో బహుమతి పొందింది. ఈ నవలను పోటీల కోసం రాశారా? రాసినా దాన్ని పోటికి పంపారా? అనే విషయాన్ని పక్కకు పెట్టి దీనిలో ప్రతిఫలించిన దళిత ఉ ద్యమాన్ని విశ్లేషించే ప్రయత్నం చేస్తాను.

ఈ నవల గురించిన కొంత మంది విమర్శకుల అంచెనాలనైనా

ముందుగా గమనించటం అవసరం అనుకుంటున్నాను. ఈ నవలపై సమీక్ష వ్యాసాన్ని రాస్తూ ఎన్.వేణుగోపాల్ ఇలా అన్నారు.నూట ఇరవై ఏళ్ళ తెలుగు నవలా చరిత్రలో వస్తు వైవిధ్యంలో సంక్లిష్టత సామాజిక సంచలనాలకు అద్దం పట్టడంలో, వ్యక్తి జీవితానికి సమాజ జీవితానికి మధ్య ఉన్న సంబంధాన్ని సరిగ్గా వ్యక్తీకరించటంలో *పంచమం* అగ్ర స్థానంలో నిలుస్తుంది. నిజానికి పంచమం నవల ఇతి వృతంగా దేవపుత్ర ఎంచుకున్న వస్తువు చాలా మామూలుగా కనిపిస్తుంది. ఒక దళిత యువకుడి జీవితంలో ఇంటర్మీడియట్ రిజల్ట్స్ వచ్చినప్పటినుండి అతను ఎ.పి.పిఎస్.సి గ్రూప్ వన్ పరీక్ష పాసై ఆర్.డి.వో అయి తన గ్రామానికి తన కులంలాంటి అణగారిన కులాలకి మేలు చేయాలనుకునే భూస్వాముల కుట్రల్లో ఉద్యోగం పోగొట్టుకునే దాకా కథ సాగుతుంది. సరిగ్గా దీనికి సమాంతరంగా నవలా ప్రారంభంలో భూస్వాముల నుంచి స్వాధీనం చేసుకున్న మిగులు భూమిని పంపిణీ చేస్తామనే ప్రకటన నుంచి ముగింపులో ఆ భూమిని వెనక్కి తీసుకుని భూస్వామికి అప్ప జెప్పుతున్నామనే ప్రకటన దాకా సాగుతుంది కథఈ రెండు సమాంతర ప్రారంభాలకీ, ముగింపులకి మధ్య 1990 తొలి రోజుల నుంచి అయిదారేళ్ళ పాటు తెలుగు సీమలో జరిగిన ఘటనలన్నింటికి ప్రతి ఫలనాలూ ఉంటాయి." (ఎన్.వేణుగోపాల్. సమగ్ర దృష్టే పంచమం స్వర బలం, (వ్యాసం).ఆంధ్ర ప్రభ, 15-5-2000.

వేణుగోపాల్ అభిప్రాయాల ప్రకారం ఇది ఆంధ్రప్రదేశ్ లో జరిగిన దళిత ఉద్యమాన్ని ప్రతిఫలించిన నవల. అది కూడా 1990 తర్వాత వచ్చిన తెలుగు దళిత ఉద్యమాలను గుర్తించే దిశగా సాగిందని అర్థమవుతుంది. అంటే 1985 జూలై 16 న జరిగిన కారంచేడులో మాదిగలపై జరిగిన హత్యాకాండకు ఈ నవల ప్రతిఫలించటం లేదని ఆ అభిప్రాయాన్ని బట్టి స్పష్టమవుతుంది.

కారంచేడు సంఘటన తొలి నాటి పరిస్థితులను పంచమం నవల వరి?ంచక పోయిన ఆ సంఘటనతో దళిత మహాసభ ఏర్పడటం, దానిపై

దళితులు జిల్లా, రాష్ట్ర కోర్టుల చుట్టూ తిరగటంలో మాదిగలలోనేకాకుండా యావత్తు దళితులను సాధ్యమైనంత ఐక్య ఉద్యమంగా చేయగలిగింది. అది చుండూరు దళిత హత్యాకాండ నాటికి బలమైన దళిత ఉద్యమంగా మారింది. చుండూరు సంఘటన 1991 ఆగష్టు 6 వ తేదీన జరిగింది. కారంచేడులో మాదిగలపైన, చుండూరులో మాలలపైన మారణకాండ జరిగింది. రెండు సంఘటనలోనూ హత్యకావింపబడిన వాళ్లు మాదిగలా? మాలలా? అని చూడకుండా తామంతా దళితులుగానే భావించి, ఉమ్మడిగానే దళితులు తమ పోరాటాలను సాగించారు. వీటిని నవలలో ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగా సూచించారు.

హైదరాబాదు బుక్ ట్రస్టు వాళ్ళు 2009 లో ముద్రించిన పంచమం నవలలో వేణుగోపాల్ గారి వ్యాసాన్ని ప్రచురించారు. మొదటి ముద్రణను బహుమతి ఇచ్చిన ఆటా వాళ్ళే 1998 లోనే ప్రచురించారు. హైదరాబాదు బుక్ ట్రస్టు వాళ్లు ప్రచురించిన నవలలో రచయిత '*'మీతో కాసేపు"* అంటూ తన అంగీకారాన్ని కూడా తెలిపారు. అంటే రచయితా, ముద్రణా సంస్థ వాళ్లూ కూడా ఈ నవల 1990 తర్వాత వచ్చిన దళిత ఉద్యమాన్ని చిత్రించిన నవలగానే అంగీకరిస్తున్నట్లుగానే భావించాలా? అలా అయితే ముఖ చిత్రంపై ఉద్యమాల నేపథ్యంలో తొలి దళిత నవల అని ప్రకటించుకోవటం సరైందే అవుతుందా? ఆలోచించవలసిందే?

ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, డా॥లక్ష్మీనారాయణ గార్ల సంకలనం, సంపాదకత్వంలో *1980 తర్వాత తెలుగు దళిత నవల* పేరుతో వచ్చిన వ్యాస సంకలనం(2003) లో కూడా "పాతికేళ్ళ దళిత జీవిత ద ృశ్యం"పేరుతో పంచమం నవలపై డా॥లక్ష్మీనారాయణ రాసిన వ్యాసం (పుటలు 47-54) ఉంది. ఇంకా దీనిపై ముందు మాటలో సంపాదకులు వ్యాఖ్యలు కూడా ఉన్నాయి. ఈ పుస్తకానికి నేపథ్యం" పేరుతో రాసిన సంపాదకీయంలో ఈ నవల గురించి రాస్తూఇది 1975-1998 వరకూ ఆంధ్రప్రదేశ్‌లో దళిత ఉద్యమాల చారిత్రక నేపథ్యంగా వచ్చిన నవల. గత శతాబ్ది ఎనిమిదో

దశకానికి ముందట భూ సంస్కరణలు మొదలుకొని కొత్త ఉత్పత్తి సంబంధాలు చుండూరు, కారంచేడు సంఘటనలు, నక్సలిజం విజృంభణ, దళిత యువత ఉద్యమించడం, దళితులు సంపన్న వర్ణాల వారిచేత కుల వివక్షకు గురై, అగ్ర వర్ణాల చేతుల్లో కీలుబొమ్మలు కావడం, దండోరా, మాల మహానాడు, రిజర్వేషన్ల వర్గీకరణ లాంటి రెండు దశాబ్దాల చారిత్రక సంఘటనలను రికార్డు చేసిన నవల '' అని అంచనా వేశారు.

డా॥కె.లక్ష్మీనారాయణ రాసిన వ్యాసంలో ఇలా రాశారు. '*'పంచమం'' దళిత ఉద్యమ ప్రభావంతో వచ్చిన నవల. చిలుకూరి దేవపుత్ర తన ఉద్యోగ జీవితంలో చవిచూసిన యధార్థ సంఘటనకు, తన ఉద్యోగం చేస్తున్న రెవెన్యూ వ్యవస్థలోని అధికారుల లంచగొండి తనాన్ని, నడుస్తున్న దళిత ఉద్యమాలనూ జోడించి రాసిన నవల ఇది.*

*ఆంధ్ర దేశంలో ప్రభుత్వం భూసంస్కరణలు ప్రవేశపెట్టడం, గ్రామాలలో మిగులు భూములు పంపిణీ, దళితులు, వెనుకబడిన తరగతులు వారు భూములు పొందటం, గ్రామాల్లో భూస్వాములు తమ భూములను అధికార పలుకుబడితో రీకన్వే చేయించుకోవడం, రెవిన్యూ శాఖ అవినీతి, కొత్త ఉత్పత్తి సంబందాలు, దళితులు భూస్వాముల మధ్య అంతరాలు, భూస్వాముల దౌర్జన్యాలు, లైంగిక వేధింపులు, కారంచేడు, చుండూరు లాంటి సంఘటనలు, దళిత యువత ఉద్యమించటం, నక్సలిజం, విజృంభణ, 1989 శాసన సభ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి రావటం, కోనేరు రంగారావు ఉప ముఖ్యమంత్రి కావడం, దళితులు ఉన్నత పదవుల్లో ఎన్నిక కావటం, సవర్ణుల చేతుల్లో కీలు బొమ్మలు కావడం, సంపన్న వర్గంలో చేరిపోవడం, డా.బి.ఆర్ అంబేద్కర్, బాబు జగజ్జీవన్ రామ్ ల జయంతి, వర్ధంతులు జరపడం, రాష్ట్రంలో బహుజన సమాజ్ వాది పార్టీ ఎన్నికల్లో దిగటం ఓటమి చెందటం, పౌర హక్కుల సంఘాలు, సమకాలీన ఉద్యమాలు బలోపేతం కావటం, చలపతి, విజయవర్ధన రావుల ఉరిశిక్ష కేసు, భారతీయ జనతాపార్టీ బలపడటం, దండోరా, మాల మహానాడు*

*ఏర్పడటం, లాకప్ మరణాలు వంటి రెండున్నర దశాబ్దాల సంఘటనల నేపథ్యంగా ఈ నవల నడిచింది'* అనివివరించారు.

పైన పేర్కొన్న విషయాల్ని గమనిస్తే ఆ అభిప్రాయాన్ని ఇంచుమించు యధాతథంగా తీసుకుని కూడా అనేక మందికి చెప్పిన కృతజ్ఞతల్లోనైనా ఎక్కడా ఆ విషయాన్ని పేర్కొనక పోవడం గమనించవలసి ఉంది. పోనీ, ఈ అభిప్రాయం, రచయిత లేదా ప్రచురణ కర్తలే రాశారనికుందాం. ఈ నవలపై వచ్చిన సమీక్షలను లేదా వ్యాసాలను పరిశోధనలను రచయిత గానీ, దాన్ని మరలా మరలా ప్రచురించే ప్రచురణ కర్తలు గానీ చూడాలనేమీ కదా.! అని కూడా కాసేపు అనుకుందాం!

అలాంటప్పుడే పంచమం నవల కంటే ముందు దళిత సమస్యలను ఉద్యమాలకు వరి?స్తూ అనేక నవలలు వచ్చాయి. వాటి గురించి కూడా రచయిత, ప్రచురణ కర్తలకు తెలియదని అనుకోగలమా?మరి తెలిసినా కూడా పంచమం నవల ముఖచిత్రంపై రాసుకున్న ప్రకటన సమంజసమైందని అవుతుందా?

పోనీ ఆ ప్రకటన సమర్థిస్తూ ఎక్కడైనా ఈ పుస్తకంలో గానీ, తర్వాత గానీ వ్యాసాన్ని రాశారా?ఒక వేళ నిజంగా వేణుగోపాల్ గారి అభిప్రాయాన్ని స్థిరికరించుకున్నా, 1990 తర్వాత సంఘటనలను వరి?ంచినట్లైతే ఉద్యమాల నేపథ్యంలో తొలి దళిత నవల ఎలా అవుతుంది?అంతే కాకుండా రచయిత తన ముందు మాటలో ఈ నవల రాయడానికి గల నేపథ్యాన్ని చెప్పుకున్నారు.

*పంచమం* నవల రాయటానికి చిన్న సంఘటన మాత్రమే ప్రేరణ అని రచయితే రాసుకున్నారు. ఉద్యోగరీత్యా మండల రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ గా పనిచేశారు. అప్పుడు ఒక సంఘటన జరిగింది. ల్యాండ్ సీలింగ్ కింద ప్రభుత్వం తీసుకుని దళితులకు వెనుకబడిన తరగతుల వాళ్ళకు పంచుతుంది. తర్వాత భూమి కోల్పోయిన భుస్వామి తన పలుకుబడితో తన భూమిని తనకు వచ్చేట్లు రీకన్వే చేయించుకుంటాడు. ఆ సంధరరేలో వచ్చినట్లే వచ్చిన భూమిని మళ్ళీ

ప్రభుత్వం స్వాధీనం చేసుకుని అసలు యజమానికి ఇచ్చేయాల్సి దండోరా వేయిస్తుంది. అలా దండోరా వేసే వ్యక్తి కూడా ఆ భూమిని కోల్పోవలసి వస్తుంది. అది తాను నిజంగా చూసిన చలించిపోయినా సంఘటనగా రచయిత చెప్పారు. అలా వచ్చినట్లే వచ్చిన భూమి తానెంతో పంట పండించుకోవాలనీ తామూ ఎంతో కొంత భూమికి యజమానిని అయ్యాననీ ఆశపడి, ఆ బంజరునంతా బాగు చేసి విడదీయ రానీ అనుబంధాన్ని పెనవేసుకున్న వెట్టి వాని దుఃఖం మానసిక స్థితికి కదిలి పోయి ఈ నవలను రాశానని చెప్పుకున్నారు. వీటన్నింటినీ పరిశీలించినపుడు ఈ నవలలో దళిత ఉద్యమానికి సంబంధించిన అనేక కోణాలు ఉన్నాయి. మాదిగ యువకుడిని ఈడిగ పద్మ ఇష్టపడి పెళ్ళిచేసుకోమని చెప్పినా అది అంత సులువుగా జరగదని చెప్తాడు. అయినా మనసు పొరలో ఆమెపై ప్రేమ ఉంటుంది. అలాగే బ్రాహ్మణ యువతి తెలివైందనీ, కలివిడి గలదనీ, కుల పట్టింపులు లేవనీ విద్య పట్ల కూడా కాస్తంత మనసు పారేసుకున్న పరిస్థితి కూడా ఉంది. అయినా సమాజంలో ఒక మాదిగ యువకుడికి కావల్సిన అత్యంత ముఖ్యమైనది ఉద్యోగం గానే భావించాడు. ఆర్.డి.ఓ అయ్యాడు. కానీ పరిస్థితులు సహకరించేలా లేవు.

మరో వర్గానికి చెందిన సురేష్ స్వఛ్ఛరేద సంస్థలో పనిచేస్తూనే గ్రామంలోని దళితులను చైతన్యవంతం చేయడానికి ప్రయత్నించాడు. వివక్షను తాను పనిచేస్తున్న సంస్థలో ఉన్నా సహించలేని వ్యక్తిత్వం గల వానిగా సురేష్ కనిపిస్తాడు. చివరికి తిరుగుబాటు ద్వారానే తాను అనుకున్నది సాధించవచ్చని రహస్యోద్యమంలోకి వెళ్ళిపోతాడు. వెనుకబడిన తరగతుల్లో చాకలి ఓబన్న, ఒక గ్రామ పెత్తందారీ కమ్మ కులస్తుల అమ్మాయి రుక్మిణిని ప్రేమించి దొంగ చాటుగా పెళ్లిచేసుకుంటాడు. ఆ ఊరు విడిచి పారిపోతాడు. అది తెలిసి అమ్మాయి తరపువాళ్ళు అమ్మాయికి ఏమాత్రం హాని జరగకుండానే ఆ అబ్బాయిని హత్య చేయిస్తారు. చాకలి ఓబన్న హత్య గురించి రెడ్డి కులస్థుడైన పురుషోత్తం హక్కుల సమితి వాళ్ళతో కలసి పోరాడి కేసు కట్టించి, శవాన్ని

రప్పించి పోలీసుల చేత కేసు రాయించగలుగుతాడు. కానీ హత్యకు మూల కారణమైన వాళ్ళు కాకుండా సాధనంగా ఉపయోగ పడిన వాళ్లని తమ పలుకుబడితో దానిలో ఇరికిస్తారు.

చివరికి మాదిగ యువకుడు ఉన్నత చదువులు చదివి తన విధులు సక్రమంగా నిర్వహించాల్ని ప్రయత్నించినా గ్రామ పెత్తందార్లు అడ్డంకులు కలిగించడమే కాకుండా అక్రమంగా అవినీతి కేసులో ఇరికించి ఉద్యోగంలో ఉండకుండా సస్పెండ్ చేయిస్తారు. ఒక వైపు దళితులు రాజ్యాంగం ద్వారా వచ్చిన హక్కులను పొందుతూ ఉన్నత చదువులు చదివి ఉద్యోగాలు సాధించినా భూమి రాజకీయాధికారం లేకపోవడంతో ఆ ఉద్యోగాలు కూడా చేయలేని పరిస్థితి కనిపిస్తుందని ప్రజాస్వామ్యంలో కనిపించని ఒక వర్గ స్వభావాన్ని గుర్తించవలసి ఉందని చెప్తాడు. రచయిత నవలలో సమకాలీన దళితుల పీడనలో బ్రాహ్మణుల సహ ృదయంతోనే మెలుగుతున్న స్థితిని క ృష్ణశాస్త్రి, విద్య వాళ్ళ కుటుంబంలో శివయ్యకు గల సంభందాల ద్వారా రచయిత సూచనామాత్రంగా చెప్పగలిగాడు. దళితులను పీడించే కుల, వర్గ స్వభావాల్లో వచ్చిన మార్పులు ఈ నవలలో వాస్తవిక దృష్టితోనే పట్టుకోగలిగారు. కారంచేడు, చుండూరు తదితర సంఘటనలకు కారకులెవరో, ఏ కులస్తులో గుర్తించవలసి ఉంది. ప్రతి దానికి బ్రాహ్మణునే లక్ష్యం చేసి బ్రాహ్మణత్వ వంటి పదాలను ప్రయోగించినపుడు కొన్ని జాగ్రత్తలు తీసుకోవలసిన అవసరాన్ని ఈ నవల తెలియజెప్తుంది. మాల
మాదిగల వర్గీకరణ సమస్యను కూడా చర్చించింది.

దళిత ఉద్యమం కేవలం ఆంధ్రప్రదేశ్ లో మాత్రమే రాలేదు. అది యావత్తు భారతదేశ వ్యాప్తంగా కనిపిస్తుంది. అది ఒక్క సారిగా కూడా ఎగిసి పడిరాలేదు. అస్పృశ్యత, అణచివేత వాటిని తర తరాలుగా అనుభవిస్తున్న కులాల వారి నిరసనలు తిరుగుబాట్ల బాటలో తమనీ మానవులు గుర్తించమనీ కోరే సందరాలేన్నీ దళిత ఉద్యమ ప్రారంభాన్నే తెలుపుతున్నాయి. కానీ ఒక చారిత్రక క్రమంలో చూసినపుడు మాత్రం భారతదేశంలో బ్రిటీషు వాళ్ళు

ప్రవేశించిన తర్వాత దేశ మతాంతీకరణ దశగా ఈ రెండిటి కంటే ముందు దశ, తర్వాత స్వాతంత్ర్యానంతరం ఏక కాలంలో సాగిన గాంధీ సంస్కరణోద్యమ, అంబేద్కర్ కుల నిర్మూలన దశలుగా దళిత ఉద్యమం వివిధ పరిణామాల్లో కనిపిస్తుంది. దీని తర్వాత వచ్చిన ఆత్మ గౌరవ పోరాటాలు కుల అస్థిత్వ ఉద్యమాలుగా దళిత ఉద్యమం వికాసం చెందింది. అందుకనే సామాజిక ఉద్యమాల పై పరిశోధన చేసిన వాళ్ళు దళిత ఉద్యమ చరిత్రను పరిగణలోకి తీసుకునేటప్పుడు ఇవన్నీ దృష్టిలో పెట్టుకోవాలని అంటున్నారు.

ఈ నేపథ్యంలో చిలుకూరి దేవపుత్ర *పంచమం* నవలను చూసినప్పుడు తారీఖులు స్పష్టంగా కనిపించకపోయినా భారతదేశంలో జరిగిన అనేక దళిత ఉద్యమ రూపాలను కుడా ప్రతిఫలించిందని చెపవచ్చు. మెత్తం మీద సమకాలీన దళిత ఉద్యమాన్ని వాస్తవిక దృష్టితో విశ్లేషించింది. దళిత ఉద్యమాన్ని వర్ణించిన నవలగా చెప్పుకోవడంలో ఎలాంటి ఇబ్బంది ఉండదు. కానీ తొలి దళిత ఉద్యమ నవల అనడం సమంజసం కాదని దళిత నవలలను పరిశీలించిన వారికి తెలుస్తుంది.

***

# దళిత సాహిత్య విమర్శ – సాంకేతిక పదజాలం నిర్ణయ సమస్యలు

ఆధునిక తెలుగు సాహిత్య విమర్శలో దళిత సాహిత్యం ఒక వాదంగా ప్రారంభమై ఉద్యమంగా స్థిరపడి కొత్త శాఖలను సంతరించుకుంటుంది. 1980 దశకం తర్వాత దళిత సాహిత్యం స్పష్టంగా ముందుకు వచ్చినా, దాని మూలాలు మాత్రం అంతకు ముందు నుండే ఉన్నాయి. అస్పృశ్యత, కుల వివక్షలను నిరశిస్తూ, ప్రతిఘటిస్తూ, సంస్కరణోద్యమంలో భాగంగా దళిత ఉద్యమం కొన్నాళ్ళు కొనసాగింది. అప్పుడే హరిజన అనే పారిభాషిక పదం వాడుకలో వచ్చింది. దానితో పాటే, పీడిత కులాలు అనే పారిభాషిక పదం కూడా పాచుర్యంలోకి వచ్చింది. అంబేద్కర్ రచనల్లో అస్పృశ్యత, కుల సమస్యలను చర్చించే సందర్భంలో పవిత్రత, అపవిత్రత, అంటరానితనం, మైల పడటం వంటి పదాలు వాడుకలోకి వచ్చాయి. వాటితో పాటు వర్ణం, వర్గం, కులం అనే పదాలు కూడా చర్చనీయంశాలయ్యాయి.

చాతుర్వర్ణ వ్యవస్థను వర్ణిస్తూ అగ్ర వర్ణం అనే పదం ప్రవేశించింది. భావ జాలాన్ని ఆధారంగా చేసుకుని బ్రాహ్మణత్వ అనే పదం వెలుగులోకి వచ్చింది. దాన్ని ఆధారం చేసుకునే బ్రాహ్మణ వాదం అనే పదం ప్రాచుర్యంలోకి వచ్చింది. ఈ నేపథ్యం అంతా 80 దశకం తర్వాత తెలుగులో జరిగిన దళిత ఉద్యమంలో భాగమయ్యింది. దళిత సామాజిక ఉద్యమాన్ని ఆధారం చేసుకునే, దళిత సాహిత్యం అనేది ప్రవేశించింది.పీడనకు గురవుతున్న వాళ్ళంతా దళితులనే విస్తృత అర్థంలోనూ, కులం వలన చాతుర్వర్ణానికి అతీతంగా సృష్టింపబడిన పంచములు మాత్రమే దళితులు అనే ఆలోచన కూడా సూక్ష్మార్థంలో కనిపిస్తుంది. వీటితో పాటు షెడ్యూల్ కులాలు, షెడ్యూల్ తెగలను మాత్రమే దళితులు అనే ఆలోచన కనిపిస్తుంది.

మరికొంత మంది వర్గం వలన పీడనకు గురవుతున్న స్త్రీలను కూడా కలుపుకుని షెడ్యూల్ కులాలు, షెడ్యూల్ తెగలు, వెనకబడిన తరగతులు,

ముస్లిములు మొదలైన వారందరిని దళితులు అనే వివరణలు కనిపిస్తున్నాయి. దేశ వ్యాప్తంగా కాన్షీరాం తెచ్చిన బహుజన చైతన్యం వలన బహుజన అనే పదం వెలుగులోకి వచ్చింది. ఈలోగా షెడ్యూల్డు కులాల్లో 59 ఉప కులాలకు రాజ్యాంగ రీత్యా రావలసిన హక్కుల కోసం జరిగిన ఆందోళన ఉద్యమ రూపం సంతరించుకుంది. దీనితో అంతకు ముందు వర్గీకరణ అనేది సాధారణంగా దేనినైనా విశ్లేషించడానికి వివిధ భాగాలుగా విడగొట్టడం అనే అర్థంలోనే ప్రధానంగా ప్రయోగంలో ఉంది. అయితే, ఎస్.సి. రిజర్వేషన్ వర్గీకరణ ఉద్యమం వచ్చిన తర్వాత వర్గీకరణ అనేది సమాన భాగం కోసం జరిగే సంఘర్షణ అనే అర్థాన్ని సంతరించుకుంది.

దీనితో పాటు అంతకుముందు సమాజంలో అంతగా గౌరవనీయ స్థానంలో లేని మాల, మాదిగ కుల వాచకాలు సామాజిక, సాహిత్య రంగాల్లో విరివిగా వాడుకలోకి వచ్చాయి. దళిత అనగానే మాల అనే అర్థాన్ని కూడా సూచించేలా తయారైంది. దీని దృష్ట్యా దళిత ఉద్యమం సాహిత్యాల నుండి మాదిగ ఉద్యమం, మాదిగ సాహిత్యం అనే పారిభాషిక పదాలు వచ్చాయి. అంతకు ముందు దళిత సాహిత్యంలో అంతరాగంగా ఉన్న మాదిగ సాహిత్యం తన ప్రత్యేక అస్తిత్వాన్ని చాటుకోవడమే కాకుండా మాదిగల సంస్కృతి ఆచార వ్యవహారాలనీ ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ తెలిసో తెలియకో సాహితీవేత్తలందరూ ప్రయోగించారనీ, అందువల్ల మాదిగ సాహిత్యంలో అంతరాగంగానే దళిత సాహిత్యాన్ని గుర్తించాలనే డిమాండ్ ముందుకు వచ్చింది.

అంతేకాకుండా మాలత్వ అనే పదం కూడా సృష్టింపబడింది. ఇలా ఆధునిక సాహిత్య విమర్శలో నూతన పారిభాషిక పదాలు ప్రవేశించాయి. ఇవి రాజకీయ, ఆర్థిక, సామాజిక శాస్త్రాల నుండి సాహిత్యంలోకి ప్రవేశించాయి. సాంకేతిక పారిభాషిక పదాలుగా వీటిని ప్రయోగించటంలో గల సమస్యలను విస్తృతంగా చర్చించవలసిన అవసరం ఎంతో ఉంది.

***

# ప్రాంతీయ సాహిత్య విమర్శ

*"మన నేల ఒకటే*
*మన జాతి ఒకటే*
*అయితే*
*బతుకులొక్క తీర్గ*

*ఎందుకు లెవ్వురా అయ్య"* అంటూ తెలుగు కవిత్వం నేడు ప్రాంతీయ అస్తిత్వ చైతన్యంతో ముందుకొస్తుంది. "ప్రాంతీయ' భావనను శాస్త్రీయంగా అవగాహన చేసుకోలేని వాళ్ళు లేదా ఇష్టపడని వాళ్ళు దాన్ని ఒక "వేర్పాటు వాదం' గానే పరిగణిస్తుంటారు.

"ప్రాంతీయ' భావన అనేది నిజానికి తమకు జరిగే వివక్షను గుర్తించి దాన్ని కొనసాగించడం సరైంది కాదని చెప్పడానికి ప్రశ్నించడం, నిరసించడం, ధిక్కరించడం, చివరికి స్వీయ అస్తిత్వాన్ని కోరుకోవడం వంటి రూపాల్ని తీసుకొంటుంది. ఇలాంటి ప్రాంతీయ భావన ప్రపంచ వ్యాప్తంగా ఉంటుంది.

ఒక ప్రాంతంలో పుట్టి, పెరిగి, ఆ భౌగోళిక ప్రాంతాన్నే నమ్ముకుని జీవిస్తున్న ప్రజలపై, ఆ ప్రాంతానికి వివిధ కారణాల వల్ల వలస వచ్చి, క్రమేపీ అక్కడే స్థిర నివాసం ఏర్పరుచుకున్న వాళ్ళు స్థానికులపై ఆధిపత్యం చెలాయించడంతో "స్థానీయ' భావన నుండి "ప్రాంతీయ' భావన పుట్టుకొస్తుంది. అది ఉద్యమ రూపం పొందిన తర్వాత "ప్రాంతీయ వాదం'గా తీవ్రమవుతుంది. దీన్ని ఒక ప్రాంతంలోని ప్రజలు ఏవో కొన్ని కారణాల రీత్యా తమ కంటూ ఒక ప్రత్యేక అస్తిత్వాన్ని, గుర్తింపుని కోరుకుంటే అటువంటి ఆకాంక్షను ప్రాంతీయ వాదం అంటారు" అని సామాజిక శాస్త్రవేత్తలు నిర్వచించారు. ఈ సామాజిక సమస్యల్ని తీసుకొని రాసే సాహిత్యాన్ని ప్రాంతీయ అస్తిత్వ సాహిత్యం అంటారు.

"స్థానీయ' భావన కంటే ముందే కుటుంబం నుండి మొదలయ్యే గుర్తింపు కోసం పడే సంఘర్షణ, వ్యష్టి' నుండి సమష్టి'కి పరిణామం చెంది రకరకాల అస్తిత్వాల కోసం పడే వేదన, తపన, ఘర్షణలన్నీ అస్తిత్వ ఉద్యమాలుగా బయటపడుతుంటాయి. అందుకనే ప్రాంతీయ వాదం, ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమం వంటి పారిభాషిక పదాల్లో లోతైన తాత్త్వికత ఉంది. దీన్ని జాగ్రత్తగా గమనిస్తే అంతరాగేంగా ఒక వాదం కొనసాగుతూనే, బయట మరో ముఖ్యమని భావించే వాదం సమష్టి'గా బహిర్గతమవుతుంటుంది. దీన్ని తెలుగు సాహిత్యంలోనే గమనించినా చాలా స్పష్టంగా వివరించుకొనే అవకాశం ఉంది.

మొదట్లో ఒక ప్రాంత జీవన స్థితిగతుల్ని ప్రతిఫలించే దిశగా తెలుగులో ప్రాంతీయ సాహిత్యం వచ్చింది. దానిలో అస్తిత్వ చైతన్య ధోరణి ఉందని చెప్పలేం. కానీ, ప్రాంతీయ వేదనలు ఉన్నాయని మాత్రం చెప్పగలం. ఒక సామాజిక చైతన్యంతో వచ్చే సాహిత్యం అస్తిత్వ సాహిత్యం. తెలుగులో చాసో తీసుకొచ్చిన "కళింగాంధ్ర కథలు' సంకలనం తొలిసారిగా ఒక ప్రాంత ప్రజల ఆకాంక్షల్ని ఒక చోటికి తెచ్చిందని
విమర్శకులన్నారు. ఆ తర్వాత "సీమ కథలు' వచ్చాయి. అంతకు ముందు తెలంగాణ ప్రాంతంలో "గోల్కొండ కవుల ప్రత్యేక సంచిక' వచ్చింది.

తెలుగు భాష మాట్లాడే వాళ్ళంతా స్వాతంత్ర్యానంతరం రెండు కారణాలతో ప్రాంతీయ స్పృహను ప్రదర్శించారు. అవి ప్రత్యేక భాష, ప్రత్యేక భౌగోళిక ప్రాంతాన్ని ఒక ఆధారంగా చేసుకొనిన ప్రత్యేక రాష్ట్రంగా మారాల్ని కోరుకోవడంగా చెప్పుకోవచ్చు. దాశరథి, సోమసుందర్, ఆరుద్ర వంటి వాళ్ళంతా రాసిన సాహిత్యంలో ఈ ప్రాంతీయ స్పృహ బలంగానే కనిపిస్తుంది. అందుకనే

*"కోటి తమ్ములకడ రెండు కోట్ల తెల్గు*
*టన్నలను గూర్చి వృత్తాంమందజేసి*
*మూడుకోటుల నొక్కటే ముడిబిగించి*
*పాడినాను మహాంధ్ర సౌభాగ్య గీతి'* ' అని తెలంగాణ ప్రాంతం

నుండీ ఆనాడు తెలుగు వాళ్ళంతా ఏకం కావాలనే ఆశను వ్యక్తంచేశారు. పాలకులపై ఉండే సహజ వ్యతిరేకతతో పాటు, సాంస్కృతిక ఆధిపత్య నిరాకరణ అప్పటికి నిజాము ఒక పిశాచంగా భావించడం ఒక ప్రధాన కారణం. అదే నిజాం వంశ పాలనను ఇప్పుడు కొంతమంది ప్రశంసిస్తున్నారు. నేటికి ప్రాంతీయ వాదం తీవ్రస్థాయికి చేరుకోవడమే దీనికి ముఖ్యకారణం కావచ్చు. అందుకనే నేడు కవుల గళాల్లో ప్రత్యేక అస్తిత్వ స్వర తీవ్రత పెరిగింది.

ప్రాంతీయ వాదం కొంతమంది సృష్టి వల్లనో, కొంతమంది స్వలాభం కోసమో వస్తే అది అనేక సంవత్సరాల పాటు ఉద్యమంగా కొనసాగలేదు. నాయకులు మారవచ్చు. నాయకత్వం మోసం కూడా చేయవచ్చు. అయినా ప్రజల కాంక్ష మరో నాయకుడితోనైనా ముందుకెళ్తుంది. అదిప్పటికే తెలంగాణలో జరుగుతూనే ఉంది. అనేక అనుభవాల్ని మూటకట్టుకొని ముందుకెళ్తుంది. దాన్ని కవులు ఇలా వర్ణిస్తున్నారు.

*మా కెవ్వల సొమ్ము అక్కర్లేదు*
*మాయి మాకు దక్కితే సాలు*
*మా ఆరాటంలో అలజడి ఉన్నది*
*అన్నాలమై పోయిన మొత్తుకోలున్నది*
*బొండిగల నిండా బాధలున్నాయి*
*నడిమిట్ల పెత్తనం దొరికిచ్చుకొని చెలాయించేటోల్లకాడ*
*అనిగి మనిగి పడ్డది సాలు*
*మాకు సోయి లేదనుకోకండ్రి*

అనుభవాలు మాకు అన్నినేర్పినయి' అని ఆ అనుభవాలతోనే కవులు కూడా ఉద్యమంలో భాగస్వాములవుతున్నారు. ఇది ప్రస్తుతం తెలంగాణ ప్రాంతంలోనే తీవ్రస్థాయిలో కనిపిస్తుంది. అందువల్ల ప్రాంతీయ అస్తిత్వ సాహిత్యం అనగానే తెలంగాణ సాహిత్యం అనే స్థితికి చేరుకుంది.

సర్వసాధారణంగా అస్తిత్వ సాహిత్య స్వరూప స్వభావాల్లో కొన్ని ముఖ్యాంశాలను గమనించవచ్చు. తమను నిర్లక్ష్యానికి గురిచేయడాన్ని గుర్తుచేస్తారు. దాన్ని సరిచేసుకోలేదనిపించినప్పుడు ప్రశ్నిస్తారు. అప్పటికీ మార్పు

కనిపించనప్పుడు నిరసిస్తారు. పాలకుల నిర్లక్ష్యం వల్ల ప్రతిదాన్నీ ధిక్కరించడం మొదలవుతుంది. దీనితో అన్నీ దాని కేంద్రంగానే చూస్తారు.

ప్రస్తుతం తెలంగాణ సాహిత్య కారులు ఆది కావ్యాన్ని, ఆది కవిని పునర్మూల్యాంకనం చేస్తున్నారు. ఆది కావ్యంగా మహాభారతాన్నీ, ఆది కవిగా నన్నయను అంగీకరించట్లేదు. కవుల ప్రాంతాల్ని గుర్తించి సాంస్కృతిక వారసత్వాన్ని పునర్నిర్వచిస్తున్నారు. తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వం ఆ ప్రాంతకవులు ప్రచురించే కవితా సంకలనాల పేర్ల తో సహా ప్రతిబింబిస్తుంది. ఆ ప్రాంత కవులు సమషి' గొంతుల్ని వినిపించేటట్లు అన్నట్లు పొంగిలి, మత్తడి కవితా సంకలనాలను, "తెలంగాణ తొలితరం కథల సంకలనం' తీసుకొని రావడంతో పాటు "గోల్కొండ కవుల ప్రత్యేక సంచిక' ను పునర్ముద్రించడం వంటి వన్నీ జరుగుతున్నాయి. మరో వైపు వివిధ కవితా సంకలనాలకు, సంపుటాలకు రాస్తున్న ముందుమాటలు, ముద్దెర, ఇరుసు, ఇతివృత్తం వంటి విమర్శ పుస్తకాలు విస్తృతంగానే వస్తున్నాయి.

సాధారణంగా ప్రాంతీయ వాదం తీవ్రమవుతున్నప్పుడు సాహిత్యంలో కొన్నిప్రత్యేక అంశాలు కనిపిస్తుంటాయి. అన్నింటినీ పునర్మూల్యాంకనం చేస్తారు. తమ స్థితిని తలచుకొంటూ ఆ యా చారిత్రక, ఆర్థిక, రాజకీయ కారణాల్ని అన్వేషిస్తుంటారు తమ అభివృద్ధికి ఇతర ప్రాంతాల వాళ్ళే ఆటంకమనే ఆరోపణలు చేసి, అవి నిజమని నిరూపించే ప్రయత్నంలో కొన్ని సాక్ష్యాధారాల్ని చూపిస్తుంటారు. తమ సాంస్కృతిక ఔన్నత్యాన్ని చాటే ప్రయత్నంలో అప్పటికున్న ప్రమాణాలను తిరస్కరిస్తూనే కొత్త ప్రమాణాల్ని తయారు చేస్తుంటారు. దైనందిన జీవితంలోని అనేక అంశాల్ని సాహిత్యీకరిస్తూ కొత్త సూత్రీకరణల్ని అందిస్తుంటారు.

ప్రత్యక్షంగానో, పరోక్షంగానో తమ ప్రాంత రచయితలు కూడా ఇతర ప్రాంతాల వాళ్ళ ప్రభావం వల్ల స్వీయ అస్తిత్వాన్ని కోల్పోతున్నారని ఆవేదన చెందుతుంటారు. అందుకే ఇప్పుడు తెలంగాణ కవులు

*ఇప్పుడు*
*నాకు నా నేల కావాలి*

*నాకు నా గాలి కావాలి*

*నాకు నా నీరు కావాలి*

*నాకు నా ఊరు కావాలి'* ' అని స్పష్టంగా నినదిస్తున్నారు. ఇలా నినదించడానికి కావలసినంత నేపథ్యాన్ని చూపిస్తున్నారు. వలస ఆధిపత్యం, సాంస్కృతికంగా జరుగుతున్న అవమానాల్ని, రాజకీయంగా జరుగుతున్న కుట్రల్నీ తీవ్రంగానే సాహిత్యీకరిస్తున్నారు. ఇది తెలుగులో రాయలసీమ, కళింగాంధ్ర ప్రాంతాల పరంగానూ కొనసాగుతున్నా, తెలంగాణ ప్రాంతంలో చైతన్యం ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమం" గా పరిణామం చెందింది. అందులో భాగంగానే తమ ప్రత్యేక అస్తిత్వాన్ని నిరూపించుకొనే దిశగా ప్రత్యేక ప్రింట్, ఎలక్ట్రానిక్ మీడియాలను సిద్ధం చేసుకుంటున్నారు. ముద్రణలో కనిపిస్తున్న కొన్ని సాహిత్యం పుస్తకాలను గమనిస్తే తెలంగాణ ప్రాంతంలోని జిల్లాలను ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో భాగంగా గుర్తించ నిరాకరించే ఉద్దేశ్యం కనిపిస్తుంది. రాష్ట్రాన్ని తెలిపే చోట తెలంగాణ" రాసుకోవడాన్ని ప్రాంతీయ అస్తిత్వ ఉద్యమంలో భాగంగానే గుర్తించాల్నిపిస్తుంది. "ప్రాంతం' ఒక సామాజిక వ్యవస్థకు సమష్టి రూపం. సామాజిక ప్రయోజనాల కోసం ప్రత్యేక ప్రతిపత్తిని కోరుకోవడం, లేదా ప్రత్యేక దేశంగా, రాష్ట్రంగా, జిల్లాగా, మండలంగా జనసమూహం విడిపోవడం ద్వారా తమ ప్రయోజనాలు నెరవేరతాయని ఆశిస్తుంటారు. ఇది కొన్ని సార్లు ఒకే ప్రాంతంలో కూడా మళ్ళీ మళ్ళీ విడిగా ఉండాలనే ప్రత్యేక వాదాన్ని కొంత మంది ఉప-ప్రాంతీయ వాదం అంటున్నారు.

ఆసియా ఖండంలో భారతదేశం పరంగా చూసినపపుడు ఉప ఖండంగా పిలవబడుతూనే ప్రధాన ఖండంలో భాగంగా ఉంటుంది. అలాగే భారతదేశంలో వివిధ రాష్ట్రాలుగా విడిపోవడాన్ని కొంత మంది ప్రాంతీయ వాదంగానూ, మరి కొంతమంది భారత ఉప ప్రాంతీయ వాదం అనీ పిలుస్తున్నారు.

ఒకే రాష్ట్రం కూడా రెండు లేదా అంత కంటే ఎక్కువగా ప్రత్యేక రాష్ట్రాలుగా ఉండాలనుకోవడాన్ని కొంతమంది ఉప ప్రాంతీయ వాదం గానూ, మరికొంతమంది ప్రాంతీయ వాదంగానూ పిలుస్తున్నారు. ఇక్కడ ఉప

విభాగాల ప్రస్తావన చాలా అవసరం. ఎందుకంటే, తెలుగు సాహిత్యంలోనూ ప్రాంతీయ వాదంలో కనిపించే భావనలతోనే  అనేక విభజనల రూపంలో కనిపిస్తుంది.

సామాజిక సమస్యలే సాహిత్యంలోనూ ప్రతిఫలించాల్ని కోరుకోవడం సహజం. అలా అన్ని సమస్యలు, అన్ని ప్రాంతాల, వర్గాల, కులాల వారి ఆకాంక్షలు ఆ సాహిత్యంలో కనిపించనప్పుడు అస్తిత్వం కోసం వెతుకులాట మొదలవుతుంది. సాహిత్యం పునర్మూల్యాంకనానికి గురవుతుంది. కాల పరిస్థితులను కూడా పరిగణించకుండా  తమ తమ మానసిక స్పందనల్ని వ్యక్తీకరిస్తుంటారు. తమని గౌరవ ప్రదంగా చిత్రించిన సాహిత్యం గురించి మాట్లాడరు. ఒక వేళ ప్రయత్న పూర్వకంగానో, అప్రయత్న పూర్వకంగానో ఆ వర్గాల్ని ఏ మాత్రం అవమానించినట్లు అనుమానించినా, నాటి సామాజిక పరిస్థితుల్ని కూడా పరిగణించకుండా తీవ్రంగా నిరసిస్తుంటారు. అప్పటి వరకూ ఉన్న నిర?యాల్నీ  పరీక్షలకు పెడుతుంటారు.ప్రతి సమస్యనీ ప్రాంతంతో ముడిపెట్టి చూడడం ప్రాంతీయ అస్తిత్వ సాహిత్యంలో మరో ముఖ్యాంశం. కులం, మతం వంటి సమస్యలు తమని వెంటాడుతున్నప్పటికీ, అవి ప్రాంతంతో ముడిపడినప్పుడు ఆ సమస్యల పరిష్కారం ద్వితీయమే అవుతుంది. తెలంగాణ ప్రాంతంలోని ముస్లిం వాదం ప్రాంతీయ వాద అస్తిత్వంతో ముడిపడి కొనసాగుతుంది. దళిత సాహిత్యంలో కనిపించే వర్గీకరణ విషయంలోనూ ప్రాంతీయ వాద ఉద్యమ ప్రభావం ఉన్నప్పటికీ, దానికింకా అంత తీవ్రత లేదు. కుల, మత అస్తిత్వ ఆరాటం తెలంగాణ ప్రాంతీయ అస్తిత్వ వాదానికి ఉప ప్రాంతీయవాదంగా మారలేదు. రాష్ట్రంలోని మిగతా ప్రాంతాలైన రాయలసీమ, కళింగాంధ్ర, మధ్యాంధ్రలలో ఉన్న మాదిగలు వర్గీకరణ ఉ ద్యమాన్ని దళితుల సమానత్వాన్ని ఆకాంక్షించే దిశగానే కొనసాగిస్తున్నారు.

కళింగాంధ్ర ప్రాంతంలోనూ ప్రాంతీయవాద సూచనలు కనిపిస్తున్నా, అవి ప్రపంచీకరణలో భాగంగానే అత్యధిక మంది రచయితలు చూస్తున్నారు. కరువు, మూఢ విశ్వాసాలు వంటి విషయాల్లో స్పందించే రాయల సీమ, కళింగాంధ్ర  రచయితలు తమ సాంస్కృతిక అంశాల పట్ల దృష్టి

కేంద్రీకరించవలసిన అవసరం ఉంది. ఒకప్పుడు సినిమాల్లో, టి.వి.సీరియల్స్ లో బఫూన్, పనిమనిషి, విలన్ పాత్రల్లో వేష, భాషల్ని కించపరిచే దృశ్యాలు ఈ మధ్య కాలంలో ఎక్కువయ్యాయి. తెలంగాణ సాహితీ వేత్తల చైతన్యం ఆ ప్రాంతం వారి సాంస్కృతిక అంశాలను కించపరిచే చర్యలకు చాలా వరకూ అడ్డుకట్టవేసింది. వ్యాపార స్వభావులు తమకి అనుకూలంగా ఉన్న వాటిని సొమ్ము చేసుకోవడం సర్వసాధారణం. దాన్ని సాహితీవేత్తలు గుర్తించి వివిధ ప్రక్రియల రూపంలో సృజనీకరించి తమ మనోభావాల్ని వ్యక్తీకరించాలి. తూరుపు (కళింగాంధ్ర కవిత్వం), రాయలసీమ కవులు వొరువు' కవితాసంకలనం వంటివి ఇప్పుడిప్పుడే వస్తున్నాయి.

ప్రాంతీయ అస్తిత్వవాదం కంటే ప్రపంచీకరణ ప్రభావం వల్ల చిన్నాభిన్నమైపోతున్న జీవన యధార్థ జీవిత దృశ్యాలను స్థానీయ కోణంతో వ్యక్తీకరిస్తున్నారు. ఒక భావజాలం గల వాళ్ళే ఇలా ప్రపంచీకరణను వ్యతిరేకిస్తూ సాహిత్యాన్ని సృష్టిస్తున్నారనే వాదన కూడా వినిపిస్తుంది. అదే భావజాలం ఉన్న వాళ్ళు కూడా ప్రాంతీయ అస్తిత్వసాహిత్యాన్ని రాస్తూనే దాన్ని "వేర్పాటువాదం' గా కాకుండా ప్రపంచ వ్యాప్తంగా అలాంటి సమస్యల్ని పరిష్కరించడానికి పాలనలో జరుగుతున్న నిర్లక్ష్యాన్ని నిరంతరం తూర్పారపడుతూ, ప్రజల్ని నిత్య జాగృతుల్ని చేయగలగడం ద్వారానే ప్రాంతీయ సమస్యల శాశ్వత పరిష్కారాలు సాధ్యమన్నట్లు కూడా రాస్తున్నారు. నిజానికి దీన్ని కూడా ప్రాంతీయ అస్తిత్వ వాదంలో మరో పార్శ్వంగానే గుర్తించేవీలుంది. లేకపోతే తమ మాతృత్వ, పితృత్వంలో, కుటుంబంలో కోల్పోతున్న ఆత్మీయానురాగాలను గుర్తుచేసుకోలేరు. తమ గ్రామం, తమ సాంస్కృతిక వారసత్వాలను, తమ గ్రామీణ సమస్యలతో ముడిపెట్టి చూడ్డంలోనూ అస్తిత్వకోణం ఉన్నా అది స్థానీయమే అవుతుంది. ఇలా ప్రాంతీయ వాద అస్తిత్వ సాహిత్యం తెలుగులో పోరాటాల గడ్డ తెలంగాణ లోనే వివిధ ప్రక్రియల్లో విస్తరిస్తూ సాహిత్యానికి కొత్త దిశానిర్దేశం చేస్తుంది. అలాంటి చైతన్యంతో ముందుకెళ్తున్న రచయితలే సాహిత్యానికి నిజమైన జవజీవాల్ని అందించిన వాళ్ళవుతారు.

***

# దళిత కవిత్వంలో నూతన పదకల్పనలు

సాహిత్యంలో కొత్త పదాలు ఏర్పడడం అనేది ఒక నిరంతర ప్రక్రియ. అది దళిత సాహిత్యంలోనూ జరుగుతుంది. దళిత అనే పదమే ఒక నూతనపదకల్పన (నియోలాగిజమ్). దళిత అనే పదం ఒకప్పుడు "విడగొట్టబడిన" అనే అర్థంలో ప్రయోగంలో ఉంటే నేడు ఆ పదం "కింది కులాల సామూహిక చైతన్యం" గా పరిణమించింది. ఒకప్పుడు "హరిజన" అనే పదం స్థానంలో ఈ దళిత అనే పదం చేరింది. ఇలా ఒక పదం మరో అర్థంలో వ్యవహారంలోకి రావడాన్ని అర్థవిపరిణామం అని భాషాశాస్త్రవేత్తలు భావిస్తున్నారు. భాషలో కొత్తపదాలు పుట్టుకు రావడానికి అనేక కారణాలు ఉన్నా, కొన్ని పదాలు చాలా విచిత్రంగా ప్రాచుర్యంలోకి వస్తుంటాయి. ఇలా ప్రాచుర్యంలోకి వచ్చే పదజాల వ్యవస్థను ఆధునికంగా neologisms అని వ్యవహరిస్తున్నారు.

neo అనే ఫ్రెంచి పదానికి ఆంగ్లంలో' new ' అనీ ; 'logos అనే గ్రీకు పదానికి 'word' అనీ అర్థం. ఈ రెండు పదాల కలయిక వల్ల neologism అనే పదం ఏర్పడింది. దీనికి "నూతన పదకల్పన" అని అర్థం చెప్పుకోవచ్చు.

Neologism గురించి Oxford Dictionary ఇలా వివరించింది. neologism n. 1. a new word or expression. 2.the coining or use of new words.

neologism అనే పదం ముద్రణలో మొట్టమొదటిసారిగా 1772 లో కనిపించిందని వికీపీడియా వివరించింది. neologism గురించి

వికీపీడియా (Wikipedia) ఇలా వివరించింది.

A neologism is a newly coined word that may be in the process of entering common use, but has not yet been accepted into mainstream language. Neologisms are often directly attributable to a specific person, publication, period, or event (http://en.wikipedia.org/wiki/Neologism) ఆన్‌లైన్ (http://www.is.cs.cmu.edu/trl_conventions/neologisms.html) లోనే ఉన్న మరో నిర్వచనం మరింత వివరంగా ఉంది.

A neologism is the term used to describe a word that has been made-up or invented by a speaker, which appears in a transcript of spontaneous speech dialogue. It can also be described as a word which does not appear in the dictionary of the primary spoken language, but which is also not a foreign word

ప్రయత్నపూర్వకంగా గాని, అప్రయత్న పూర్వకంగా గాని నూతనంగా సృష్టించబడిన "పదం' జనవ్యవహారంలోకి వచ్చి, అది ప్రాచుర్యం పొందడం ద్వారా భాషలో స్థిరపడే అవకాశం ఉంది. ఆ పదం వ్యుత్పత్తి అర్థంతో సంబంధం లేకుండా అంతకు ముందులేని కొత్త అర్థాన్నిస్తుంది. అప్పటికే అనేక మంది అంగీకరించిన పదాలతో కూడిన ప్రధాన వ్యవహార భాష ఈ నూతన పదకల్పనను ఆహ్వానించవలసిన అవసరం ఉంది. అందువల్ల అప్పటికే ఉన్న నిఘంటువుల్లో అది ఇచ్చే అర్థం ఉండే అవకాశం లేదు. భాషాశాస్త్రవేత్తలు ఈ అవసరాన్ని గుర్తించి కొత్త అర్థాన్ని నిఘంటువులో చేరుస్తుంటారు.

తెలుగులో వచ్చిన దళిత సాహిత్యంలో ముఖ్యంగా వచన కవిత్వంలోని కొన్ని నూతనపదకల్పనలను పరిశీలిద్దాం!

ఎండ్లూరి సుధాకర్ "ఆత్మకథ' పేరుతో రాసిన ఒక కవితలో దళితులు ఒకప్పుడు ఊరికి దూరంగా విసిరివేయబడిన స్థితి నుండి, నేడు ప్రధాన వేదికలపై సన్మానాలందుకొనే స్థాయికి చేరుకున్నారని చెప్తున్న సందర్భంలో

కింది కవితాపంక్తులను వర్ణించారు.

*"నాలుగు మబ్బుల నీలిగోడల్ని చీల్చుకుంటూ*

*నేను ఐదవ సూర్యుడినై ఉదయించాను"* (ఎండ్లూరి సుధాకర్, ఆత్మకథ 1995) దీనిలో "మబ్బులతో గోడల్ని కట్టడం' అనేది పొసగని వాక్యం. గోడలు స్థిరంగా ఉండేవి. అడ్డంగా నిలిచేవి. "మబ్బులు స్థిరంగా ఉండవు. వీటికి చలన స్వభావం అత్యధికం. కనుక, అర్థం పొసగట్లేదు. అందువల్ల నాలుగు మబ్బుల నీలిగోడలు" అని ఉపమిస్తున్నాడు కవి. గోడలకుండే స్థిరత్వం గానీ, గట్టితనం గానీ లేని తనాన్ని ధ్వనించడానికి వీలుగా "నీలిగోడలు' గా వాటిని పోలుస్తున్నాడు.

"నీలి' శబ్దానికి నిఘంటువులు అనేక అర్థాల్నిస్తున్నాయి. నీలం అంటే నలుపు, కళంకం, మచ్చ, చీకటి మొదలైన అర్థాలు ఉన్నాయి. (నడుపల్లి పాఠశాల నిఘంటువు 2005:126) ఈ అర్థాల్లో "చీకటి'ని గ్రహించడం ద్వారా కవి ఉద్దేశించిన భావాన్ని సాధించవచ్చు.

సాధారణంగా "గోడల్ని' పగల గొట్టాల్ని అంటుంటారు. కానీ, ఇక్కడ కవి, " చీల్చుకుంటూ' అంటున్నాడు. అందువల్ల "చీకటి' అనే అర్థాన్నే స్వీకరించడం సమంజసం. ఇప్పుడు "నాలుగు మబ్బులతో కమ్మేసిన చీకటి అనే గోడల్ని' అనే భావం సూరేస్తున్నా, కొంత అస్పష్టత మిగిలే ఉంది. "నాలుగు మబ్బులు' అనే పదబంధం వల్ల వచ్చిన అస్పష్టత అది.

నాలుగు రాళ్ళు వెనకేసుకోవాలిబీ నలుగురు మెచ్చుకొనేటట్లు బతకాలిబీ నోట్లోకి నాలుగు మెతుకులు ల్లేవు... ఇలాంటివన్ని పలుకుబడులు. ఇక్కడ కవి జనవ్యవహారంలో ఉండే పలుకుబడిని ఉ పయోగించుకోలేదు. ఆత్మకథ అని తన కవితకు శీర్శిక పెట్టి పుట్టుక వల్ల తరతరాలుగా అవమానాలకు గురైన కులం నుండి వచ్చిన ఒక వ్యక్తి సమాజంలో గొప్ప ప్రతిభావంతుడుగా సన్మానిస్తున్న సందర్భంలో వర్ణించిన పదబంధం "నాలుగు మబ్బులు' చారిత్రకంగా చూసినప్పుడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు వర్ణాలు అనే అర్థంలో ఉపయోగించి,

పంచమవర్ణానికి చెందిన వ్యక్తిని వర్ణిస్తున్నాడు కవి. అందుకనే "నేను ఐదవ సూర్యుడిని' అనడం వల్ల నాలుగు ఏమిటో అవగాహన కొస్తుంది.

దీనిలో నాలుగు మబ్బులు బీ నీలిగోడలు అనే రెండు నూతన పదబందాలు ఉన్నాయి. ఈ విధంగా కవితను అర్థం చేసుకోవడం వల్ల "నాలుగు మబ్బులు' అంటే "నాలుగు వర్ణాలు' అనే నూతన అర్థాన్నిస్తుంది. "నీలిగోడలు' అంటే "జ్ఞాన నిరోద కుట్రలు' అనే కొత్త అర్థం తీసుకోవచ్చు. అప్పుడు ఈ పదాలకు కింది అర్థాలను చెప్పుకోవచ్చు.

నాలుగు మబ్బులు = బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర అనే నాలుగు వర్ణాలు

నీలిగోడలు = జ్ఞాన నిరోద కుట్రలు

ఐదవ సూర్యుడు = పంచముడు, దళితుడు.

*"నాకోసం చౌరస్తాలు రంగురంగుల*
*తోరణాలై ఆహ్వానిస్తున్నప్పుడు*
*నాతో ఐదడుగులూ కలిసేందుకు*
*స్వర్ణహంసలు సిద్ధపడుతున్నాయి"*

(ఎండ్లూరి సుధాకర్, ఆత్మకథ: 1995)

ఐదడుగులు = పంచములుగా పిలిచే దళితులతో కలిసి నడవడం, వివాహం చేసుకోవడం

స్వర్ణ హంసలూ అగ్రవర్ణయువతులు, దళితేతర వర్గాలు

*"ఇప్పటి కొత్త సూర్యుడి వెలుగులో*
*కాలం నా ఆత్మకథను*
*పాఠ్య గ్రంథంగా చదువుకుంటుంది"*

(ఎండ్లూరి సుధాకర్, ఆత్మకథ: 1995)

కొత్త సూర్యుడి వెలుగు = అన్ని వర్ణాల విజ్ఞానానికీ అవకాశం ఉన్న

మార్గం

*ఈ సారి ఉగాది*
*ఆనందాన్ని కాదు*
*అస్థికల మూటని మోసుకొచ్చింది*
*లక్షల లక్కా గృహాల*
*గుజరాతు బూడిదని తీసుకొచ్చింది'*

(ఎండ్లూరి సుధాకర్, ఈ సారి ఉగాది : 2002)

గుజరాతు బూడిద =మతవిద్వేషం, గుజరాతు రాష్ట్రంలో ముస్లింల దహనం

*"అతడు రాత్రి సూర్యుడు*
*కళ్ళ బొరియల్లో నిదురచాప మడతపెట్టి*
*దొంగచీకటిని వెంటాడుతుంటాడు"*

(ఎండ్లూరి సుధాకర్, గూర్ఖా :1992)

రాత్రి సూర్యుడు =గూర్ఖా, కాపలావాడు.

అర్ధరాత్రి ఆలు బిడ్డల్ని విడిచి
ప్రతి రాత్రీ గౌతమ బుద్ధుడవుతాడు"

(ఎండ్లూరి సుధాకర్, గూర్ఖా :1992)

గౌతమ బుద్ధుడు = విధినిర్వహణ వల్ల తప్పనిసరిగా భార్యా బిడ్డల్ని వదిలి వెళ్ళే వ్యక్తి.

*''ఆహా!*
*ఇలా బ్రతకడంలోనే*
*ఎంత మాధుర్యముంది*
*ఓ మధుమేహనాంగీ!'*

(ఎండ్లూరి సుధాకర్, తీపికోత :1995)

ఓ మధుమేహనాంగీ! = మధుమేహగ్రస్తుడు

*"నా భయమంతా*
*నా పందిరి గురించీ,*
*నా లేత తీగల గురించే"*

(ఎండ్లూరి సుధాకర్, తీపికోత :1995)

పందిరి = భార్య,
లేత తీగలు =కూతుళ్ళు

"ఎప్పటికైనా మనం కూడా మెతుకుబట్టిన
బతుకులమవుతాం
కొత్తచెప్పులతో తలెత్తుకొని
రాజవీథుల్లోంచి నడుస్తాం
దాసూ! నిన్ను కొత్తగా చూడాల్ని వుందిరా
నీతో కలసి
నా కలల గింజలు పంచుకోవాలనుంది రా!"

(ఎండ్లూరి సుధాకర్, దాసును చూడాలి: 1996)

కొత్తచెప్పులు = కొత్తహక్కులు,
కొత్తనియమాలతో రూపొందించుకున్న తమ హక్కులపై
నిలబడికలల గింజలు = రావాల్సిన హక్కులు,
కొత్తగా చూడటం =మారిన మనిషిని చూడటం

*"పంచభూతాల్లారా!*
*పత్తిరైతుల ప్రాణాల్ని ఎక్కడ దాచారు?*
*అంతర్జాతీయకంప్యూటర్లకు తెలుసా?*
*రెండువేల ఇరవైనాటి*
*సామ్రాజ్యవాదపు చూపులకు తెలుసా?"*

(ఎండ్లూరి సుధాకర్, దూదిపూల దు:ఖం : 1998)

అంతర్జాతీయకంప్యూటర్లు = ప్రపంచబ్యాంకు,రెండువేల ఇరవైనాటి సామ్రాజ్యవాదపు చూపుల vision 2020.

*‘‘ఆటల్లో నేను దెబ్బలు తిని వచ్చినప్పుడు*
*నువ్వు కన్నీటి కత్తివై*
*లోలోన తరుక్కుపోయేదానివి*
*ఎప్పుడూ ఒక నల్లగొడుగు నీ నెత్తిమీద*
*నీలిదెయ్యమై వెంటాడుతుండేది”*

(ఎండ్లూరి సుధాకర్, నల్లతల్లి : 1995)

నల్లగొడుగూ అంటరానితనం, నీలిదెయ్యం =అంటరానితనం

*నువ్వెంత కలపాలనుకున్నా*
*నీ నల్లమాటలకు మీగడలద్ది*
*ఆప్యాయంగా వరుసలు కలుపుకున్నా*
*కొన్ని చూపులు నిప్పుకోళ్ళై తప్పుకునేవి’*

(ఎండ్లూరి సుధాకర్, నల్లతల్లి : 1995)

నల్లమాటలు = దళిత పలుకులు,

చూపుల నిప్పుకోళ్ళు = అసూయాగ్రహావేశాల చూపులు.

నిన్ను అకారణంగానూ అన్యాయంగానూ
కొప్పుపట్టి లాగి కొడుతున్నప్పుడు
*నీమీద ఆకూ వక్కా నమిలి ఉమ్ముతున్నప్పుడు*
*ఆడదుశ్శాసినులు నీ కోకలు చింపుతున్నప్పుడు*
*ఒక కొడవలిగానో*
*ఒక కాళికలాగో మారకుండా*
*ఆడ క్రీస్తులా*
*అలా బేలగా ఉండిపొయ్యేదానివి”*

(ఎండ్లూరి సుధాకర్, నల్లతల్లి : 1995)

ఆడదుశ్శాసినులు = అసభ్యంగా ప్రవర్తించిన స్త్రీలు,

ఆడక్రీస్తు =నిస్సహాయంగా హింసను భరించే స్త్రీ

*నేనిప్పుడు*

*కొత్తభారతానికి కొత్తతలనవుతున్నాను'*

(ఎండ్లూరి సుధాకర్, నల్లతల్లి : 1995)

కొత్తభారతం = ఆధునిక కులరహిత భారతదేశం,

కొత్తతల = నూతన ఆలోచనల కేంద్రంగా మారడం

దళిత వ్యాకరణం అనే వచన కవితాసంకలనాన్ని తుల్లిమల్లి విల్సన్ సుధాకర్ 2007 లో ప్రచురించారు. కవితాసంకలనానికి పెట్టిన పేరే ఒక నూతన పదకల్పన. వ్యాకరణం అనేది భాషా వ్యవస్థను సూత్రరూపంలో వివరిస్తుంది. ఇక్కడ దళిత వ్యాకరణం అనే పదబంధం దళితకవిత్వం, దళితులు వ్యవహరించే భాష, దళితుల జీవనవిధానం, దళిత ఆలోచనా సరళిని తెలిపేటట్లుగా ఉపయోగించుకున్నాడు కవి. తన కవితల వరుస క్రమాన్ని(విషయ సూచిక) " వ్యాకరణ క్రమం' అని పేర్కొనడం వల్ల ఈ అర్థాలనే సూచిస్తున్నాడనిపిస్తుంది. దళిత వ్యాకరణం పేరుతో రాసిన కవితలో

*దళిత వ్యాకరణం తెలుసుకోవాలంటే*

*లాల్ సలామ్ కూ జైభీమ్ కూ*

*తేడా తెలుసుకోవాలి కదా!'* (తుల్లిమల్లి విల్సన్ సుధాకర్, దళిత వ్యాకరణం 2007) దీనిలో లాల్ సలామ్ అనేది మార్క్సిజాన్ని, జైభీమ్ అంబేద్కర్ సిద్ధాంతాల్ని సూచింపజేయడం వల్ల దళిత వ్యాకరణం అంటే దళిత జీవితం అని స్పష్టమవుతుంది. కవితా సంకలనానికి, కవితకు పెట్టిన పేరు, కవితా స్వభావాన్ని గమనించినప్పుడు దళితవ్యాకరణం అనే పదానికి దళిత కవిత్వం, దళిత జీవితం అనే అర్థాలను వివరించుకోవచ్చు.

దళిత వ్యాకరణం = దళిత కవిత్వం, దళిత జీవితం

ఈ కవే రాసిన మరో కవితా ఖండికలో గాంధీజీని కొత్తపదంతో చెప్పారు. " *చీరకొననందుకు అలిగి అన్నం తినని పెళ్ళాంలా*

*ఒక అర్థనగ్న ఫకీరు*

*దళితుల కోసం ప్రత్యేకనియోజక వర్గాలివ్వద్దని*
*ఆమరణ నిరాహారదీక్ష చేస్తే*
*ఆరంజి రసమిచ్చి ఊరుకోబెట్టావు గానీ*
*వాడు తాగింది మిలియన్ల నిమ్నజాతుల రక్తమని*
*దేశానికెంత తెలివిగా చాటిచెప్పావూ..."*

(తుల్లిమల్లి విల్సన్ సుధాకర్, నువ్వేలేకపోతే... 2007)

దళితులకు ప్రత్యేకనియోజకవర్గాలు కావాల్ని డా.బి.ఆర్. అంబేద్కర్ పోరాడుతున్నప్పుడు, దాన్ని వ్యతిరేకిస్తూ గాంధీజీ ఆమరణ నిరాహార దీక్ష చేయడం, ఆయన ఆరోగ్యాన్ని కాపాడటం కోసం ప్రాణ భిక్ష పెట్టడం వంటివన్నీ చారిత్రక విషయాలు. ఇక్కడ "అర్ధనగ్న ఫకీరు' అనడంలో గాంధీ వస్త్రధారణను, ఫకీరులోని భిక్షాప్రవృత్తిని మిళితం చేసి నూతన పదబంధాన్ని సృష్టించాడు కవి.

అర్ధనగ్న ఫకీరు = గాంధీజి

ఎండ్లూరి సుధాకర్ రాసిన కొత్తగబ్బిలం వచన దీరెకావ్యంలో చాలా నూతన పదకల్పనలు కనిపిస్తున్నాయి. గబ్బిలం పద్య కావ్యాన్ని గుర్రం జాషువ రాశారు. అది స్వాతంత్ర్యోద్యమ కాలం నాటిది. గాంధీమార్గంలో సంస్కరణ ఉద్యమంలో భాగంగా ఆ కావ్యాన్ని రెండు భాగాలుగా రాశారు. దానిలో గబ్బిలం దళితునికి ప్రతీకగా తీసుకొని కైలాసంలో ఉన్న శివుడితో తన జీవన వ్యధనంతా చెప్పుకున్నట్లు వర్ణించారు.

వినుకొండ నుండి ప్రారంభమైన గబ్బిలం ప్రయాణం భారతదేశవ్యాప్తంగా వివిధ పుణ్యక్షేత్రాలను, ప్రాంతాలను, పాలకులను వర్ణిస్తూ కొనసాగింది. దళితులు అనుభవిస్తున్న అంటరానితనాన్ని, అస్పృశ్యతనూ సందరానుసారంగా వ్యక్తీకరించడం కావ్య విశేషం. దీన్ని ప్రేరణగా తీసుకొని ఎండ్లూరి సుధాకర్ కొత్త గబ్బిలం పేరుతో 1998 ఒక వచన దీరె కావ్యం ప్రచురించారు. దీన్ని 27-5-1995లో ప్రారంభించి 22-9-1998 నాటికి పూర్తిచేశారు. ఈ కాలంలో ఆంధ్రప్రదేశ్ లో దళితులలో

గల 61ఉపకులాలకు సమాన అవకాశాలు లభించాలనే లక్ష్యంతో మాదిగ రిజర్వేషన్ పోరాట సమితి వాళ్ళు దళిత రిజర్వేషన్స్ ని వర్గీకరించాల్ని ఉద్యమం తీవ్రతరం చేశారు.

భారత రాజ్యాంగంలో షెడ్యూల్డు కులాల కోసం రిజర్వేషన్స్ ఏర్పాటుచేసింది. వాళ్ళ ఉపకులాల వారీగా కాదనీ, ఉపకులాల ప్రకారం రిజర్వేషన్స్ ఇవ్వడం వల్ల దళితుల మధ్య గల సమైక్యత విచ్ఛిన్నమవుతుందని దళితుల్లోని ప్రధానమైన మాల ఉపకులం వాళ్ళు వర్గీకరణ ఉద్యమాన్ని వ్యతిరేకించారు. ఇప్పుడు దళితుల్లో మాల వర్గం– మాదిగ వర్గం అనే రెండు ప్రధానమైన శిబిరాలు ఏర్పడ్డాయి. 61 దళిత ఉపకులాలు రెండు ప్రధాన వర్గాలుగా విడిపోయిన నేపథ్యంలో ఎస్సీ వర్గీకరణ ఉద్యమ తీరుతెన్నులను వివరిస్తూ వెలువడిన కావ్యం కొత్తగబ్బిలం. రాజమండ్రి నుండి హైదరాబాదుకి బయలు దేరిన ఒక గబ్బిలానికి కవి వివిధ ప్రాంతాల గురించి చెప్తూ హైదరాబాదు వెళ్ళి వర్గీకరణ ఉద్యమం విజయవంతంగా ముగించుకొని రమ్మని కొత్తగబ్బిలం రూపంలో మాదిగ వర్గానికి ప్రబోధిస్తున్న ధ్వని కావ్యం ఈ కొత్త గబ్బిలం.

ఈ పై కావ్యనేపథ్యం, సామాజిక ఉద్యమ చరిత్ర అవగాహన ఉ ంటేనే దీనిలో ఉన్న నూతన పదకల్పనలు తెలుస్తాయి. వీటిలో కొన్నింటిని విశ్లేషిస్తాను.

నల్ల సూర్యుడు =దళిత ఉద్యమకారుడు

దళిత సాహిత్యంలో ముఖ్యంగా కవిత్వంలో “నల్ల’ అనే విశేషణంతో చాలా మంది నూతన పదకల్పనలు చేస్తున్నారు. అయితే “నల్ల’ అనే విశేషణం అన్నింటా ఒకే అర్థంలో ప్రయోగంలో లేదు. భిన్నార్థాలలో ఉ పయోగించుకుంటున్నారు. నీలి, నలుపు, నల్ల మొదలైన
విశేషణాలను భిన్నార్థాల్లో విరివిగా ప్రయోగించిన కవి ఎండ్లూరి సుధాకర్.

*దండోరా ముట్టడికి*
*నగరానికెళ్తున్నానని సగర్వంగా ప్రకటించింది*

*గ్రహణం పట్టిన నల్లసూర్యుడిలా నన్ను కమ్మేసింది"*

(కొత్త గబ్బిలం 1998 –1)

ఈ పై కవితా ఖండికలో "నల్ల సూర్యుడిలా' అని పోల్చారు. సూర్యుడ్ని కవులు చైతన్యానికి ప్రతీకగా అభివర్ణిస్తుంటారు. ఇక్కడ కవి నల్లసూర్యుడిలా అనడంలో, అదికూడా "గ్రహణం పట్టిన' అని వరి?ంచడంలో సూర్యుడి తీక్షణత్వాన్ని గుర్తించేలా చేశాడు. సాధారణంగా సూర్యుడు తేజస్సుతో ఉంటాడు. తేజస్సుని తెలుపుతో లేదా ఎర్రదనంతో చెప్తుంటారు. కానీ, కవి ఇక్కడ వాచ్యార్థంతో కాకుండా, వ్యంగ్యార్థంతో చెప్తున్నాడు. అప్పటికే "నలుపు' దళితులకు ప్రతీకగా ఉండటం వల్ల వ్యవహారంలో ఉన్న నల్ల విశేషణాన్ని సూర్యుడికి ముందు చేర్చడంతో "దళిత ఉద్యమకారుడు' అనే నూతనార్థం సిద్ధించింది.

నీలిదారి = దళిత జీవన విధానం

నల్ల నిజాలు =దళితులకు జరిగిన అవమానాలు

రాజహంసలు =దళితేతర అధికార శక్తులు

*నీలిదారి నిషేధించిన రాజహంసలు*

*నీ కాలిగుర్తుల నల్ల నిజాలు చెప్పలేవు"*

(కొత్త గబ్బిలం 1998 – 2)

ఈ పై కవితా ఖండికలో నీలిదారి, రాజహంసలు, నల్లనిజాలు అనేవి నూతన పదకల్పనలు. కవుల ప్రయోగించే కవి సమయాల్లో హంసకు విశేషమైన స్థానం ఉంది. పాలు, నీళ్ళు కలిసిపోయినా వాటిని స్పష్టంగా విడదీసి చూపగల నైపుణ్యం వాటికి ఉందని కవులు భావిస్తుంటారు. దీని ఆధారంగా కవి ఇక్కడ "రాజహంసలు' అంటే అధికారంలో ఉన్న దళితేతరశక్తులు అనే వ్యంగ్యార్థస్ఫురణ చేయగలిగారు.

దానితో అది నూతన పదకల్పన అయ్యింది. ఆ రాజహంసలు నిషేధించిందేమిటి? నీలిదారిని. అందరూ పయనించగలిగే దారిని కొందరికి నిషేధించడానికి కారణాలేమిటి? కట్టుబాట్లు. వాటిని ఏర్పరిచిందెవరు?

అధికారంలో ఉన్న శక్తులు.

దళితేతర శక్తులు దళితులను ప్రధాన జీవన స్రవంతిలోకి రాకుండా చాతుర్వర్ణ కుల నియమాల్ని పెట్టి నిషేధాలను అమలు పరిచారు. దానితో వాళ్ళ జీవన విధానమే ప్రత్యేకమైపోయి, అధోగతిలోకి
పోయింది. అస్పృశ్యుడిగా భావించబడిన నాటి దళితుడు ప్రధానమైన దారుల్లో పయనించడానికి ప్రయత్నిస్తే నోటికి ముంతా, ముడ్డికి తాటాకు కట్టిన హిందూ సంప్రదాయ చరిత్రే కాలిగుర్తుల నల్లనిజాలు.

*నువ్వు బిన్నీయా? బాటానా?*
*సైకిలా ? రిక్షా నా? అదా ? ఇదా?*
*ప్రభా ? పత్రికా? నూలా? తోలా?*
*రెండా? మూడా?*
*ఇలా అక్కడెవరైనా ఆరాలు తీసి*
*నీ పంచతంత్రం విప్పమంటారు"*

(ఎండ్లూరి సుధాకర్, కొత్తగబ్బిలం 1998 – 22)

ఎస్సీ వర్గీకరణ ఉద్యమం వచ్చిన తర్వాత మాల – మాదిగల మధ్య వ్యత్యాసాలు మరింతగా పెరిగిపోయాయి. ఏదైనా మనసు విప్పి మాట్లాడు కోవాలంటే ముందు మాట్లాడే వ్యక్తి దళితుడైనా, అతని ఉపకులం ఏమిటో తెలుసుకోవాల్ని రకరకాలుగా ప్రయత్నించడం కనిపిస్తుంది. మాలా? మాదిగా? అని డైరెక్ట్‌గా అడక్కుండా కొన్ని గుర్తులతో మాట్లాడుకొని నిర్ధారించుకోవడం కోస్తాలోనే కాదు, ఇంచుమించు ఆంధ్రప్రదేశ్ లోని చదువుకున్న దళితులంతా చేస్తున్నపని. అక్షర సంఖ్య, పద స్వభావాల్ని బట్టి సులభంగా వాళ్ళ ఉపకులాల్ని గుర్తించేటట్లు మాట్లాడుకుంటున్న వైనాన్ని కవి ఇక్కడ నూతన పదబంధాలతో కవిత్వీకరించారు. సైకిలు కి రెండు చక్రాలు, రిక్షాకి మూడు చక్రాలు ఉ ంటాయి కదా. దీన్ని ఆధారంగా "మాల' "మాదిగ' ఉపకులాలను చక్రాల సంఖ్యకు అణుగుణంగా మార్చుకొని అర్థం చేసుకుంటున్నారు. ఇప్పుడు సైకిలు ౢ మాలబీ రిక్షౌ మాదిగ గా నూతన పదబంధాలు తయారైయ్యాయి.

అలాగే ప్రభా మాలబీ పత్రికా మాదిగ, రెండూ మాలబీ మూడూమాదిగ అనే పదబంధాలు ప్రాచుర్యంలోకి వచ్చాయి. అలాగే పంచతంత్రం అనేది దూబగుంట నారాయణ కవి రాసిన అయిదు ప్రధానభాగాలు గల కావ్యంగా కాకుండా, పంచములలో ఉపకుల రహస్యం అనే కొత్త అర్థంలో కవి ప్రయోగించారు.

వీటికి ఇలా నూతన అర్థాలను వివరించుకొనే వీలుంది.

సైకిలు =మాల,

రిక్షా= మాదిగ,

ప్రభ = మాల,

పత్రిక = మాదిగ,

రెండు = మాల,

మూడు =మాదిగ,

పంచతంత్రరా=పంచములలో ఉపకుల రహస్యం

ఇలా అన్నింటినీ వివరించుకుంటూపోతే ఆ నూతన పదకల్పనల్లోని ఔచిత్యప్రయోగం తెలుస్తుంది. అయితే విస్తరణ భీతి వల్ల అన్నింటినీ వివరించట్లేదు. అవగాహన చేసుకోవడానికి వీలుగా కవితా ఖండికను ఉదాహరిస్తున్నాను.

*"తండ్రీ ! యిది రాజమండ్రి*
*కులం కలుగులోంచి బయటకు రాని యెండ్రి*
*నడిచే పాదాలకైనా నాడాలు కొట్టగలదు*
*నమ్మకంగా దేన్నైనా అమ్మకానికి పెట్టగలదు*
*ఇక్కడ ఎడమచేతి ఆలోచనల్ని*
*కుడిచేతులు అతి లాఘవంగా తమ గుప్పిట్లోకి తెచ్చుకుంటాయి"*

(కొత్త గబ్బిలం 1998 –3)

ఎడమ చేతి ఆలోచనలు =ఉత్తుత్తి కులాల తెలివితేటలు

*" మిత్ర లాభాలన్నీ కనబడని మిత్రభేదాలే*

*పైకి శాంతంగా వున్నా లోన మాత్రం సొంతగోదాలే*
*ఇక్కడ నీళ్ళలో రకరకాల జల గుణాలున్నాయి*
*ఈ రక్తంలో శతాబ్దాల మను కణాలున్నాయి"*
(కొత్త గబ్బిలం 1998 -3)

మనుకణాలు = సనాతన హిందూ విశ్వాసాలు

*"శ్రమ ఉలితో నాగరికతా శిల్పాన్ని చెక్కిన వాళ్లం*
*దాన్ని హైజాక్ చేసి*
*నువ్వు ప్రతిభావంతుడివైతే*
*దోచుకోవడం తప్ప అన్ని వృత్తులను*
*ప్రాణంలా పెంచుకున్న వాళ్లమై*
*మండల్ జలం తో గొంతు తడుపుకుని*
*తాత్కాలిక ఉపశమనం కోసం తపించిన వాళ్లం"*
(ఎన్. రవికుమార్, కె.శ్రీనివాసరావు,
సాయుధమౌతున్నవాణ్ణి 1995)

మండల్ జలం=మండల్ కమీషన్ వల్ల వచ్చిన రాయితీలు

*"ఏకులాగా ఒంట్లో దూరిన ఆర్య రక్తకణం*
*మేకుల సమూహమై అరికాళ్లలో తిష్టవేసిన నిశ్శబ్దం!*
*కేవలం నాలుగు తాటాకు కట్టల చప్పుళ్లకి*
*చరిత్రకారుడి గోచీ ఒంటేలుతో తడిసినప్పటి నిశ్శబ్దం!*
*ఎంత అమాయకంగా చీలిపోయాను"*
(పైడి తెరేష్ బాబు, ఏడుకట్లసవారి 1996)

నాలుగు తాటాకు కట్టల చప్పుళ్లు=నాలుగు వేదాల బోధనలు

ఇలా దళితకవిత్వంలో చాలా నూతనపదబంధాలు కనిపిస్తున్నాయి. అవి నేను ప్రచురించబోయే పరిశోధన గ్రంథం దళిత కవిత్వంలో నూతన పదకల్పనలు (Neologisms in Dalit Poetry)లో మరిన్ని చూడవచ్చు.

కవిత్వంలో కవులు ప్రయోగించే నూతన పదకల్పనలకు

సర్వజనామోదం ఉంటుందా? అనే విషయంలో సైద్ధాంతిక వివరణలోకి వెళ్ళవలసిందే!

సాధారణంగా నూతనపదకల్పనలు దేశ పరిస్థితులను బట్టి కూడా ఏర్పడే అవకాశం ఉంది. భారతదేశంలో ఉన్న కులవ్యవస్థ వల్ల, ఆ కుల నిర్మూలన, దళితుల ప్రధాన జీవన స్రవంతి కోసం జరుగుతున్న సృజనాత్మక చర్యల్లో దళితసాహిత్యం ఒక ఉప్పెనలా వచ్చింది. ముందుగా కవితా రూపంలోనే అది వెలువడింది. ఇలా వచ్చిన దళిత కవిత్వంలోని నూతన పదకల్పనలను గుర్తించాలంటే, ముందుగా భారతదేశ కుల వ్యవస్థను అవగాహన చేసుకోవాలి. పాశ్చాత్యదేశాల నుండి వచ్చినా పీడనను వ్యతిరేకించే స్వభావం గల మార్క్సిజాన్ని అర్థం చేసుకోవాలి. అంతకంటే ముందు భారతదేశంలోనే పుట్టిన వేదాలు స్వరూప స్వాభావాల్ని గమనించాలి. మనుధర్మశాస్త్రాన్ని, పురాణాల్ని, ఇతిహాసాల్ని, కావ్య సాహిత్య వారసత్వాన్ని తెలుసుకోవాలి. ఇలా ఒక దేశంలోని పరిస్థితులు కూడా నూతన పదకల్పనలకు కారణాలవుతుంటాయి. వీటిని శాస్త్రీయంగా అధ్యయనం చేస్తే కింది సూత్రీకరణలు చేసే అవకాశం కనిపిస్తుంది.

### నూతన పదకల్పనలు (Neologisms) ఏర్పడే పద్ధతులు :

1. అప్పటికే ప్రయోగంలో ఉన్న పారిభాషిక పదాలు లేదా వాడుక మాటలు నూతన భాషా రూపాలుగా మారవచ్చు. (to reshape older terms in newer language form)

2. పాత భావనలను నూతన సాంస్కృతిక అర్థాలలో ఉపయోగించవచ్చు. (old ideas which have taken on a new cultural context)

3. చాలా తక్కువ మందిలో ప్రాచుర్యంలో ఉండవచ్చు. (being used only by a very small subculture. )

4. కొన్ని నూతన పదకల్పనలు ప్రాచుర్యంలోకి రావచ్చు లేదా ఆ పదకల్పనలు ప్రజామోదం పొందలేక మరుగున పడిపోయే అవకాశం కూడా ఉంది. (Having gained recognizable and probably lasting acceptance. )

5. నూతన పదకల్పన ప్రాచుర్యాన్ని పొందడాన్ని బట్టి భాషానిపుణులు దాన్ని నిఘంటువుల్లో కూడా పొందు పర్చవచ్చు.
(Acceptance by linguistic experts and incorporation into dictionaries also plays a part, as does whether the phenomenon described by a neologism remains current, thus continuing to need a descriptor.)
6. భాషాశాస్త్రవేత్తలు అంగీకరించిన నూతన పదకల్పనలను కూడా సామాన్య ప్రజలు నిరాకరించే అవకాశం కూడా లేకపోలేదు. (Non-experts who dislike the neologism sometimes also use this argument, deriding the neologism as.
abuse and ignorance of the language)

నూతన పదకల్పనలు కేవలం సాహిత్యంలోనే కాదు. శాస్త్ర, సాంకేతిక రంగాల్లో కొత్తగా ఏవైనా కనుగొన్నప్పుడు నూతన పదకల్పన జరగవచ్చు. రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో ఇవి ఏర్పడే అవకాశం ఉంది. వీటికి అర్థనిర?యం చేసేటప్పుడు చాలా జాగ్రత్తలు అవసరం. అలంకారాలు, ధ్వని, ప్రతీకలు కూడా నూతన పదకల్పనలకు ఎంతగానో తోడ్పడుతుంటాయి.

## ఆధార గ్రంథాలు:


ఆంగ్లం:

Illustrated Oxford Dictionary, Oxford University Press, 2007. page: 547

http://en.wikipedia.org/wiki/Neologism

http://www.is.cs.cmu.edu/trl_conventions/neologisms.html

కృష్ణమూర్తి, భద్రిరాజు. తెలుగు భాషా చరిత్ర. హైదరాబాదు : తెలుగు విశ్వవిద్యాలయం, 1995. (ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ప్రథమ ముద్రణ 1974)

తెరేష్ బాబు, పైడి. అల్పపీడనం. హైదరాబాదు:

స్వీయప్రచురణ, 1996.
రాజు, ఎన్.ఎస్. (సం.) నడుపల్లి పాఠశాల నిఘంటువు.
హైదరాబాదు: శ్రీ సత్య. ఎన్ ప్రచురణలు, 2005.
రాజశేఖర్, పట్టేటి., నాగప్పగారి సుందర్ రాజు (సం.)
గుండెడప్పు (కవితాసంకలనం). హైదరాబాదు:
దళిత సాహిత్య వేదిక ప్రచురణ, 1995.
లక్ష్మీనరసయ్య. జి., త్రిపురనేని శ్రీనివాస్. (సం.) చిక్కనవుతున్న పాట.
విజయవాడ: కవిత్వం ప్రచురణలు, 1995.
విల్సన్ సుధాకర్, తుల్లిమల్లి. దళితవ్యాకరణం.
హైదరాబాదు: విజయభారతి పబ్లికేషన్స్, 2007.
సుధాకర్ ఎండ్లూరి. కొత్తగబ్బిలం (దీరెకావ్యం), రాజమండ్రి:
మానస ప్రచురణలు, 1998.
సుధాకర్. ఎండ్లూరి. నల్లద్రాక్షపందిరి darlky(ఉభయ భాషా కవిత్వం)
సికింద్రాబాదు: జె.జె. ప్రచురణలు, 2002.

***

# మాదిగ సంస్కృతిని అంటనివ్వని "వసంతం'

ఒక రచనను సాధారణీకరించేటప్పుడు లేదా సిద్ధాంతీకరించేటప్పుడు చాలా జాగ్రత్తలు తీసుకోవాలి. లేకపోతే పాఠకుల్ని, చరిత్రని తప్పుదోవపట్టించిన వాళ్ళవుతారు. అలెక్స్ హెలీ రాసిన రూట్స్‌నవల తెలుగులో "  ఏడుతరాలు' గా వచ్చింది. అది
సాహిత్యం రూపంలో ఒక జాతి చరిత్రని  తెలుగు వాళ్ళకి అందించింది. కేవలం తెలుగు మాత్రమే చదువుకున్న వాళ్ళు, మూలాన్ని చదువు కోని వాళు ్ళ, ఆ జాతుల్లోనూ భిన్న తెగల చరిత్ర తెలియని వాళ్ళు అదే ఆ జాతి చరిత్రగా అర్థం చేసుకుంటారు.

ఇప్పుడు "అంటరానివసంతం' నవల్ని కూడా భారతదేశంలోని ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఆంధ్రప్రదేశ్ లోని అంటరానివాళ్ళ చారిత్రక, సాంస్క ృతిక ప్రతిఫలన దిశగా అనేక తరాల జీవితాల్ని ప్రాతినిధ్యం వహించేటట్లు చిత్రించిన నవలగా సిద్ధాంతీకరించే ప్రయత్నాలు జరుగుతున్నాయి. అదే పద్ధతిలో ఈ నవల ఇతర భాషల్లోకి వెళితే దీనిలో చిత్రితమైన "అంటరాని' వాళ్ళే భారతదేశంలో నిజంగా అంటరానివాళ్ళను కునే  ప్రమాదం ఉంది.

ఈ నవల తొలి ప్రచురణ 2000 వ సంవత్సరంలో జరిగింది. అంతకు ముందే ఈ నవలను ఒక మాసపత్రికలో ధారావాహికంగా ప్రచురించారు. ఈ నవల ముఖచిత్రాన్ని గానీ, రచనా విధానాన్ని గానీ పరిశీలిస్తే విస్మరించబడిన చరిత్రను, సాహిత్యాన్ని పునర్లిఖించి, కళల్ని ఉ ద్ధరించాలనే ఆలోచన ఉందనిపిస్తుంది. నవలా రచనను చూస్తే విశ్వనాథ సత్యనారాయణ తన నవలల్లో మధ్యలో ప్రవేశించి చాలా విషయాల్ని

వ్యాఖ్యానిస్తున్నట్లుగానే, ఈ రచయిత కూడా మధ్య మధ్యలో తన వ్యాఖ్యాన చాపల్యాన్ని ప్రదర్శించుకున్నారు. అది కూడా లిఖిత సాహిత్యమంతా వక్రీకరణకి గురయ్యిందనే ధోరణిలోనే సాగింది. నవల చివర నోట్స్ ని కూడా అలాగే వివరించారు. దానిలో ఒక ధిక్కారస్వరం వినిపిస్తుంది. హేళన కనిపిస్తుంది.

ఇంత ఆలోచనతో నైపుణ్యంగా రాసిన రచయిత మాదిగల చరిత్రను విస్మరించడానికి గల కారణాలేమిటి? విప్లవరచయితల సంఘం వాళ్ళు ప్రచురించినా, ఉత్పత్తి కులాల, వర్గాల చరిత్ర రాసే వాళ్ళలోనూ తన కులం వాసనే గుప్పిస్తున్నట్లనిపిస్తుంది. ఇది కూడా సాహిత్య చరిత్ర నిర్మాణంలో చేసే ఒక కుట్రగానే భావించాలి. అది కుట్ర కాకపోతే రచయిత కూడా ఈ లక్షణాల్నే మాదిగల పట్ల ప్రదర్శించడాన్నేమనాలి?

విస్మరణకు గురైన చరిత్రనీ, సంస్కృతినీ చాలా జాగ్రత్తగా ఈ నవల్లో రికార్డ్ చేసిన రచయిత, అంటరాని వాళ్ళలో అత్యంత అంటరాని వాళ్ళైన మాదిగల్ని, వారి అనుబంధ ఉపకులాలైన పాకీవాళ్ళనీ విస్మరించడం వల్ల "అంటరాని' అనే పారిభాషిక పదాన్ని ప్రయోగించడంతోనే మళ్ళీ చరిత్రని వక్రీకరణకు గురిచేస్తున్నారు.

రచయిత మార్క్సిస్టు ఉద్యమ కారుడైనా మాల కులస్థుడే! అందువల్ల నవల అంతా మాల కులస్థులు కేంద్రంగానే సాగుతుందనుకుందాం. అలాంటప్పుడు తమ కులం నుండే సాహిత్యాన్నీ, చరిత్రనీ అర్థం చేసుకుంటారనుకుంటే, అంతకు ముందు దళితేతరులు కూడా అలాగే వ్యాఖ్యానిస్తూ రాశారని అంగీకరించగలమా?

ఒక ఆధిపత్యాన్ని వ్యతిరేకించే ఆశయంతో మొదలైన రచన మరో ఆధిపత్యానికి కారణమైతే ఎలా? అయితే రచయిత అది అంత స్పష్టంగా కనిపించనివ్వకుండా శ్రామిక ముసుగు కప్పారు. మాలలు కూడా అంటరాని వాళ్ళు. కనుక, అంటరాని వాని జ్ఞాపకాలు, అనుభవాలు, అవీ కొన్ని తరాల నాటి వన్నీ గుర్తుచేసుకున్న నవల. అవి ప్రస్తుత చరిత్రలో కనపడకపోయినా అంటరానివాళ్ళకు ఆ జ్ఞాపకాలు ఆనందాన్ని మిగిల్చే వసంతం లాంటివి.

అందువల్ల అది "అంటరానివసంతం' అయ్యిందేమో! చాలా బాగుందీ లాజిక్!

అంటరానితనం అనగానే భౌతిక, మానసిక, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక కష్టనష్టాలకు, అవమానాలకు గురైన మాదిగ, పాకీవాళ్ళ వంటి వాళ్ళు కూడా ఈ మాత్రమే అవమానానికి గురయ్యారనుకొనే ప్రమాదం ఉంది. వాస్తవానికి మాదిగలు అనుభవిస్తున్న మానసిక వేదన ప్రపంచంలో మరే జాతీ అనుభవించనంత తీవ్రమైందని చెప్పినా ఆశ్చర్యపోనవసరం లేదు. అలాంటి మాదిగల వేదనలకు ఏమాత్రం ప్రాధాన్యం లేకుండా, మాలల అంటరానితనాన్నే రచయిత "*అంటరాని వసంతం* 'గా వ్యాఖ్యానించడం విచారకరం. నవలలోని అనేకాంశాలకు నోట్స్ రూపంలో వివరణలిచ్చిన రచయిత, ఎక్కడా ఇది తన జీవితమనో, తమ కుటుంబం చుట్టూ కథ నడిచిందనో లేకపోతే అంటరానివాళ్ళుగా పరిగణన పొందుతున్న మాలల్ని కేంద్రంగా చేసుకుని రచన కొనసాగించానని గానీ చెప్పలేదు. అలాంటప్పుడు కేవలం దీన్నే చదివి అంటరానివాళ్ళనూ, లేదా దళితులను అర్థం చేసుకొనేవాళ్ళకు చారిత్రక సత్యాల్ని మరోకోణంలో అర్థం చేసే ప్రయత్నమనిపించదా?

కృత్రిమమైన మార్పులు చేసి కళా వారసత్వాన్ని దక్కనివ్వకుండా చేశారని ఎవరెవరిపైనో నిందలు వేసైనా పేరిణీ నృత్యం మాలలదేనని నిరూపించడానికి నవలా రచయిత కనపరిచిన శ్రద్ధ మాదిగల సాంస్కృతిక అంశాలపై ఒక్కదాని మీదా చూపలేదు. పోనీ, పురాణ కాలం నుండీ మాదిగల ఆడపడుచుగా ఉన్న అరుంధతీదేవికి సంబంధించిన సంబంధాన్నైనా ప్రస్తావించలేదు. కానీ, మాల కులస్థుడైన చెన్నయ్య పురాణ వారసత్వం గురించి చెప్పాలనుకున్నారు. అందువల్ల అక్కడ జాంబవంతుణ్ణీ ప్రస్తావించక తప్పలేదు.

ఇలాంటి అంశాలెన్నో గుర్తించడం వల్లనేనేమో దీన్ని ఎస్. నారాయణ స్వామితెలుగు నాట మాల కులస్థుల జీవితంలో ఏడెనిమిది తరాల కథ వర్తమానంలో మొదలై గతాన్ని వెనక్కి తిరిగిచూసుకుంటూ, భవిష్యత్తులోకి తొంగిచూస్తూ మూడు కాలాల్లో నడిచిన మాల పురాణం ఇది '' అని

(ఈమాటఆన్ లైన్ మ్యాగ్ జైన్) వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యలో బ్రాహ్మణ వాసన కనిపిస్తుందన్నవాళ్ళూ ఉన్నారు. కానీ, ఈ వ్యాఖ్యలో చారిత్రక సత్యం ఉందంటున్నాను.

అసలు అంటరానితనానికి ప్రాతిపదికేమిటి?

అది మాలల్లో ఉందా? మాదిగల్లో ఉందా?

వీరందరికంటే మరింత దిగువనున్న పాకీవాళ్ళలో ఉందా?

ఈ విషయాలేమైనా ఈ నవల్లో నిజంగ్గానే రికార్డ్ అయ్యాయా? ఇలాంటివన్నీ విశ్లేషించుకోకుండా దీన్నే యావత్తు అంటరానివాళ్ళ తరతరాల జీవితాల్ని సాహిత్యీకరించిన నవలగా కీర్తిస్తే, నిజమైన అంటరానివాళ్ళకు అన్యాయం చేసినట్లు కాదా?

దానితో పాటు అంటరానితనానికి ఉన్న, దానికి గురవుతున్న అనేక విషాదకర పార్శ్వాల్ని తెలుసుకోకుండా ముంద అడ్డుకున్నట్లవ్వదా?

అది "అంటరాని' అని ఒక కుల తెగనే అన్ని అంటరాని కులాలకు అంటగట్టడం వల్ల జరిగే హాని కాదా? ఈ నవల్ని అంటరానివాళ్ళ అందరి జీవితాలకు ప్రాతినిథ్యం వహించే నవలగా సాధారణీకరించే లేదా సిద్ధాంతీకరించేవాళ్ళు ఆలోచించవలసిన ముఖ్యమైన అంశమిది.

ఈ ప్రశ్నల్నీ, నా అభిప్రాయాల్నీ ఈ నవలా రచయిత 19-2-2010 వతేదీన హైదరాబాదు సెంట్రల్ యూనివర్సిటీకి వచ్చినప్పుడు ఆయనతోనూ చర్చించాను. ఆయనేదో వివరణ ఇచ్చారు. ఈ చర్చ జరుగుతున్నప్పుడు అక్కడ ఆచార్య అల్లాడి ఉమ, ఆచార్య ఎం. శ్రీధర్ (వీరిరువురూ "అంటరాని వసంతం' నవలను ఆంగ్లంలోకి అనువదించిన వారు. త్వరలో అది పుస్తకరూపంలో రాబోతోంది.) రచయిత చెప్పిన వివరణను ఇక్కడ నామాటల్లో చెప్పడం నాకిష్టం లేదు. ఆయనే దాన్ని ఎక్కడైనా రాస్తే మంచిది. అలా కాకుండా ఒక రచన రాసిన తర్వాత రచయిత పని పూర్తైపోతుంది. దాని గురించి మళ్ళీ మాట్లాడడమంటే మరో కొత్త రచన గురించి మాట్లాడడమో, ఆ రచయితగా కాకుండా ఒక బయటవ్యక్తిగా మాట్లాడడమో అవుతుందని

భావించే డెత్ ఆఫ్ ది ఆథర్ భావనతో నవలా రచయిత ఉంటే మనమేమీ చేయలేం. అది మనకి లభించిన స్వేఛగా భావించే అవకాశంగానే గుర్తించవచ్చు. నిజానికి ఈ భావన ప్రకారం రచయిత కూడా తన రచనపై తాను మాట్లాడవచ్చు.

అందుకే ఈ నవల్ని చదివిన తర్వాత, దానిపై వస్తున్న విమర్శల్ని చూస్తున్న తర్వాత నేను చెప్పేది ఒక్కటే, దయచేసి మళ్ళీ మళ్ళీ మాదిగల్ని సాహిత్యంలోనూ మోసం చేయడానికి ప్రయత్నించవద్దు. ఇప్పటికే తెలుగు సాహిత్యంలో మాదిగల గురించి దళితేతరులు తెలిసో తెలియకో రాసినా, దాన్ని చాలా మంది విమర్శకులు మాలల జీవితంగా వ్యాఖ్యానిస్తున్నారు. ఇలాంటి "మాల వసంతం' అంటరాని వసంతం" గా ప్రచురించుకున్నా, భవిష్యత్తులోనైనా స్పష్టంగా మాదిగ వసంతం" రాయాలనుకునే వాళ్ళ ద్వారాల్ని ముందుగానే మూసేయొద్దు.

రిఫరెన్సెస్: :

1.తెలుగు నాట మాల కులస్థుల జీవితంలో ఏడెనిమిది తరాల కథ వర్తమానంలో మొదలై గతాన్ని వెనక్కి తిరిగిచూసుకుంటూ, భవిష్యత్తులోకి తొంగిచూస్తూ మూడు కాలాల్లో నడిచిన మాల పురాణం ఇది " అని ఎస్. నారాయణస్వామి (http://www.eemaata.com/em/issues/200107/675.html) ఈమాట ఆన్‌లైన్ మ్యాగ్ జైన్ లో అన్నారు.

2.అంటరానివసంతం నవల గురించి డా. పి.కేశవకుమార్ వ్యాఖ్యానిస్తూ ఇలా అన్నారు.

The novel Antarani Vasantam is an attempt towards writing history, philosophy, politics and culture of dalits in comprehensive form. The writer has succeeded in bringing all these aspects of life by depicting the concrete lives of dalits.

‘’Antaraani Vasantam is a story of seven generations of dalits. This novel is of dalit history, culture and their living worldview. More than that, it is a struggle of dalits at different points of time.

‘’Antaraani Vasantam has celebrated rich and vibrant cultural traditions of dalit community by going to origins .’’

(EMERGENCE OF DALIT NOVEL:ChangingNotionof Freedom

***

# అతడు అడవిని జయించాడు'లో మానవ జీవతాన్వేషణ తత్త్వం

ఆదిమ సమాజం నుండీ నేటి ఆధునిక సమాజం వరకూ మానవుడు ప్రకృతితో విడదీయరాని అనుబంధాన్ని పెనవేసుకున్నాడు. తన జననం, మరణం, ఆ తర్వాత జీవితం ఉంటుందా? లేదా? మొదలైన వాటిని అన్నింటినీ నేటి వరకూ మానవుడు ఆధ్యాత్మిక, గతి తార్కిక భౌతిక వాద మార్గాల్లో అన్వేషిస్తూనే ఉన్నాడు. ఈ అన్వేషణలో అనేక సంఘర్షణలకు గురవుతూనే ఉన్నాడు. ఇలాంటి సంఘర్షణను కేవలం మనుష్యుల నుండే కాకుండా పశు పక్ష్యాదులు, ప్రకృతి బీభత్సాల నుండీ ఎదుర్కొంటున్నాడు. డా॥కేశవరెడ్డి అతడు అడవిని జయించాడు (1984)నవలికలో ఒక గిరిజనుణ్ణి కేంద్రంగా చేసి మానవుడు తన అస్తిత్వం కోసం చేసిన పోరాటాన్నీ, అతను సాగించే జీవితాన్వేషణ లక్ష్యాన్నీ అందించే ప్రయత్నం చేశాడు.

ఆంగ్లంలో హెమింగ్వే (1899 – 1961) రాసినది ఓల్డ్ మ్యాన్ అండ్ ది సీ" (1952) నవలికలో కథా నాయకుడు చేపలు పట్టే వృత్తికి చెందిన ఒక ముసలివాడు. సముద్రం, చేప, ఒక బాలుడు నవలా కథనంలో కనిపిస్తారు. ఆ నవలలో ఒక ముసలి వాడు సముద్రంలో పెద్ద చేపను పట్టుకుని దాన్ని ఒడ్డుకు తీసుకురావడానికి చేసిన ప్రయత్నమే కథా వస్తువు. అతడు అడవిని జయించాడు లో ఒక ముసలివాడు తన మనవడు మేపడానికి తోలికెళ్ళిన పందులన్నీ తిరిగి వచ్చినా, అందులో నెలలు నిండిన ఒక సుక్క పంది తిరిగిరాలేదని గమనిస్తాడు. ఈనబోయే పంది అడవిలోకి వెళ్ళి ఏటో మాయమైపోతుంది. ఆ పందిని, దాని పిల్లల్నీ గుంట నక్కలు, రాబందుల నుండి రక్షించడానికి చేసిన ప్రయత్నం కథా వస్తువు. తన మనవడు అడవిలో

పందుల్ని మేపి, గుడిసెకు వాటిని తోలుకొస్తాడు. అందులో సుక్కపంది కనిపించదు. అది రెండు మూడు రోజుల్లో ఈనబోయే సమయం. ఆ సమయంలో దాన్ని కనిపెట్టుకుని ఉండకపోతే అది ఎక్కడికైనా వెళ్ళిపోతుందని అతనికి తెలుసు. అందుకనే ఆ సుక్క పందికోసం ఆందోళన పడ్డాడు. మనవణ్ణి గుడిసె దగ్గర ఉండమని ఆ పందిని వెతకడానికి బయలు దేరతాడు. సాయంత్రం తన నడకను ప్రారంభించి, రాత్రంతా దాన్ని వెతికి, అది ఉన్న పొదల్ని గుర్తించి, అడవిలోని క్రూర జంతువులు, రాబంధుల నుండి కాపాడే ప్రయత్నం చేస్తాడు.

రాత్రంతా వాటిని కాపాడ్డానికే తన శక్తి యుక్తులన్నీ ధారపోస్తాడు. తాను పెంచిన పందే పిల్లల్ని కన్న తర్వాత, తనని కూడా దగ్గరకు రానివ్వదు. అయినా ఆ ముసలాడికి దాని మీద కోపం రాలేదు. ఆ పిల్లని, ఆ పందిని చూసి మురిసిపోయాడు. పంది జాడ తెలుసు కోవడానికి కారణమైన తొటిగువ్వకి మొదట్లో తానేదైనా సహాయం చేయాలనుకుంటాడు. తార్కికంగా ఆలోచించుకుని వాటి మానాన వాటిని వదిలేస్తే అదే మనం చేసే అత్యంత సహాయం అనే నిర?యానికొస్తాడు. ఆ తర్వాత ఆ ముసలివాడు పంది దగ్గరకు చేరుకుంటాడు. ఆ తర్వాత కూడా తోటిగువ్వ ఇంకా అరుస్తుంటే, ఆ అరుపు వల్ల ఆ పంది ఆచూకీ నక్కలకి తెలిసిపోతుందని భయపడి దాన్ని చంపేస్తాడు.

తోటిగువ్వ అరవడం ఆగిపోయినా, సుక్కపంది వాసన పసిగట్టి నక్కవస్తుంది. దాన్ని పందే చంపేస్తుంది. తన దగ్గర ఈటె ఉంది. పందికి రక్షణగా ఉన్నా, సుంకేసుల చెట్టు మీదే ఉండాల్సిన పరిస్థితి. కిందికి దిగితే పంది తననీ చంపేస్తుంది. అందువల్ల ఆ చెట్టు మీదే కనిపెట్టుకుని ఉంటాడు. ఈ సారి ఏభై నక్కలు వస్తాయి. వాటిని చూసి ఆందోళన చెందుతాడు. వాటిని ఎదుర్కోవాలంటే, తాను చెట్టు దిగి పంది దగ్గరకు వెళ్ళాలి. చెట్టు దిగితేనే పంది తనని చంపేసేలా ఉంది. అందువల్ల తల్లి పందిని ఒక్కదాన్ని చంపినా, ఇంకా పది పిల్ల పందుల్ని కాపాడిన వాణ్ణవుతాననుకుంటాడు. తన చేతుల్తో

పెంచిన పందిని చంపాల్సి వస్తున్నందుకు బాధపడినా, ఆ పందిని చంపకతప్పలేదు.ఆ తర్వాత నక్కల నుండి పిల్లల్ని కాపాడి, గంప తయారుచేసుకుని, వాటిలో పెట్టుకుని తెల్లవారే లోగా త్వరగా తన గుడిసె దగ్గరకు చేరుకోవాలనుకుంటాడు. మళ్ళీ రాబంధులు వెంటాడతాయి. ముక్కులతో పొడుస్తాయి. ఆ పిల్లలు చనిపోతాయి.

తన పందినీ, ఆ పంది పిల్లల్నీ రక్షించుకోవాల్ని తీవ్రంగా ప్రయత్నించి విఫలం చెందుతాడు. తెల్లవారుతుందనగా, తన గుడిసెకు చేరుకుంటాడు. మనవడు తనకోసం చూసి చూసి నిద్రపోయాడని తెలుసుకుంటాడు. ఆ పిల్లవాడిని లేపకుండా గుడిసెలోకెళ్ళి నేలపై ఒరిగిపోతాడు. బండి చప్పుడికి ఆ పిల్లాడు లేచి, ఏడుస్తూ తన తాత కాళ్ళదగ్గర కూర్చుంటాడు.

*"అతడు అడవిని జయించాడు'*నవలికలో కథా నాయకుడు ఒక ముసలివాడు. అడవి, పంది, బాలుడు, నక్కలు, రాబంధులు ఈ నవలా కథనంలో కనిపించే పాత్రలు. పైన పేర్కొన్న ఆంగ్ల నవలికను అంతకు ముందే చదివిన వాళ్ళకు ఇది అనుసరణేమో అనే అభిప్రాయం కలుగుతుంది.డా.కేశవరెడ్డి తన నవలిక రాయడానికి ఆ ఆంగ్లనవలా శిల్పాన్ని తీసుకున్నానని" చెప్పుకున్నాడు. (ముందుమాట. 1985 : iv ) అంటే, వస్తువు అందులోది కాదని చెప్పినట్లయ్యింది. రెండు నవలికల్లోనూ మానవ సంఘర్షణ, జీవితాన్వేషణ, ప్రకృతితో మమేకమవుతూనే అవసరమైనంత వరకూ దానితోనూ సంఘర్షణ పడుతుంటాడు. అయితే, వీటిని స ృజనీకరించడంలో, కథనునడపడంలో రెండింటిలోనూ చాలా వ్యత్యాసాలు ఉన్నాయి. అతడు అడవిని జయించాడులో సన్నివేశాల్ని చిత్రించడంలో, కథానాయకుణ్ణి ఎన్నుకోవడంలో రచయిత ప్రతిభ ప్రస్ఫుటమవుతుంది. " తడు అడవిని జయించాడు'లోకథా నాయకుడు గిరిజనుల లోని ఎరుకల తెగకు చెందినవాడు. అతని వ ృత్తి, ప్రవ ృత్తి పందుల్ని మేపుకోవడమే. ఆ పందులతో అతనికి విడదీయరాని అనుబంధం ఉంది. భారతీయ కావ్యశాస్త్రంలో కింది వర్గం లేదా కులానికి చెందిన వ్యక్తిని కావ్య నాయకుడిగా చేసి లక్షణాలను

వివరించినట్లు కనపడదు. నవలిక భారతీయ కావ్య శాస్త్ర లక్షణ పరిధుల్ని దాటి ఆధునిక సాహిత్య లక్షణాల్ని సంతరించుకున్న ప్రక్రియ. అయినప్పటికీ కథానాయకుడిగా భారతీయ సమాజంలో అత్యంత దిగువ స్థాయిలో ఉన్న వ్యక్తిని ఎన్నుకోవడం రచయితలో కనిపించే సామాజిక చైతన్యాన్ని తెలుపుతుంది. ఇది ఈ నవలికలో కనిపించే ఒక ప్రత్యేక అంశం దాన్ని కొన్ని పరిధులకు లోబడి నేటివిటి అంటారు.

ఈ నవలిక గురించి పరిశోధన పత్రాల్ని రాసిన ఎమ్. శ్రీధర్‌గారు ఈ రెండు నవలల మధ్య ఉన్న విశేషాల్ని వివరించారు. హేమింగ్వే రాసిన నవలికలో పురుష ద ృక్పథానికి ప్రాధాన్యత ఉంటే, దీనిలో స్త్రీమనస్తత్వం ఉందన్నారు. అలాగే ప్రక ృతితో మమేకమైన మానవుని సంఘర్షణ, అడివి స్వభావాన్ని గుర్తించడంలో కనిపించే అనేకాంశాల్ని బట్టి ఇకో టచ్‌డ్ నవల గా చెప్పవచ్చని అన్నారు. నవలకను లోతుగా చదివితే ఆ అంశాలు ఉన్నాయని నాకూ అనిపించింది.

పంది తన పిల్లల్ని కాపాడుకోవడంలో మాత్రమే స్త్రీ మనస్తత్వం కనిపిస్తుంది. కానీ, ముసలివాడులో స్త్రీమనస్తత్వం ఉందని శ్రీధర్ గారు అంటున్నారు. తన పిల్లల్ని కాపాడుకునే ప్రయత్నంలో తననెంతగానో ఇష్టపడి, తనని రక్షించాల్ని వచ్చిన యజమానిని కూడా పంది తన దగ్గరకు రానివ్వలేదు. మానవ సంబంధాల్లోనూ ఈ ప్రవృత్తి కనిపిస్తుంది. ఒకప్పటి పిల్లలే కొన్నాళ్ళ తర్వాత తల్లిదండ్రులవుతారు. అప్పుడు వారి ప్రాధాన్యతా క్రమాలు మారిపోతుంటాయి. అలాగని అంతకు ముందున్న సంబంధాలు తెగిపోయినట్లు కాదు. ఇక్కడ పంది యజమానిపై తిరగబడ్డంలో కనిపించే వైరుధ్యం ఇటువంటిదే. దీన్ని సహజమైన మాత ృవాత్సల్యంలో కనిపించే స్త్రీమనస్తత్వంగా చెప్పడం రచయిత డా॥ కేశవరెడ్డి ప్రత్యేకత. హెమింగ్వే చేప ద్వారా చెప్పలేని విషయాన్ని ఇక్కడ ఒక సుక్కపంది ద్వారా సూరేంపచేయగలిగాడు. ఇది తర్వాత డా. కేశవరెడ్డి రాసినమునెమ్మ"(2008) నవలికలో ఒక సాధారణ స్త్రీ అసాధారణ శక్తిని ప్రదర్శించే పరిణామానికి దారితీసేలా

పరిణమించిందనవచ్చేమో. అయితే మునెమ్మ మాతృత్వం రూపంలో కాకుండా శక్తి స్వరూపిణిగా కనిపిస్తుంది. తన భర్తను చంపిన వాళ్ళను పట్టువదల్ని పరిశోధకురాలిలా అన్వేషించి తెలుసుకోగలిగింది. 1872లో నరహరి గోపాల కృష్ణమశెట్టి (1833 – 1885) రాసిన "శ్రీరంగరాజ చరిత్ర (సోనాబాయి పరిణయము)"లో కొంత వరకు గిరిజన జీవితాన్ని చిత్రించినా, అడవికి సంబంధించిన విషయాల్ని వివరించడంలో అతడు అడవిని జయించాడు " నవలికలో ఉన్నంత లోతైన పరిశీలన లేదు. బండల వంటి అతని పాదాలను బలసముండ్లు బాధించడం లేదు. కాసేరాకు దురదకలిగించడం లేదు"(హెచ్.బి.టి. ప్రచురణ, 2009: 22) అనడంలో అడవిలో ఉండే ముళ్ళ పొదల్నీ, రకరకాలైన ఆకుల్నీ వివరిస్తూనే, వాటి స్వభావాన్ని తన అన్వేషణ అధిగమిస్తున్నట్లు వివరించాడు రచయిత.

ఇలాంటివే మరికొన్ని గమనించవచ్చు. తీగలెయ్యటం నేను చూడలా. ఈత పొదలో పడుకుని మూలగతా కొంచేపుండి లేసొచ్చేసింది. పైగా నువ్వే సెప్తా ఉంటివి గదా – పవర్నం నాటికో పవర్నం ముందు నాటికో ఈనేస్తాదని" ( వాచ్.బి.టి ప్రచురణ, 2009 : 11)ఇక నేను జాగ్రత్తగా ఉండాలి. అడవిలో క్రూర మృగాలు వేటకు బయలు దేరే సమయమయింది. పైగా ఇది చిత్రి నెల" ( హెచ్.బి.టి ప్రచురణ, 2009 : 47) నక్కలు, తోడేళ్ళు మొదలైన వాటికి వేసవి ఈత కాలం... మగ నక్కలు ఈ ఎళీళీతువులో రెట్టింపు ఆహారాన్వేషణ సాగిస్తాయి. ఈ అన్వేషణలో అవి ఎంత సాహసానికైనా పూనుకుంటాయి'' (హెచ్.బి.టి ప్రచురణ,2009:47) ఇలాంటివన్నీ రచయితలోతైన పరిశీలనానుభవంతో చెప్పిన అంశాలు.

నవలికలో కేవలం పర్యావరణ విషయాల్ని ప్రస్తావించడమే కాకుండా, వాటితో మానవుడు మమేకమైన స్థితినీ, దాన్ని కథతో విడదీయరానంత పటిష్టమైన నిర్మాణంగానూ రచనలో పొందుపరిచాడు. పంది పాదముద్రల్ని గుర్తించేటప్పుడూ, తోటి గువ్వ అరుపుల్లోనూ, కుందేలు, నక్కల్ని చంపడంలోనూ, పంది స్వభావాన్ని అర్థం చేసుకోవడంలోనూ ఇటువంటి లోతైన పర్యావరణ

జ్ఞానం కనిపిస్తుంది. అందువల్ల దీన్ని ఇకో టచ్డు నవల్ గా చెప్పుకోవడం సమంజసమే అనిపిస్తుంది.

దీన్నిక్కడ నవల అని పేర్కొన్నా, అది ప్రధానంగా సైజుని, తీసుకునే పాత్రల చిత్రణని బట్టి నిర్ణయిస్తుంటారు. కానీ, నవల, నవలికకు తెలుగులో పెద్ద వ్యత్యాసాన్ని చూపిస్తున్న వాళ్ళు చాలా అరుదు. అందువల్ల దీన్ని నవల అని కూడా అనవచ్చు.

వినుకొండ నాగరాజు రాసినఊబిలో దున్న'' (1970) (యం.శేషాచలం అండ్ కో, మచిలీపట్నం, మద్రాసు, సికింద్రాబాదు) నవలలో వివిధ జంతువుల్నీ, పర్యావరణ విషయాల్ని ప్రస్తావించినా, వాటిని వివరించడంలో ఈ నవలికకు పోటీ రాదు. ఒక్క మాటలో చెప్పాలంటే తెలుగు నవలా సాహిత్యంలో ప్రకృతిని ఇంత లోతుగా పరిశీలించిన నవల లేదు. అందువల్ల దీన్ని మొట్టమొదటి ఇకో టచ్డు నవల్ గా అభివరి?ంచుకోవడం మరో విశేషమే అవుతుంది.

వీటితో పాటు ఈ నవలికలో ప్రస్తావించిన చెట్లు" అన్నీ ఒకేరకంగా అర్థం చేసుకునే చెట్లు కాదు. కొన్నింటిని చెట్లని పిలిచినా, అవి చిన్న చిన్న మొక్కలు మాత్రమే. అటువంటి వాటిలో వెంపలి చెట్లు (హెచ్. బి.టి ప్రచురణ, 2009: 12), కిచ్చిలి చెట్లు (హెచ్. బి.టి ప్రచురణ, 2009: 25), సుంక్రేసు చెట్లు (హెచ్. బి.టి ప్రచురణ, 2009: 33) మొదలైన వన్నీ ఒకే రకమైన స్వరూప స్వభావానికి చెందినవి కాదు. రచయిత మొదటి ప్రచురణకు ముందు మాటలో ఒక సందఠరేలో ఇలా వివరిస్తాడుఅతడు ఎక్కి కూర్చున్న చెట్టు సుంక్రేసు చెట్టు. దాని కొమ్మలు చాలా పెళుసుగా ఉంటాయి" (మొదటి ముద్రణ, 1985: V)

నేటివిటీకి సంబంధించిన మరో అంశం అప్పుడప్పుడూ మహాభారతంలో సైరంధ్రీ, భీముడు, కురుక్షేత్ర యుద్ధం (హెచ్. బి.టి ప్రచురణ, 2009 : 26, 54, 74) వంటి వాటి గురించి ముసలివాడి ఆలోచనా ధారగా రచయిత చెప్తుంటాడు. నేటివిటీ అనేది తన భాష, ప్రాంతం, సంస్కృతిలో ఉంటుంది.

అది దీనిలో రెండు రకాలుగా అర్థంచేసుకోవాలి. రచయిత ఇండియన్ నేటివ్. నవలికలో కథానాయకుడు ఎరుకలి తెగకు చెందిన వాడు. ఇతని తెగల సంస్కృతి నేటివిటీని ప్రతిబింబిస్తుంది. ఈ నవలిక వర భాషల్లోకి అనువాదమైనా ఇవన్నీ భారతీయతను, తెలుగు తనాన్నీ నిలిపే ప్రత్యేక నేటివిటీకి సంబంధించిన అంశాలు. అందువల్ల హెమింగ్వే నవల కంటే ఇది భిన్నమైందే అవుతుంది. ముసలివాడు స్నానం చేయకపోవడం, కుందేలు మాంసాన్ని తిన్న తర్వాత వాటి దుమ్ముల్ని పక్కకి పడేయడం, చేతుల్ని తన శరీరానికే తుడిసేసుకోవడం, అన్నింటికీ మించి గుడిసె నిర్మాణం వంటి వన్నీ గిరిజన సంస్కృతి రూపంలో నేటివిటీని పట్టిచ్చే అంశాలే.

ఇక్కడి వరకూ ఇకోటచ్చు నవలికగానూ; నేటివిటీని వదల్ని రచనగాను; స్త్రీ మనస్తత్వ ప్రతిబింబంగానూ తీర్చిదిద్దిన అంశాలను గుర్తించగలిగాం. దీనితో పాటు మరో అంశాన్ని కూడా గుర్తించవచ్చు. కథాగమనంలో తన మనవడు అడవిలో పందుల్ని మేపి, గుడిసెకు వాటిని తోలుకొస్తాడు. అందులో సుక్కపంది కనిపించదు. అది రెండు మూడు రోజుల్లో ఈనబోయే సమయం. ఆ సమయంలో దాన్ని కనిపెట్టుకుని ఉండకపోతే అది ఎక్కడికైనా వెళ్ళిపోతుందని ముసలివాడికి తెలుసు. అందుకనే అతడు ఆ సుక్క పందికోసం ఆందోళన పడ్డాడు. మనవణ్ణి గుడిసె దగ్గర ఉండమని ఆ పందిని వెతకడానికి బయలు దేరతాడు.

సాయంత్రం తన నడకను ప్రారంభించి, రాత్రంతా దాన్ని వెతికి, అది ఉన్న పొదల్ని గుర్తించి, అడవిలోని క్రూర జంతువులు, రాబంధుల నుండి పందినీ, దాని పిల్లల్నీ కాపాడే ప్రయత్నం చేస్తాడు. నక్కల నుండీ, రాబంధుల నుండీ ఆ పందినీ, దాని పిల్లల్నీ కాపాడాల్ని విశ్వప్రయత్నం చేసి విఫలం చెందుతాడు. తాను ఓడిపోయానని అనుకుంటూనే, తాను సాధించవలసింది ఇంకా ఉందనుకుంటూ, తెల్లవారగట్లకి తన గుడిసెకు చేరుకుంటాడు. మనవడు తనకోసం చూసి చూసి నిద్రపోయాడని అనుకుంటాడు. ఆ పిల్లవాడిని లేపకుండా గుడిసెలోకెళ్ళి నేలపై ఒరిగిపోతాడు.

బండి చప్పుడికి ఆ పిల్లాడు లేచి, ఏడుస్తూ తన తాత కాళ్ళదగ్గర కూర్చుంటాడు. కథని ఇలా ముగిస్తే, దీనిలో అతడు ఆడవిని ఎలా జయించినట్లవుతుంది?ఇందులో తాను ఓడిపోయానని ముసలివాడు స్పష్టంగా చెప్తుంటే, దాన్ని అతని విజయంగా భావించేదెలా అనేది పాఠకులకు వచ్చే సందేహం. ఇది సీరియల్ గానూ, పుస్తకరూపంలోనూ వస్తున్నప్పుడే పాఠకుల నుండి విశేషమైన స్పందన వచ్చింది.

వీరపల్లె వీణావాణి అనే పాఠకుని అభిప్రాయం ప్రకారం "*తన చుట్టూ ఆవరించిన శక్తులతో మానవుడు నిర్విరామంగా సాగించే పోరాటంలో గెలుపు, ఓటములనేవి నిజంగా పోరాట మార్గాన్ని బట్టి నిర్ణయింపబడతాయి తప్ప పోరాట ఫలితాన్ని బట్టి నిర్ణయింపబడవు. సంకల్ప బలంతో, చిత్తశుద్ధితో పరిపూర్ణమైన పట్టుదలతో ధర్మబద్ధంగా సాగించిన పోరాటంలో మనిషి ఓడిపోయినా విజేత క్రిందే పరిగణింపబడతాడు. ముసలివాడు చిత్తశుద్ధితో, సంకల్పబలంతో* పట్టుదలగా పోరాటం *సాగించారు. అందుకే అతడు అడవితో ఓడిపోలేదు. అతడు అడవిని జయించాడు*" (మొదటి ముద్రణ, 1985 : 79) మానవ జీవన బంధం కొనసాగాలంటే ఈ చక్రం కొనసాగాలి.

ఈ కథను జాగ్రత్తగా పరిశీలిస్తే నవలిక నిండా అస్తిత్వ పోరాటం కనిపిస్తుంది. తన ఆకలి తీర్చుకోవడం కోసం ముసలివాడు అడవిలో మొదట ఒక కుందేలుని చంపి, దాన్ని ఆహారంగా మార్చుకున్నాడు. ఇది తన మనుగడ కోసం పోరాడే క్రమంలో భాగమే.

నక్కలు తన ఆహారం కోసం పంది దగ్గర కొచ్చి ప్రాణాలు కోల్పోయాయి.. రాబంధులు కూడా తాము బతకడం కోసమే పంది పిల్లల్ని ముక్కులతో పొడిచేశాయి. ఆ పంది పిల్లలు చనిపోతే, అవి తమకి ఆహారమవుతాయి. ముసలివాడు తన మనవడి దగ్గర పంగ?లి కర్ర, జోలె, దానిలో కొన్ని పక్షుల్ని గమనించినట్లు రచయిత నవలిక ప్రారంభంలోనే వర్ణించారు. ఆహారాన్వేషణతోనే మానవ మనుగడ మొదలైంది. తాను బతకాలంటే, తానెదొకటి తినకతప్పదు. అప్పటికప్పుడు ముసలివాడు తన

ఆహారాన్ని సమకూర్చుకోవడానికి ఆదిమ సమాజంలోని మానవుడిలా మారిపోతాడు. కుందేలుని తన తెలివితేటలతో బంధించి, తన దగ్గరున్న ఈటెతో చంపుతాడు. అగ్గిని అప్పటికప్పుడు పుట్టించి దానిలో కాల్చుకుంటాడు.

దీని ద్వారా రచయిత మానవుని భౌతిక జీవన పరిణామ దశను గుర్తు చేస్తున్నాడనిపిస్తుంది. దీన్నే ఆధ్యాత్మిక దృష్టితో రచన కొనసాగించి ఉంటే మరోలా ఉండేది. తప్పస్సు చేసేవాడు. భగవంతుడే అమాంతంగా ఒక బాటసారి రూపంలో ప్రత్యక్షమయ్యేవాడు. ఆహారాన్నిచ్చేసి మాయమైపోయేవాడు. ఇక్కడ అలా జరగలేదు. మానవ జీవన పరిణామాన్ని వాస్తవిక దృక్పథంలో చిత్రించాడు రచయిత. దీనితో పాటు మరో ముఖ్యాంశాన్ని అనుభవంలోకి తెచ్చే ప్రయత్నం చేస్తున్నాడు రచయిత.

జీవనపరిణామ దశలో మనిషి గానీ పశుపక్ష్యాదులు గానీ కేవలం తినడానికే బతుకుతున్నారనుకోలేం. అంతర్లీనంగా తావేదో సాధించాలనుకోవడం సహజం. ఆ సాధించాల్సిందేమిటో తెలిసిపోతే ఇక అన్వేషణే ఆగిపోతుంది. అదే ఈ నవలిక నిండా పరుచుకుని ఉంది. ఈ అంశమే నవలికను సార్వజనీనం చేస్తుంది. అలాగని దేశీయత లేదని కాదు. ఊహల్లోని వ్యక్తిని తీసుకొచ్చి కథను నడిపించలేదు.

కథను భారతీయ సమాజం నుండి నడిపిస్తూ విశ్వజనీనం చేశాడు. కుల, వర్గాలతో నిండిన భారతీయ సమాజంలోనే గిరిజనులు లేరు. ప్రపంచ వ్యాప్తంగా గిరిజనులు ఉన్నారు. కానీ, రచయిత భారతదేశంలోని అనేక గిరిజన తెగల్లో గల ఎరుకల తెగకు చెందిన వ్యక్తిని కథానాయకుడుగా ఎన్నుకున్నాడు. కథలో సుగాలీలు, చెంచు తెగల్ని కూడా ప్రస్తావించడం కనిపిస్తుంది. పందుల్ని పెంచడం వృత్తిగా గల వాళ్ళు ఎరుకల వాళ్ళే. వీరితో పాటు మరికొంత మంది వాటిని పెంచినా, అది వారి వంశ పారంపర్య సంక్రమిత వృత్తి కాదు. ఇలా ఎరుకలను ఎన్నుకోవడంలో రచయిత తన రచనలో నేటివిటీని సాధించగలిగాడు.

ఈ నేటివిటీ ముసలివాడి పాత్రగతంగా కొటేషన్ల రూపంలో చెప్పిన

కొన్ని అభిప్రాయాల్లో కనిపించదు. అటువంటప్పుడు అక్కడ కనిపించేది రచయిత ప్రతిపాదించే అన్వేషణ తత్త్వమే అయివుంటుంది. పందుల్ని మేపుకొచ్చిన మనవడు గోపాల్‌తో ముసలివాడు ఇలా అంటాడు. ఇంటికి యాడొచ్చింది. ఇంతసేపు ఇంటి కాడనే ఉండినా. చూసి చూసి సాలైపోయి యలబారి ఇట్టోచ్చినా '' (హెచ్. బి.టి ప్రచురణ, 2009: 11)

ముసలివాడి ఈ మాటల్లో సహజత్వం కనిపిస్తుంది. ముసలివాడు తనలో తానుగా అనుకున్నట్లు రచయిత రాసిన కింది కొటేషన్స్ లో చెప్పిన అభిప్రాయాల్లో జీవిత సారాన్ని పిండినట్లుంది.'*'అడవి నిగూఢమైనది. ఏ అనుభవానికీ, ఏ మేధస్సుకీ అంతు చిక్కని రహస్యాలు ఇక్కడ చాలా ఉన్నాయి* ' (హెచ్. బి.టి ప్రచురణ, 2009: 16)

"*నాగరికుడైన ఒక మానవుని సుఖ దు:ఖాలు ఒక మొరటు జంతువుపై ఆధారపడి ఉండడం ఎంత విచిత్రం! జీవితం నానా విధాలైన వైరుధ్యాలతో నిండి ఉంది'*(హెచ్. బి.టి ప్రచురణ, 2009: 61)

*"ఏ మానవుడూ పరిపూర్ణంగా అదృష్టవంతుడు కాదు. ఏ మానవుడూ తను వేలు పెట్టిన చోటల్లా విజయుడై రాలేదు. జయాపజయాల సమన్వయ భావమే జీవితం. కన్నీళ్ళు దు:ఖ భారాన్ని తగ్గించినట్టుగా ఈ సమన్వయ భావం ఓటమిలో ఊరటనిస్తుంది* '' (హెచ్. బి.టి ప్రచురణ, 2009: 78, 79) ఈ పై కొటేషన్స్‌లో భాష, భావం ఒక గిరిజన వ్యక్తి మాట్లాడుతున్నట్లు లేవు. ఒక ఫిలాసఫర్ మాట్లాడుతున్నట్లున్నాయి. నవలికలో రచయిత ప్రయోగించిన కొటేషన్ల గురించి సంజీవ్ దేవ్ ఇలా అభిప్రాయ పడ్డారు.

*"కొటేషన్ మార్కుల మధ్య ఉన్న మాటలు రచయితవి అయి వుండవు, ముసలివాడివి అయి వుండాలి... అక్షరజ్ఞానం లేని ఆటవిక స్వభావి అయిన ముసలివాడికి అటువంటి మాటలు తెలుసా అని!"*

ముసలివాడు మానవుని నిరంతరాన్వేషణకు ప్రతీక. అనుభవం రంగరించిన మానవుడి సామూహిక ఆలోచనకు అక్షరరూపంగా అనేక సార్లు రచయిత ఆ కొటేషన్స్ రూపంలో అక్కడక్కడా అందించాడ?్న. కనుక, కథలో

చిత్రించిన అడవి" ని కేవలం వాచ్యార్థంలోనే అర్థం చేసుకుంటే సరిపోదు. రచయిత ఒక నిగూఢమైన అర్థాన్ని ఆశించి ఉంటాడు. మానవ పరిణామాన్ని అంతటినీ దీనిలో సూచించాలనుకున్నాడు. అందుకనే ప్రపంచాన్ని అంతటినీ అడవి" గానుబీ ముసలివాడు మానవుని అన్వేషణ జీవిగానుబీ పంది, దాని పిల్లల్ని మానవుడి సాధించాలనుకున్న లక్ష్యాలుగానుబీ అవి అందకుండా అడ్డుకున్న నక్కలు, రాబందులు ప్రకృతితో ఎదురయ్యే ఆటంకాలుగానుబీ అయినా తన ఆశయాన్ని విడవని బంధంగా మనవడినీ సమన్వయించుకోవచ్చు.

ఈ నవలికకు ముందుమాట (హెచ్. బి.టి ప్రచురణ, 2008: %జఱఱ%) గా ప్రచురించిన వ్యాసంలో శ్రీనివాస ప్రసాద్ ఇలా వ్యాఖ్యానించారు. *"వృద్ధాప్యం – బాల్యంబీ జంతువు–మనిషిబీ ప్రకృతి– సంస్కృతిబీ నాగరికం–ఆటవికంబీ మృత్యువు– జననంబీ సౌందర్యం – నైచ్యంబీ వాత్సల్యం – క్రౌర్యంబీ అస్పష్టత – ఉత్సాహంబీ జడత్వం – చైతన్యంబీ మౌనం – శబ్దంబీ విజయం – అపజయం.... మొదలైన జంట వైరుధ్యాలు, ద్వైదీభావాలు, మనిషి జీవితం తాలుకు సంక్లిష్ట మార్మికతను ఆవిష్కరిస్తాయి"*

ఈ పరిణామాన్ని, సంఘర్షణనూ భావవాదంతో కాకుండా, గతితార్కిక భౌతిక వాదంతో అందించే ప్రయత్నంగా నవలికను రాశాడు. అందువల్లనేచలనము, పరిణామము జీవగర్రలుగా మనిన సృష్టి, చివరకు శూన్యంలో లీనమైనట్లు అత్యంత ప్రచండమైన అనుభవ పరంపరలతో నడిచిన జీవితం గూడా చివరకు జడత్వానికి లోనుగాక తప్పదేమో" (హెచ్. బి.టి ప్రచురణ, 2009 : vii ) అని ముసలివాడిలోని ప్రత్యణువు తడిమిందని రచయితే చెప్తాడు.

దీన్ని బట్టి కూడా ఈ నవలికలో మానవ జీవితాన్వేషణను అందించే ప్రయత్నం చేసినట్లు భావించవచ్చు. మానవుడు తన లక్ష్యాన్ని చేరుకోవడానికి నిత్యం చైతన్యవంతుడై ఉండాలి. కష్టనష్టాలకు కుమిలిపోకుండా గతంలో తాను సాధించిన విజయాలను తలచుకుంటూ ముందుకు పోవాలి. ముసలివాడిలో అదే ప్రతీ సన్నివేశంలోనూ చిత్రించాడు. తాను యువకుడిగా

ఉన్నప్పుడు, మంచి బలమైన శరీర పటుత్వంలో ఉన్నప్పుడు సాధించిన విజయాలను నిరంతరం తలచుకుంటుండేవాడు. తాను కొన్నాళ్ళ పాటు ఒంటరిగా అడవిలో జంతువులతో సహజీవనం చేస్తూ పశువుల్ని మేపిన విజయగాథల్ని గుర్తుచేసుకునేవాడు. వాటితో పోలిస్తే ఒక అర్ధ రాత్రి పందిని వెతకడం, దాన్ని వెతికే క్రమంలో క్రూర జంతువులు ఎదురైనా పోరాడ్డానికి శక్తిని కూడబెట్టుకోగలగడం గొప్ప విషయమే కాదనుకున్నాడు. కానీ, చివరికి యుద్ధంలో తాను ఓడిపోయానని భావించాడు. అది నిజంగా ఓడిపోవడం కాదు.

ఆదిమ సమాజం నుండీ మానవుడు సాధించిన పురోభి వృద్ధిలో ఎన్ని ఆటుపోట్లకు గురికాలేదు. శాస్త్ర సాంకేతిక రంగాల్లో ఒకటి రెండు అపజయాలు ఎదురైనా, వాటితో కుంగిపోకుండా గతకాలంలో మానవుడు సాధించిన విజయాలను తలచుకుంటూనే, భవిష్యత్తులోకి దూసుకుపోవాలి. దాన్ని సాధించడంలో అనేక అపజయాలు ఎదురుకావచ్చు. అయినంత మాత్రం చేత మొత్తం మనిషి పరాజయం పొందినట్లు కాదు. తాను సాధించలేనిది. తన తర్వాత తరం సాధిస్తుందనే నమ్మకం ఉండాలి. ఆ నమ్మకమే ముసలివాడిలో తాను ఓడిపోయాననుకుని కూడా, ఇంకా తాను సాధించాల్సింది ఉందని గుడిసెకు బయలుదేరడంలో కనిపించింది.

నవలికలో ప్రారంభంలో పంగలి కర్ర, భుజం మీద వేలాడుతున్న జోలెలో పిట్టలను వీటికి సూచనగా సన్నివేశాన్ని చిత్రించాడనిపిస్తుంది. పందిపై దాడి చేయడానికి వస్తున్న నక్కల గుంపుని చూసినప్పుడు తన పంగల కర్రను, కొన్ని గులకరాళ్ళనీ తెచ్చుకోవాల్సిందనుకున్నాడు.వెంటనే మనవడు జ్ఞాపకం వచ్చాడు. " "వాడు పంగల కర్రను ప్రయోగించడంలో అఖండుడు. వానికి గురినేర్పింది నేనే అనుకున్నాడు గర్వంగా. ఇంకాస్త కండ పట్టాక వానికి ఈటె నేర్పాలి.."అనుకున్నాడతడు.( హెచ్. బి.టి ప్రచురణ, 2009 : 68)

మానవుడు తాను నేర్చుకున్న విద్యను, తాను సంపాదించిన ఆస్తినీ తన తర్వాత తరం వాళ్ళకివ్వాలనుకుంటారు. వాటితో వాళ్ళు మరింతపురోగతిని

సాధించగలుగుతారు. మానవ సమాజం అనుభవిస్తున్న అభివ ృద్ధి అంతా ఒక్కసారిగా జరిగింది కాదు. అనేక ఆటుపోట్లకు, అనేక కష్టనష్టాలకు గురైన తర్వాతనే సాధించ గలిగాం. తమ వైఫల్యాల్ని సరిచేసుకుంటూ, తాము సాధించిన విజయాల సూర్తితో ముందుకి వెళ్ళగలగాలి. ఇది ఆశావాదమే. ముసలి వాడు నక్కల్ని కొట్టడానికి పంగలి కర్ర, రాళ్ళు మర్చిపోవడం వైఫల్యం. దాన్ని తన మనవడికి తన అనుభవంగా తెలియజేసి, లక్ష్యసాధనకు ప్రేరేపిస్తాడనే సూచన ఉంది. తాను సాధించాల్సింది ఇంకా ఉందనడంలో గల అంతరార్థం అదే! అది కేవలం ముసలివాడు తన మనవడికి చెప్పేదే కాదు. మానవ సమాజానికి అంతటికీ చెప్పేది. ముసలివాడి ఆస్తి తన కున్న విద్య. తనకు తెలిసిన వేట రహస్యాలు. అవి తన మనవడికి ఇవ్వాలనుకున్నాడు. అందుకే తాను ఓడిపోయాననుకున్నా, గుడిసెకు వేగంగా చేరుకోవాలనుకున్నాడు. మానవ సమాజ పరిణామంలో ఇదే జరుగుతుంది. దీన్ని చెప్పడానికే అడవిని ఒక ప్రతీకగా తీసుకొని అతడు అడవిని జయించాడు నవలికను రాశాడు. అందుకే ఇది మానవ జీవితాన్వేషణను గతితార్కిక భౌతిక దృక్పథంతో, భారతీయాత్మతో చెప్పిన నవలిక అవుతుంది.

*"ఈ మహా ప్రపంచం అంతా ఓ అడవి. ఇందులో మనిషి అంతరాంతరాల్లో ఒంటరివాడు. ఆహారం, నిద్ర, భయం ఇత్యాదులు సర్వప్రాణి కోటికీ సమానంగా కావలసినవే. కాని వాటిని పొందడానికి మనిషి పడే అవస్థ ఒక్కొక్కరికి ఒక్కోలాగ వుంటుంది. జయాపజయాలు, కామ క్రోధాలు. లోభ మోహ మదమాత్సర్యాదులు, సుఖదు:ఖాలు అన్నీ మనిషి అనుభవించాల్సిందే. జీవన సంఘర్షణని, జీవనావసరాన్ని చెబుతూ, జీవనతత్వాన్ని ఒక భాష్యకారుడిలా, వేదాంతిలా, నిర్మోహమాటంగా, నిశ్చలంగా చెప్పడమే యీ "అతడు అడవిని జయించాడు"* (ముందుమాట, మొదటి ముద్రణ, 1985) నవలికలో కనిపిస్తుంది అనే పురాణం సుబ్రహ్మణ్యశర్మ వ్యాఖ్య జీవత వాస్తవానికెంతో దగ్గరగా ఉంది.

తాను పందినీ, పంది పిల్లల్నీ రక్షించడం కోసం పడిన తపనే అతను

సాధించిన విజయంబీ ఇంకా చెప్పాలంటే, అతను చేసిన జీవన పోరాటమంతా అతని విజయమే. అతని మనోసంకల్పంలో మానవ అస్తిత్వం వ్యక్తమయ్యింది. దానితో పాటు మానవ జీవనాన్వేషణలో కనిపించే ఆకాంక్షలకు ప్రతిఫలనమే చివరికి తన మనవడు దగ్గర వ్రాలిపోవడం. ఆ ముగింపులో ముసలివాడు జడత్వానికి చేరుకోగా, పిల్లాడు లేచి కాళ్ళ దగ్గర నిలబడడం వల్ల మళ్ళీ ఆ ముసలాడిలాగే జీవితాన్వేషణను కొత్తగా ప్రారంభించబోతున్నాడనే సూచన ఉంది. కాబట్టి అతడు ఓడిపోలేదు. అతడు విజయం సాధించినట్లే భావించాలి. అతను విజయం సాధించడమంటే విశ్వమానవుడు లక్ష్యసాధనకు నిరంతరం అన్వేషిస్తున్నట్లే!

## రిఫరెన్స్ గ్రంథాలు:


1. కేశవ రెడ్డి. అతడు అడవిని జయించాడు, మూగవాని పిల్లనగ్రోవి.
   ఆర్మూర్: నందిని పబ్లికేషన్స్. 2003
2. కేశవ రెడ్డి. అతడు అడవిని జయించాడు. హైదరాబాదు:
   రీతిక పబ్లికేషన్స్. 1985.
3. కేశవ రెడ్డి. అతడు అడవిని జయించాడు,
   హైదరాబాదు బుక్ ట్రస్ట్, 2009
4. సుబ్రహ్మణ్యం శర్మ, పురాణం. కరక్కాయ పీఠిక.(ముందుమాట,
   అతడు అడవిని జయించాడు) హైదరాబాదు:
   రీతిక పబ్లికేషన్స్. 1985.
5. సంజీవదేవ్. సింహావలోకనం. (ముందుమాట, అతడు
   అడవిని జయించాడు), హైదరాబాదు: రీతిక పబ్లికేషన్స్. 1985.
6. . Hemingway,Ernest. 'The Old Man And The Sea'.
   Penguion Books(N.Z.)Ltd, New Zealand.1952.


***

# ఏది తొలి దళిత గేయం?

శ్రమించేటప్పుడు పాట పుట్టింది. శ్రమను మరచి పోవటానికి ఊతమిచ్చే రాగాల నుండి పాట పుట్టింది. వ్యాక్తావ్యక్త భావాల్ని లయాత్మకంగా నింపుతూ పాట పుట్టింది. జన చైతన్యం కోసం పాట ఉపయోగపడుతుంది. అలాగే దళితులు తమ బాధల్ని, గాథల్ని స్వేఛగా వ్యక్తీకరించుకొనే సాధనంగా పాట మొదట్లో మౌఖికంగానే ప్రారంభమైంది. ఆ తర్వాత దశలో దళితుల్లో చైతన్యం కలిగించడానికి ఒక ప్రధాన వాహికమవుతుంది. "గేయం' సంస్కృత సమం. "పాట' దేశ్యం. కనుక దళితుల "పాట' పాడుకున్నా, గేయమాలపించినా ఆ రెండిటినీ దళిత గేయంగానే సంభావించవచ్చు.

ఆది మానవుడు ఆరంభించిన పని నుండే పాట పుట్టిందని చెప్పడం బాగానే ఉంటుంది. కానీ, ఫలాన సంవత్సరం నుండి ఖచ్చితంగా దళిత గేయాన్ని గుర్తించవచ్చని చెప్పాలంటే పరిశోధన చేయాల్సిందే. అలా పరిశోధన చేసిన వాళ్ళు తొలి దళిత గేయాన్ని 1909 లో వెలువడిందని, అది మాల వాండ్ర పాట" అనీ చెప్తున్నారు. దాన్ని ఒక అజ్ఞాత కవి రాశాడు. ఆ అజ్ఞాతాన్ని" లోతుగా విశ్లేహించుకోవలసిన అవసరం ఉంది. 1909 వ సంవత్సరంలో ఆంధ్ర భారతి (భాద్ర పద మాస పత్రిక) "మాల వాండ్ర పాట" ను ప్రచురించింది. కర్తృత్వం ఎవ్వరో పేర్లోలేదు. గేయాన్ని పరిశీలిస్తే అందరూ హిందువులుగానే పుట్టినా, బ్రాహ్మణుల కంటే దళితులు ఎలా తక్కువయ్యారనే ప్రశ్నలు రేకెత్తుతాయి. దళితులు కూడా హిందువులే అనే దృక్పథంతోనే ఈ గేయం కొనసాగుతుంది.

*"అందారు పుట్టిరి హిందమ్మ తల్లీకి*
*అందారు ఒక్కటై ఉందారి సక్కంగ.*

కష్టమ్ము లొచ్చీన నిష్టూర మొచ్చీన
ఇష్టమ్ము గానుండి కట్టూగ నుందాము. . అందా.

ఎట్టాగూ యెక్కూవ బ్యామ్మర్లు మాకంటె
ఎట్టాగూ యెక్కూవ యేరైన మాకంటె. . అందా.

వరా?ల యెక్కూవ పుట్టంగ లేదయ్య
మమ్మేల క్రిందీకి కుమ్మేరు మానోరు. . అందా.

వేదాలు మాన్యారు ఇంగ్లీషు చదివారు
ఎగబడు చున్నారు ఎట్టి వృత్తులకైన. . అందా.

మతముచ్చు కుంటేను మావోడ వంటారు
మతముచ్చు కోకుంటే మాలోడ వంటారు. . అందా.

సోపెట్టి కడిగితే శుబ్రమౌ నంటారు
సోపెట్టి కదుగూకొ శుబ్రంగ నుంటాము. . అందా.

సారాయి తాగాము సక్కంగ నుంటాము
వేదాలు సక్కంగ ఇనిపించుతామయ్య. . అందా.

హిందూల మౌమమ్ము మందూల మానవద్దు
హిందూల మౌయిప్డు ముందూకు వస్తాము. . అందా.

తమ్మూలంమనిమీరు మమ్మూల జూడండి
అమ్మోరు దీవించి అయిశ్వర్య మిచ్చును. . అందా.

ఈ గేయంలో ముఖ్యమైన విషయాల్ని మాత్రమే ఉటంకించాను. పూర్తిగేయాన్ని అనుబంధంలో గమనించండి. దీన్ని నిజంగా దళితులే రాశారో లేదో కూడా చెప్పలేం. అయితే 1909 ప్రాంతం నాటి పరిస్థితుల్ని చూసినట్లయితే, అప్పటికి భారత స్వాతంత్ర్యోద్యమం ఉధృతంగానే కొనసాగుతుంది. క్రైస్తవ మత ప్రాబల్యం ఎక్కువగానే పెరిగి పోయింది. దళితేతర వర్ణాల వాళ్ళప్పటికే తమ బతుకుల్లో కొత్త కాంతులు వెతుక్కుంటూ వంశ పారంపర్యంగా వస్తున్న అనేక వృత్తుల్ని వదిలేస్తున్నారు. కొత్త అవకాశాల్ని అన్వేషిస్తున్నారు. ఆంగ్ల విద్య ప్రభావం వల్ల కింది వర్ణాల వాళ్ళు కూడా బాగానే విద్యావంతులవుతున్నారు. ఇలాగే క్రైస్తవీకరణ జరిగితే కింది వర్ణాల వాళ్ళల్లోనూ చైతన్యం మరింత పెరిగే అవకాశం ఉందని భావించి ఉండొచ్చు.

అందువల్ల మాలవాండ్ర పాట" పేరుతో ఎవరో ఒక గేయాన్ని రాసి, గాంధీ సంస్కరణోద్యంలో దళితుల్ని భాగస్వామ్యం చేయాల్ని ప్రయత్నించి ఉంటారు. అది నిజంగా దళితులు రాసిన తొలి దళిత గేయం అని పరిశోధకులు అభిప్రాయ పడుతున్నా, దానిలో హిందూ మత నిరసన కంటే ఆ మతం పట్ల ఆరాధన భావమే ఎక్కువగా కనిపిస్తుంది. దీనిలో దళితుల్ని హిందువులుగా పరిగణించాల్ని ఆశిస్తున్నట్లు అన్నదమ్ములుగా కలిసి ఉండాల్ని కోరుకుంటున్నట్లు కనిపిస్తుంది. అలా జరిగితే అప్పుడు వేదాల్ని పరిరక్షిస్తామని దానికి అమ్మోరు" దీవించాల్ని అభిప్రాయపడుతున్నట్లూ ఉంది. ఈ భావాలన్నీ ఆంగ్ల విద్య ప్రభావం విస్తృతంగా కొనసాగుతున్న పరిస్థితుల్లో ఆ గేయం అజ్ఞాతంగా రాసినా అది దళిత కవిది కాదేమో అనే అనిపిస్తుంది. అయినా దళిత పరిశోధకులు దీన్నే తొలి గేయంగా ప్రచారం చేయడం విశేషం. దీనికి కారణం మాలవాండ్ర పాట అని లిఖిత రూపంలో కనపడడం ఒక కారణం కావచ్చు.

ఈ సందర్భంలోనే ఒకటి గుర్తు చేసుకోవాలి. అప్పటికే అనేక మంది దళిత కవులు కూడా గాంధీ ప్రభావానికి గురయ్యారు. జాషువా లాంటి వారే దీనికి ఉదాహరణగా నిలుస్తారు.

నిజానికి అజ్ఞాత కవిరాసిన గేయం కంటే భౌతిక ధ ృక్పథమే ప్రధానంగా కనిపిస్తున్నా, గురజాడ అప్పారావుముత్యాల సరాల్లో రాసిన లవణ రాజు కల" గేయంలో నిజమైన దళిత నిరసన కనిపిస్తుంది. దీన్నీ ఆంధ్ర భారతి పత్రికే 1911 వ సంవత్సరంలో ప్రచురించింది.

*"మలిన వృత్తులు మాలవారని*
*కులము వేర్చిన బలియు రౌక బీ దే*
*శమున కొందరి వెలికి దోసిరి*
*మలినమే మాల?"*
*మలిన దేహుల మాల లనుచును*
*మలిన చిత్తుల కధిక కులముల*
*నెల వొసంగిన వర? ధర్మము*

*ధర్మ ధర్మంబే'అని జాతిని బట్టి* వర్ణాశ్రమ ధర్మాన్ని నిర్ణయించిన వాళ్ళు మనిషి వరా?నికి ప్రాధాన్యతనివ్వడం సరికాదని ఖరాఖండిగా చెప్పాడు కవి. మనుషుల్లో మానసిక అశుభ్రతను గుర్తించటం లేదని, నిజమైన సౌందర్యం వరా?న్ని బట్టి కాక, మనిషి ప్రవర్తనను అనుసరించి వస్తుందని చెప్ప గలిగాడు కవి. " ఈస్తటిక్స్'లో అంతః సౌందర్యంలో గమనించవల్సిన చక్కటి మౌలిక సూత్రాన్ని ఈ కవి చూపిస్తున్నాడు. గేయం శ్రమ సౌందర్యాన్ని తెలిపేదిగా ఉండాలి. అది దళిత ద ృక్పథంతో అన్వయిస్తున్నప్పుడు, దళిత సౌందర్యాన్ని గుర్తిస్తూ నిర?యాల్ని చేస్తే బాగుంటుంది. దళిత సాహిత్యంలో తొలి రచనల్ని గుర్తించేటప్పుడు ఈ సమస్య ఎలాగూ తప్పదు. కానీ, దళితేతరుడైనంత మాత్రం చేత దళిత మనోభావాల్ని సమర్థవంతంగా చెప్పిన కవిని కూడా గుర్తించడం అవసరమనుకుంటాను.

"కన్యాశుల్కం' నాటకంలో, గురజాడ పలికించిన సంభాషణలు దళితుల పట్ల సరైన అవగాహనతో రాసినవి కాదని, అందువల్ల మంచియన్నది" మాలయైతే..." గేయంలోని "మంచి అన్నది' అనే విషయాన్ని లోతుగా పరిశీలించవలసి ఉందనే అభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి.

గురజాడ నాటకంలోనే ఒక చోట మాలవాడి కొడుకు చండాలుడే అనే మాటను ఒక పాత్ర ద్వారా పలికించడం వల్ల కూడా రచయితకు దళితుల పట్ల సదభిప్రాయం లేదనే వ్యాఖ్యానాలు వినిపిస్తున్నాయి. అయితే చండాల" అనేది ఒక కులమని తెలిసి కూడా నిత్య సంభాషణల్లో చాలా మంది ప్రయోగించేస్తున్నారు. దళితులు కూడా ఈ పదాన్ని తెలిసో తెలియకో తమ సంభాషణల్లో నీచార్థాన్ని చెప్పడానికి ఉపయోగించేస్తున్నారు. నేటికీ ఎంతోమంది అభ్యుదయ వాదులమని చెప్పుకుంటున్న వారి రాతల్లో కూడా అక్కడక్కడా ఈ పదం కనిపించింది. అంతే కాదు, తమకి దానిలోని భావజాలం తెలియకుండానే స్త్రీలు కూడా కొన్ని సందరాల్లో గాజులు తొడుక్కున్నావా?" అంటుండటం మనం గమనించవచ్చు. కానీ, ఆ పదంలోని లోతులు తెలిస్తే అలా మాట్లాడతారా అనేది మనం ఆలోచించవలసిన అంశం. గురజాడను కూడా ఈ కోణంలో కొంత అర్థం చేసుకోవాలేమో అనుకుంటున్నాను. ఎందుకంటే,

*మతములన్నియు మాసిపోవును*

*జ్ఞానమొక్కటి నిలిచి వెలుగు'*ననే భావాల్లో ఆయన సాహసం సామాన్యమైంది కాదు. అయినప్పటికీ అప్పటికి అభ్యుదయ భావాలు ఉన్నా, బహుశా స్త్రీవాద, దళిత సాహిత్య భావజాలం ఉన్నంత లోతైన చూపు, తీవ్రత దళిత వర్గాల పట్ల లేకపోవడం ఆ నిర్లక్ష్యానికి కారణమనుకుంటున్నాను. అందుకే దాన్ని అభ్యుదయ దృక్పథానే చూడాల్ని విమర్శకులు అంటున్నారు. దీన్ని బట్టి చూసినా గురజాడ రాసిన ఈ గేయం కూడా తొలి దళిత గేయంగా నిలిచే అవకాశం కనిపించడం లేదు. అయినా గాని గురజాడ "లవణరాజు కల'లో చెప్పిన అనేక అంశాలు దళితుల్ని ఉన్నతీకరించే ప్రయత్నం చేశాయని చెప్పక తప్పదు.

*"మలిన దేహుల మాల లనుచును*
*మలిన చిత్తుల కధిక కులముల*
*నెల వొసంగిన వర్ణ ధర్మము*

*ధర్మ ధర్మంబే'*అని ప్రశ్నించటంలో మానవత్వానికి కవి ఇచ్చిన ప్రాధాన్యాన్ని గుర్తించాలి. దళిత ప్రస్తావన ఉన్న మరికొన్ని గేయాల్ని కూడా చూద్దాం.

1919లో గరిమెళ్ళ మన చిన్ని తమ్ములను జేరదీసి దయ / చేసి మహోదరమిమ్మ" ని రాశారు. 1921లో చెరకువాడ వెంకట రామయ్య, దామోజీపురపు వెంకట నరసింహారావులు దళితులను సోదురులవలే" ఆదరించమని, అంతవరకూ బానిసత్వం పోదనీ, స్వరాజ్యం రాదనీ, విముక్తి లభించదనీ జాతీయోద్యమ ప్రభావంతో గేయాల్ని రాశారు. 1921లోనే కొండపల్లి జగన్నాథరావు దళితుల్ని "మేలుకొలుపు'తూ గేయాల్ని రాశారు. గాంధీ దేవుండవతరించెననీ, నీచ వృత్తుల్ని మానుకోమనీ, బూతు మాటల్ని ఆడవద్దనీ, గొడ్డు మాంసం తినొద్దనీ, మాల– మాదిగ కులము హిందూ మతంలో భాగమేననీ దళితులకి నీతుల్ని చెప్పే దిశగా గేయాల్ని రాశారు. దళితుల్ని సాంస్కృతికంగా మార్పు తెచ్చుకోమనే హిత బోధ కనిపిస్తుంది.

స్వరూప, స్వభావాలను బట్టి దళితగేయాల్ని నాలుగు దశలుగా వర్గీకరించుకునే వీలుంది.

దళితుల జీవన విధానంలో దళితేతరులు సాంస్కృతిక సంస్కరణలకు ప్రయత్నించిన దశ. దళితుల్ని పరిశుభ్రంగా ఉండమని చెప్పటం, మద్యమాం సాదులకు దూరంగా ఉండమనీ, హిత బోధ చేయటం ఈ కాలంలో వచ్చిన గేయాల్లో ప్రధానాంశాలుగా కనిపిస్తాయి. మత మార్పిడిలకు దళితేతరులే తల్లడిల్లి పోవడాన్ని కూడా చూడవచ్చు. ఆంగ్ల పాలనా ప్రభావంతో వద్దన్నా, నియంత్రించినా కలిసిమెలిసి ఉండక తప్పని పరిస్థితులు ఏర్పడడానికి రవాణా, విద్యా విధానాలు మార్గాలేస్తున్నాయి. ఈ పరిస్థితుల్ని గమనించి, హిందూ మత పునరుద్దరణకు దళితుల్ని కూడా సమాయత్తం చేయడానికి సంస్కరణల్ని ఆశిస్తూ దళితేతరులు గేయాల్ని రాయడాన్ని చూడవచ్చు. ఈ గేయాల్ని లోతుగా పరిశీలిస్తే దళితులపై ప్రేమ కంటే, దళితులు అన్య మతాల్లో చేరిపోవడం వల్ల హిందు మత అస్తిత్వం ఏమైపోతుందో అనే భయమే ఎక్కువగా

కనిపిస్తుంటుంది. హిందూ మతాన్ని ఉద్ధరించడానికే గాంధీ సంస్కరణలు దోహదం చేస్తున్నాయనీ స్పష్టమవుతుంది. కనుక, దళితులు రాసినా, రాయకపోయినా దళితేతరులు జాలితో రాసినట్లు కనిపించే గేయాలు ఈ కాలంలో ప్రధానంగా కనిపిస్తూ, మాల – మాదిగల్లో సాంస్కృతిక సంస్కరణ ఆశించడం వల్ల దీన్ని దళిత సాంస్కృతిక సంస్కరణ దశ అని పిలవవచ్చు.

ఈ తర్వాత కాలంలో బోయి భీమన్న రాసిన జయ జయ జయ అంబేద్కర '' గీతం దళిత జాతిని ఉగ్రూతలూగించింది. అది దళిత సభల్లో, ముఖ్యంగా డా.అంబేద్కర్ జయంతి, వర్ధంతి సభల్లో ప్రార్థనా గీతమైంది. అందువల్ల దీన్ని పూర్తిగా అందిస్తున్నాను.

## జయ జయ జయ అంబేద్కర !

–బోయి భీమన్న (1922)

జయ జయ జయ అంబేద్కర !
జయ దళిత జన స్వరా!
జయ మానవ మందారా!
జయ భారత భాస్కరా!
నవ భారత సంవిధాన
ధర్మ పథక నిర్మాతా!
భువి సమస్త పీడత జన
దుఃఖ శాంతి తథాగతా!
వేదాలను శోధించి
వేదాంతము నధిగమించి
మనిషి మనిషిగా బ్రతుకుటె
మహిత మన్న మహాశయా!
అస్పృశ్యత రూపు మాపి
అగ్ర అంత్య భేద ముడిపి

నిష్కల భారత జాతికి
నీడయైన బోధి ప్రియ!
జాతీయ సమైక్యానికి
మతాతీత రాజ్యానికి
ప్రజాస్వామ్య ధర్మానికి
శరణమైన సంఘర్షీ!
జగతికి స్వేఛా సమతా
సౌభ్రాత్రములను కూర్పగ
జన్మ మెల్ల పోరాడిన
జనగణ విప్లవ యోద్ధా!
అంధకారమున పుట్టి
అవనికి దీపము పెట్టి
పంకమును మదించి మహికి
పరిమళ మొసగిన సూరీ!
రాళ్ళకు జీవము పోసి
మ్రోళ్ళను చిగురింపజేసి
మట్టి నుండి మానవులకు
మలిచిన కారణ జన్మా!

ఈ గేయం వెలువడిన కాలంలోనే చాలా గేయాలు వెలువడినా, ఈ గేయం కలిగించిన స్ఫూర్తి చాలా శక్తివంతమైందిగా భావించవచ్చు. నేటికీ ఆ గేయం వివిధ సభల్లో పాడటమే దీనికి నిదర్శనం.

1922లో తిరునగరి వెంకట సూరి దళితుల్ని కరుణించమని ప్రాదేయ పడే రీతిలో గేయాన్ని రాశారు. 1923లో కంభం పాటి లక్ష్మీ నరసింహ సోమయాజులు, గాంధీ సహాయ నిరాకరణోద్యమ ప్రభావంతో దళితుల్ని కలిసి రమ్మంటూ గేయాల్ని రాశారు. గాంధీని ధర్మ సంస్థాపనార్థం అవతార మూర్తిగా వర్ణించటం ఈయన గేయాల్లో కనిపిస్తుంది.

1928లో నెల్లూరి వెంకట రామానాయుడు దళితులు దిక్కుమాలిన వారన్నట్లు, తమని పశువుల్ని చూడద్దనీ, గాంధీ బోధనల్ని విని, బాధ విముక్తి కలిగించమని పార్థన రూపంలో గేయాన్ని రాశారు. బసవరాజు అప్పారావు కూడా ఇదే రీతిలో రాసి, గాంధీ మహాత్ముణ్ణి ఆ సామి వారి అవతారమై" రక్షించమని రాసారు. పురిపండా అప్పలస్వామి రాసిన ఒక గేయాన్ని విశాఖ జిల్లా హరిజన సేవా సంఘం ప్రచురిస్తే, దాన్ని 1933లో ఆంధ్రభూమి ప్రచురించింది. గుడిలోని దైవాన్ని నిలదీసి, మాలలు పెట్టిన పూలెందుకు మట్టంచివయ్యాయో ఆలకించమన్నారు. గరిమెళ్ళ సత్యనారాయణ 1933లో హరిజనులకై" కొన్ని గేయాలను రాశారు.

*"మూర్ఖా చారములన్ – మరియును మూఢ మతంబులన్*
*సమూలముగా విడనాడి జగత్ప్రభు – సంస్తుతి పాడుదము"*

అంటూ, దళితుల ఆచారాల్లో మూర్ఖత్వాన్నే చూడగలిగారు. దళితుల ఆచారాన్ని చాలా ఆగౌరవపరచటం కనిపిస్తుంది. కానీ, పైకి దళితుల అభ్యుదయాన్ని ఆశిస్తున్నట్లు ఉంటాయి. అయితే, భక్తులు చూస్తే గుళ్ళు మయిల పడతాయనుట పరమ సిద్ధాంతమటండేఇట్టి యుక్తులు పట్టి పెద్ద ఉరితాళ్ళు కట్టిమా ఉసురెల్ల పోసుకోకండి..." అనే హేతువాద భావాలు కూడా గరిమెళ్ళ సత్యనారాయణ రాసిన గేయాల్లో కనిపిస్తాయి. మొత్తం మీద చూస్తే గరిమెళ్ళ గేయాల్లో దళితుల వృత్తి సరైంది కాదంటూనే, మళ్ళీ సమాజానికి అవసరమైన వృత్తుల్ని చేయటం అవసరం అనే భావన కనిపిస్తుంది. వృత్తుల్ని , ఆచారాల్ని మానమనడం, మధ్య మాంసాదులను విసర్జించమనడం, పరిశుభ్రతను పాటించమని సలహాలివ్వడం, గాంధీ బోధనల్ని అనుసరించమనడం, తద్వారా మళ్ళీ హిందూ మత పునర్వైభవాన్ని తీసుకొని రావడానికి దళితుల్ని ముందుకి కదలిరమ్మనడం ప్రధానంగా కనిపిస్తుంది.

కొండేటి రంగాచార్యులు దళితుల సహకారంలేనిదే సమాజం బతకటం కష్టమంటూనే, హిందూ మత దృక్పథంతో గేయాన్ని రాశారు. గాంధీ ప్రభావమే ఈయన చేత దళితుల అభ్యునతిని కోరుతూ గేయం రాయించింది. *"ఇతర దేశముల కేగిన తెలియును, మనమే పంచములంటే"* అని కూడా ఈయన

అనగలిగారు.

ఊటకూరు సత్యనారాయణరావు సవర్ణుడని గర్విష్ఠి'గా సంభోదిస్తూ, ఈ జన్మలో దళితుల్ని ప్రేమించలేక పోయి, వ్యత్యాసాల్ని పాటించినా, స్మశానంలోనైనా సమానత్వాన్ని అంగీకరించి తీరవలసిందేనంటారు.

దళితుల దయనీయ స్థితి వర్ణిస్తానే, వారి వృత్తుల్ని, సంస్కృతిని, వేష భాషాదుల్ని తక్కువ చేస్తూనే, వారిని ప్రేమించవలసిన అవసరం ఉందనే అభిప్రాయాల్ని వ్యక్తీకరించటం కనిపిస్తుంది. మొత్తం మీద దళిత గేయాల్లో కింది అంశాలు ప్రధానంగా కనిపిస్తాయి.

1. కుల వృత్తుల్ని, మలిన వృత్తులనడం సరికాదు.

2. వేష భాషాదుల్లో మార్పులు రావాలి.

3. మద్య మాంసాదులు విసర్జించాలి.

4. దేవాలయాల్లోకి దళితుల్ని ప్రవేశించనివ్వాలంటే, ఇవన్నీ మార్చుకోగలిగితే సులభమేనని పరోక్షంగా సూచించటం.

5. హిందువుల్లో అంతర్విపక్షి కొనసాగుతుండటం వల్లనే, ఇతర మతాల్లోకి వెళ్ళిపోతున్నారని పరోక్షంగా అంగీకరించడం కనిపిస్తుంది.

6. పాశ్చాత్యీకరణ, ఆంగ్ల పాలకుల ప్రభావం వల్ల వచ్చిన రైలు, బస్సు వంటి రవాణా సదుపాయాల్ని బట్టి తప్పనిసరిగా దళితుల్ని కలిసిమెలిసి తిరగనివ్వక తప్పదనే భావాలు “గరిమెళ్ళ' లో కనిపిస్తున్నాయి.

7. జాతీయోద్యమంలో గాంధీ ప్రభావమే అనేక మందితో దళితుల్ని ఉద్యమంలో భాగం చేసే ఆలోచనతో గేయాల్ని రాశారు.

ఇవన్నీ తొలిదశలో వచ్చిన దళితగేయాల్లో కనిపించే ముఖ్యాంశాలు. తర్వాత కాలంలో ఆత్మగౌరవ ప్రబోధం కనిపిస్తుంది. ఇన్ని గేయాల్ని చూసినప్పుడు అజ్ఞాత కర్త రాసిన గేయమే తొలిదళిత గేయంగా భావించేవారు కాలాన్ని మాత్రమే చూస్తున్నారు. కానీ, దానిలో ఉన్న భావజాలాన్ని గుర్తించడం లేదు. దాన్ని గుర్తించి, తొలిదళిత గేయాన్ని నిర్ధారించుకోవలసిన అవసరం ఉంది.

***

# మునెమ్మ'లో
# మహిళా చైతన్యం,మార్మిక శిల్పం.

డా॥ కేశవరెడ్డిమునెమ్మనవలికలో ఒక స్త్రీ పాత్రను కేంద్రంగా చేసి భిన్నమైన సమస్యలతో సతమతవుతున్న మహిళల జీవితాల్ని చిత్రించారు. స్త్రీని అర్థం చేసుకోవడంలో వైఫల్యానికి గురవుతున్న పురుషుల అంతరంగాల్ని మన ముందు ఆవిష్కరించారు. మాత ృస్వామ్యంపై పెత్తనం చెలాయించే పితృస్వామిక వికృత స్వరూపాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించారు. నిజానిజాల్ని పసిగట్టడం అంత సులువైన పనికాదన్నట్లు, దానికి సరిగ్గా సరిపోయే మ్యాజిక్ రియలిజమ్ టెక్నిక్‌ని ఎన్నుకున్నారు. నోరుండీ తమకిష్టమొచ్చినట్లు మాట్లాడే మనుషుల కంటే, నోరున్నా మాట్లాడలేని పశువుల్లో ఉండే ఉదాత్తతని మన కళ్ళ ముందు నిలిపారు. బొల్లిగిత్తను ఒక పాత్రగా తీసుకుని నిష్కల్మషమైన వాత్సల్యం, విశ్వాసం, క ృతజ్ఞతలను వర్ణించి వాటితో పోల్చుకున్నప్పుడు మానవుడు ఎంత వరకూ ఎదిగాడో పరీక్షించుకొమ్మన్నట్లుగా మనముందీ నవలికను పెట్టారు. దీన్ని వివరించడానికి నవలికలో స్త్రీ, బొల్లిగిత్త, పురుషుడు అనే మూడు ప్రధాన పాత్రల చుట్టూ కథని నడిపించారు.

మునెమ్మ, జయరామిరెడ్డి భార్యా భర్తలు. వాళ్ళిద్దరూ ఆరేళ్ళు కలిసిమెలిసి కాపురం చేశారు. వాళ్ళిద్దరూ ఒకరోజు పొలంలో పనిచేస్తున్నప్పుడు బొల్లిగిత్త తన రెండు కాళ్ళూ పైకెత్తి మునెమ్మ మీది కొస్తుంది. అది గమనించిన భర్త, ఆ బొల్లిగిత్తను కక్ష తీరా కొట్టి, దాన్ని అమ్మేయాలనుకుంటాడు. దాన్ని అమ్మడానికి పశువుల సంతకు వెళ్ళిన తన భర్త ఇంటికి రాడు. కానీ, ఆ బొల్లిగిత్త మాత్రం వచ్చేస్తుంది. ఆ రాత్రి మునెమ్మకు తన భర్త చనిపోయినట్లు కల వస్తుంది. తనకి మరిది వరసైన సినబ్బను తోడు తీసుకుని తెల్లవారగట్లే

తన భర్తను వెతకడానికి వెళ్తుంది. తన భర్తను మధ్యవర్తులు హత్య చేశారని తెలుసుకుని, వాళ్ళపై ప్రతీకారం తీర్చుకుంటుంది. తన భర్త చనిపోయినందువల్ల తాను కూడా చనిపోవాలనుకోలేదు. అవసరం అన్నీ నేర్పుతుందంటూ, అది మనిషికే కాదు, గొడ్డుకీ వర్తిస్తుందనడంతో నవలిక ముగుస్తుంది. ఇది స్థూలంగా కథ. కథ ముగ్గురు చుట్టూ తిరుగుతుంది. వాళ్ళు మునెమ్మ, బొల్లిగిత్త, జయరామిరెడ్డి.

ఈకథలో పిత ృస్వామికస్వభావం అనువర్తితమైన తీరుని చాలా జాగ్రత్తగా గమనించవలసి ఉంది. జయరామిరెడ్డికి తన తండ్రి గుణాలే వచ్చాయని చెప్పడానికే ద్రౌపది వేషం వేసిన వాణ్ణి నరికేసిన నేపథ్యాన్ని రచయిత వివరించారనుకోవడానికి వీల్లేదు. అతనికున్న మధ్యపాన వ్యసనం, స్త్రీలోలత్వం, భార్యని కూడా సంప్రదించకుండానే తానూ నిర్ణయాలు తీసేసుకోవడం వంటి వన్నీ తరతరాలుగా సంక్రమిస్తున్న పురుషాధిపత్య పిత ృస్వామిక అవశేషాలు. అవి రెండు తరాల్లో చూపి, మూడవ తరం సినబ్బ తరంలో మార్పుని ఆశించారు రచయిత. జాగ్రత్తగా చూస్తే, రెండవ తరంలోనే తానేమిటో నిరూపించుకోవడానికి స్త్రీ పడుతున్న సంఘర్షణ మునెమ్మలో చిత్రించారు. అందుకనే ఈ నవలికకు ముందు మాట రాసిన జయప్రభ ఇలా అభిప్రాయపడ్డారు.

*"కథకుడైన కేశవరెడ్డిగారికి ఇవాళ్టి కాలంలోని స్త్రీలు చేస్తూన్న ఆలోచనలూ... వాళ్ళు వేస్తూన్న అడుగులూ తెలుసు. అందువలన ఆయన ఎంతగా అరవై ఏళ్ళ వెనకటి కథనే ఎన్నుకున్నా, మునెమ్మ పాత్రని చిత్రీకరిస్తున్నప్పుడు అనివార్యంగా ఆయనపై సమకాలీన స్త్రీల ఆలోచనల ప్రభావం పనిచేసినట్టుంది."* ( జయప్రభ,ఆధునిక తెలుగు కాల్పనిక సాహిత్యంలో "మునెమ్మ' ప్రత్యేకత , మునెమ్మ నవలికకు ముందుమాట, 2008: vii)

అభిప్రాయాన్ని విమర్శిస్తూ ఒక తెలుగు బ్లాగు (www.soumyabhavalu.blogspot.com, 28 February 2009) లో సౌమ్య (?)గిత్తలతో రంకులు కట్టి చెంప పగలగొట్టే మొగుడ్ని హంతకుల్ని

తమ చేతులతో తామే చంపేందుకు బయల్దేరతారా ఈనాటి ఆడవాళ్ళు! హతవిధీ!"అన్నారు. ఇక్కడొకటి గమనించాలి.

ఈనాటి స్త్రీ వాదంలోనూ రకరకాలు ధోరణులు ఉన్నాయి.సమకాలీన స్త్రీల ఆలోచనల ప్రభావం పనిచేయడాన్నెలా లెక్కించాలనేది ఆలోచించవలసిన అంశం. తనపైకి వచ్చిన బొల్లిగిత్తతో రంకు కట్టినట్లెక్కడా మునెమ్మ భావించలేదు. అంత: స్ఫురద్రూపికి ఆమాత్రం అర్థం కాలేదా అనీ కొంతమంది విమర్శించారు. జయరాముడి ఆలోచనకీ, మునెమ్మ ఆలోచనకీ చాలా వ్యత్యాసాలు ఉన్నాయి. ఈ ఆలోచనలతో మునెమ్మను అర్థం చేసుకోవాలి. ఆమెకు ఆ బొల్లిగిత్తపై ఉన్నది వాత్సల్యమే తప్ప, మరో భావన లేదు. కనుక, ఆమె బొల్లిగిత్త గురించెలా ఆలోచిస్తుంది!

మనం కథను లోతుగా చూస్తే, మునెమ్మపైకి బొల్లిగిత్త కాళ్ళెత్తడంతో, ఆమె భర్త జయరామిరెడ్డిలో ఒక అనుమానం రేకెత్తుతుంది. వాళ్ళిద్దరి మధ్యా లైంగిక సంబంధం ఉందేమోననీ, అందువల్లనే అది అలా ప్రవర్తించిందనీ, అవన్నీ ఆమెకు తెలుసునన్నట్లు అతడు తనకు తానే ఓ నిర్ధారణకు వచ్చేస్తాడు. దాన్ని అమ్మేయాలనుకుని, సంతకు తోలికెళ్ళి, తాను హత్యకు గురవుతాడు. ఈ నిర్ణయాలన్నీ పితృస్వామిక స్వభావానికి సంబంధించినవే. దీనిలో తాను శాసించడమే తప్ప, స్త్రీ చెప్పే మాటకు విలువ ఉండదు. ఇంకా చెప్పాలంటే, స్త్రీ (మునెమ్మ) చెప్పుకునే అవకాశమే ఉండదు. తనపై పడిన నిందను నిరూపించుకోవడానికి, అసలు విషయం చర్చించుకునేలోగానే నిర్ణయాలు వెలువడుతుంటాయి. అవన్నీ ఆధిపత్యంతో వెలువడే నిర్ణయాలు. అది ఈ నవలికలో బొల్లిగిత్తనూ, తననూ ఎందుకు కొట్టాడో తెలుసుకుందామనుకునే లోగానే అన్నీ అయిపోయాయని వరి?ంచడం ద్వారా వ్యక్తమయ్యాయి. దీనికి ఉదాహరణగా తన భార్యతో మాట మాత్రం చెప్పకుండానే బొల్లిగిత్తను అమ్మేయాలనుకున్నట్లు వరి?ంచారు రచయిత. అంతే కాకుండా జయరాముడు హత్యకు గురికావడం కూడా జరిగిపోయింది. స్త్రీ చెప్పుకోవడానినికి ఇంకెక్కడ అవకాశం ఉంది? బహుశా జయరామిరెడ్డి బతికుంటే తప్పకుండా తన

తప్పేమిటో నిరూపించుకోగలిగేదని సినబ్బతో మునెమ్మ మాట్లాడిన మాటల్ని బట్టి తెలుస్తుంది.

పసుపులేటి పూర్ణ చంద్రరావు దీన్ని" ఫండమెంటల్' కథ అంటూనే డబుల్ కొటేషన్స్‌లో పెట్టి A manifesto on the feminine అని అన్నారు. (ది సండే ఇండియన్,1 నవంబరు 2009 : 42) ఈ చర్చలో పాల్గొంటూ నగ్నముని (ది సండే ఇండియన్ 15 నవంబరు 2009: 40) మునెమ్మలో భావి స్త్రీత్వ ఉద్యమాలు ఊపిరులూదడానికి బలమైన విత్తనాలు ఉన్నాయన్నారు. మునెమ్మలో ఎద్దుని ఒక Metaphor గా వాడారని (అదే సంచికలో) శ్రీనివాస్ దెంచనాల  అన్నారు.

మునెమ్మ తనని కొట్టిన భర్తని వెతకడానికి వెళ్ళడంలోనుబీ తనని ఎందుకు కొట్టాడో బొల్లిగిత్తకు కూడా తెలియకపోయినా (ఒక వేళ దానికి తెలిసినా) తనని ఇన్నాళ్ళూ పెంచి పోషించిన యజమానికి తన వంతు కర్తవ్యాన్నీ నెరవేర్చడంలోనూ అవ్యక్తానురాగాలున్నాయి. అందుకే తన భర్తని చంపిన వాళ్ళపై కక్షతీర్చుకోవాల్ని మునెమ్మ భావించింది. తన యజమానిని చంపిన వాళ్ళని బొల్లిగిత్త చంపింది.

ఇక్కడ మునెమ్మలో అనురాగం, బొల్లిగిత్తలో వాత్సల్యమే ప్రధానం. ప్రకృతిలోని పశుపక్ష్యాదులతో మానవులకున్న విడదీయరాని అనుబంధాన్ని ఏవో కొన్నింటితోనే అంచనా వేయలేం. వాటితో కలిసిమెలిసి జీవించిన వాళ్ళకే అది బాగా తెలుస్తుంది. ఇటువంటి అభిప్రాయాన్నే దాము  చెప్తూ "*మునెమ్మ నవల ఆధునిక పూర్వ సమాజపు అవశేషాల్ని మిగుల్చుకొన్న గ్రామీణ జీవితానికి సంబంధించింది* " గా కనిపిస్తుందని చెప్తూనే మునెమ్మని అర్థం చేసుకోవడానికి మనం మునెమ్మ జీవించిన స్థలంలోకి, కాలంలోకి ప్రవహించగలగాలి' (ది సండే ఇండియన్15 నవంబరు 2009: 40, 41) అని అన్నారు. ఇది చాలా పరిశీలనతో చేసిన వ్యాఖ్య అనిపిస్తుంది. అయితే ఇక్కడే మనకో ప్రశ్నకూడా ఉదయిస్తుంది.

ఈ నవలికలోని వస్తువు ఏకాలం నాటిది? మనం ఏ కాలంలో

ఉండి మాట్లాడుతున్నాం లేదా ఏ కాలంలో మనుషులుగా అర్థం చేసుకుంటున్నాం? దీన్నీ చూద్దాం.

మునెమ్మకు, జయరామిరెడ్డికి వివాహం అయ్యిన తేదీ: 16-2-1939.బొల్లిగిత్తను అమ్మడానికి బయలుదేరిన రోజు : ఆదివారం. ఇంటికి రావాలనుకుని ప్రణాళిక వేసుకున్న రోజు: మంగళవారం.అమ్మడానికి తోలికెళ్ళిన బొల్లిగిత్త తిరిగి ఇంటికొచ్చిన రోజు : మంగళ వారం.మునెమ్మకు కల వచ్చిన రోజు: మంగళవారం రాత్రి.

ఆ కల గురించి సినబ్బకు చెప్పిందెప్పుడు: మర్నాడు (బుధవారం) (పుట: 29).జయరామిరెడ్డిని వెతకడానికి బయలుదేరినదెప్పుడు : బుధవారం తెల్లవారగట్ల.బొల్లిగిత్త కొమ్ములకు తగిలించి ఉన్న చీటి పై ఉన్న తేది: 28-6-1945.

దీన్ని బట్టి ఈ సంఘటనలో బొల్లిగిత్తను కొట్టిన తేదీ ఎప్పుడై ఉ ంటుంది? మనకు కథను వివరిస్తున్న సినబ్బ బొల్లిగిత్తను అమ్మడానికి జయరామిరెడ్డి బయలుదేరిన రోజు " ఆదివారం " అని చెప్తున్నాడు. అంటే, బొల్లిగిత్త కొమ్ములకున్న చీటిని బట్టి దాని ముందు రోజున 27-6-1945 గా నిర్ధారించే అవకాశం ఉందా? ఈ రెండు రోజులూ ఏ రోజులై ఉన్నాయో గణించాల్సిందే.

కథకుడే మనం ఆ ఇబ్బంది పడకుండా మరోచోట ఇరవై ఎనిమిదో తారీఖున - అనగా సోమవారం బొల్లిగిత్త పరసలో ఉండినట్లు దాని కొమ్ముకు ఉన్న చీట్టిని బట్టి తెలుస్తుంద"ని ( పుట: 36) చెప్పేశారు.

దీన్ని బట్టి బొల్లిగిత్తను ఆదివారం, 27-6-1945 తేదీన పరసలో అమ్మేయడానికి బయలుదేరినట్లు స్పష్టమవుతుంది. సంఘటన జరిగేటప్పటికి మునెమ్మకు సుమారు ఆరేళ్ళ క్రితం పెళ్ళైందని (పుట: 5) తెలుస్తుంది. దాన్ని రచయిత 16-2-1939, 28-6-1945 అనే తేదీలను జాగ్రత్తగానే వివరించాడు.

ఇక మనకు తెలియవలసింది, ఈ కథను సినబ్బ చెప్పడం ఎప్పుడు

ప్రారంభించాడు? ఈ ఘటన జరినప్పటికి తన వయసు ఇరవైయ్యేండ్లని చెప్తాడు సినబ్బ ( పుట: 4)... ఇంకా ఇలా చర్చలు చేసుకుంటూ పోవచ్చు. కానీ, అదే ప్రధానం కాదు. దాని ద్వారా రచయిత చెప్పాలనుకున్నది వేరు.

ఇక్కడ కథాకాలాన్నీ, చారిత్రక వాస్తవాంశాలుగా చెప్పే ప్రయత్నాన్నీ మనం కథనంలో భాగంగా అర్థం చేసుకోవాలి. ఇది అదుతే కథనం. కత్తి మహేష్ కుమార్ భావించినట్లు సినబ్బలోని కథాకథన నైపుణ్యం. అలాగని ఆ కాలం నాటి విషయాలతో కథకు సంబంధం లేదని కాదు. అది వాస్తవానికీ, సత్యానికీ ఉన్నంత భేదంతో కూడింది. మనం చదివేది సృజనాత్మక రచనే తప్ప, చరిత్ర గ్రంథం కాదు!చరిత్రలో వాస్తవాలు ప్రధానమైతే, సృజన సాహిత్యంలో సత్యం ప్రాధాన్యత వహిస్తుంది. సృజనకారుడు చారిత్రక అంశాలను నాోన్నరిస్తూనే, తన లక్ష్యాన్ని సాధించుకుంటాడు. అది పితృస్వామ్య భావజాలంలో వస్తున్న పరిణామాల్ని మ్యాజిక్ రియలిజమ్ టెక్నిక్‌తో చెప్పడంగా నేను అర్థం చేసుకుంటున్నాను.

గతంలో ఈ రచయితే రాసినఅతడు అడవిని జయించాడునవలికలో పంది రూపంలో ఓడిపోయినట్లు కనిపించిన స్త్రీత్వం గానీ, ముసలివాని విజయాన్ని గానీ మరింత స్పష్టంగా చూపడానికి గాని రచయిత మునెమ్మ ద్వారా ప్రయత్నించాడేమో అనే సందేహాలు కూడా కలుగుతుంటాయి. దీనిగురించి సుజాత (www.manishi-manashulomaata.blogspot.com) మునెమ్మ మనోభావాల చిత్రణ చదువుతుంటే, అతడు అడవిని జయించాడు లోని ముసలివాడి పాత్ర గుర్తొస్తుంది. ఆమె కర్తవ్య నిర్వహణ, అలుపెరుగని ప్రయాణం, పంది పిల్లల్ని కాపాడే ప్రయత్నంలో ముసలివాడు పడే తాపత్రాయాన్ని గుర్తుచేసుంది' ' అని వ్యాఖ్యానించారు. దీనిలో కూడా మహిళ సాహసాన్ని గుర్తించమనే అభిప్రాయం వ్యక్తమవుతుంది. ఆ రకంగా అది కూడా ఒక రకమైన స్త్రీచైతన్యమే.

ఈ రచనను మూడు కోణాల్లో అర్థం చేసుకోవాలను కుంటున్నాను.

మొదటిది మునెమ్మలో ఉన్న మహిళా చైతన్యం. రెండవది వాస్తవమనిపించేలా చారిత్రకాంశాల్ని గుదిగుచ్చుతూ, కథని ముందుకీ వెనక్కీ నడిపిస్తూ, కథనంలో ప్రవేశించే అవాస్తవిక విషయాల్ని అదుతంగా చిత్రిస్తూ, వాస్తవాలుగా చెప్పే మ్యాజిక్ రియలిజమ్ శిల్పంలో రచన కొనసాగించడం. మూడవది రచనను సాధ్యమైనంత ఎక్కువ మంది చదివించగలిగేందుకు తోడ్పడే విషయ ప్రకటనల్లో కావాలనే వివాదస్పదంగా మార్చగలగడం.

మొదటిది రచన ద్వారా రచయిత చెప్పాలనుకున్న సందేశం.రెండవది రచన ద్వారా రచయిత నిరూపించుకోవాలనుకున్న రచనా నైపుణ్యం. మూడవది రచనను మార్కెట్ అని పూర్తిగా అనలేం గానీ, సమకాలీన టి.వి. సినిమా, ఇంటర్నెట్ వంటి వాటి ప్రభావం నుండి పుస్తక పఠనాన్ని సీరియస్‌గా మార్చగలిగే ఆలోచనలు వ్యక్తమవుతున్నాయి. ఇది రచయిత ఉద్దేశపూరకంగా పన్నిన వ్యూహం కావచ్చు. కాత్యాయని (సాక్షి దిన పత్రిక,13 అక్టోబరు 2009 ) రచయిత డా॥ కేశవరెడ్డి గురించి చెప్తూ *"చవకబారు పాఠకులను ఆకట్టుకోవాల్సి తపించిపోతున్నార*ని తీవ్ర స్వరంతో చెప్పినా నేను మూడో అంశంగా పైన ప్రతిపాదించిన రచయిత ఉద్దేశానికి సంబంధించిన విషయమే కాత్యాయని తన దైన మాటల్లో చెప్పారనిపిస్తుంది. పాఠకుల్ని రచయిత అంత తక్కువ అంచనా వేస్తాడని భావించలేం. అలా చెప్పడంలో పాఠకుల్ని నమ్మించే ప్రయత్నంగా కాకుండా, ఆలోచించే ప్రయత్నంగా అదుతమైన ముగింపుగా అర్థం చేసుకోవాలి. మార్మికతలోని మౌలిక అంశమే అది కదా! తెలుగు బ్లాగు లోకంలో కూడా ఈ నవలికపై విస్త ృతంగానే చర్చజరిగింది. కత్తిమహేష్‌కుమార్ (www. parnashaala. blogspot.com) దీన్ని తార్కిక బుద్ధితో కంటే, రసస్పందనతో, రచయిత ఉద్దేశాలను పరిగణన తీసుకుంటూ చదవాలన్నారు. అంటే సృజనాత్మక సాహిత్య మౌలిక అంశాన్ని గుర్తించాలి. అలా చూసినప్పుడు మునెమ్మ రచయిత పాఠకులను రసహ ృదయుల్ని చేయగలిగినట్లే. ఆ విధంగా రచయిత మహిళా చైతన్యాన్ని గుర్తిస్తూ, పాఠకులకు మార్మిక శిల్పానుభూతిని అందించగలిగారు.

రచయితలోని మూడవ కోణం, రచయిత వ్యూహం అనుకున్నాం కదా! అది ఇలా సాగింది. పాఠకుల్ని ఇలా తనలో తాను చర్చించుకునేలా చేశారు

ఈ నవలిక సురేంద్రరాజు అన్నట్లుగానే మునెమ్మ ప్రయాణం ఆసాంతం ఒక నేటివ్ క్రైమ్ థ్రిల్లర్‌లా, డిటెక్టివ్ స్టోరీలా సాగుతుంది" (అంబటి సురేంద్రరాజు, 2008 : 105) తన భర్తని చంపిన వాళ్ళెవరో తెలుసుకొనే అన్వేషణలో మునెమ్మ ఉంటే, మునెమ్మే భర్తని చంపి, మళ్ళీ తనెందుకు అలా ప్రవర్తిస్తుందని ఉత్కంఠతో పాఠకులూ అన్వేషణలో పడతారు. దానికి కారణం, ప్రారంభంలోనే రచయిత ఒక అనుమానాన్ని రేకెత్తిస్తాడు. కథనంతా చదివేసిన తర్వాత సంతోషంతో ఊపిరి పీల్చుకున్నా, మళ్ళీ ఆలోచనలు వెంటాడతాయి. అన్ని అసాధారణమైన తెలివితేటల్ని ప్రదర్శించిన మునెమ్మ, బొల్లిగిత్తని భర్త చావబాదిందెందుకో అర్థం కావట్లేదనడం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఆమెకి తెలిసీ అలా ఎందుకు అడిగిందో ఆలోచించాల్సిపిస్తుంది.

చిత్రమేమిటంటే, రచయిత కథాగమనంలో జోక్యం చేసుకున్నట్లు కనిపించదు. కానీ, సినబ్బలోనే రచయిత ఉన్నాడు. అతడే కదా దీనిలో నెరేటర్! మరి అతడికి తెలియని రహస్యమెలా ఉంటుంది?పిలగాడా అని మునెమ్మ బొల్లిగిత్తను పిలవడం సినబ్బకెలా తెలుసునని విమర్శించిన వాళు ్ళ దీన్ని గుర్తించాలి. పాత్రల స ృష్టి, స్థితి, లయ కారకుడు రచయితే కదా! అయితే, డా. కేశవరెడ్డి తన రచనలన్నింటిలోనూ పాత్ర పోషణలో భావజాల విస్తరణ ఉంటుంది. ఒక తాత్త్వికత నిండి ఉంటుంది. అందువల్ల ఆ పాత్ర గతంగా మాట్లాడేటప్పుడు ద్వైదీభావం కనిపిస్తుంటుంది. మిగతా నవలికల కంటే దీనిలో రాయలసీమ, తెలంగాణ ప్రాంతాల భాషను చాలా పాత్రల్లో పలికించారు.

మునెమ్మ తన భర్త జయరాముడిని ఏకాంతంగా "పిలగాడా' అని పిలిచినట్లే, తనకు తెలియకుండానే బొల్లిగిత్త గురించి " పిలగాడా' అని అంటుంది. తన భర్తని తన వెంట్రుకలతో పేనిన తాడుతోనే చంపేశారని

తెలిసి వివశురాలైపోతుంది. ఆ వర?న అదుతేంగా ఉంది. దీన్ని కొంతమంది మహాభారతంలో ద్రౌపది వస్త్రాపహరణ ఘట్టాన్ని నా?స్మరింపజేసిందనీ, ఆ సందరరేలో కృషా? అని పిలిచింది నిజంగా తన సోదరుడైన శ్రీ కృష్ణుణ్ణా? తన భర్త అయిన అర్జునుణ్ణా? అని రచయిత ఇచ్చిన వివరణ ( సాక్షి పత్రిక) గమనించవలసి ఉంది. అర్జునుడికి కూడా కృష్ణ అనే నామం ఉందట. అయితే మునెమ్మ ఆ సందరరేలో ఇలా పిలవడాన్ని కూడా తప్పుపట్టిన వాళు ళున్నారు. అది ఒక భయంకరమైన సన్నివేశం. అలాంటి సమయంలో ఏమి మాట్లాడుతున్నామో, ఏ స్థితోలో ఉన్నామో, ఏమి చేస్తున్నామో తెలియని ఉన్మాద స్థితిలోకి వెళ్ళిపోతాం. దీన్ని స్ఫురించడానికే రచయిత తన శరీరంపై చీర లేదని గమనించలేకపోయిందంటారు. పిలగాడా అనిపిలవడం వివాదంగా కనిపించే వివాదం లేని సన్నివేశ కల్పన. రస స్పందనకు సంబంధించిన చిత్రణ.

కానీ,వివాదానికికారణమైనది ఇంకొకటి ఉంది. జయరాముడికి పిల్లల్లేరు. జయరాముడు తాగుబోతు. జయరాముడు తండ్రిలాంటివాడే.

తన జాకెట్టు చీరిపోతే, తన అత్తగారితో బొల్లిగిత్త గోకిందని చెప్తుంది. ఆ బొల్లి గిత్తనెందుకు తన భర్త తీవ్రంగా కొట్టాడో తనకి తెలియదా? కథచెప్తున్న సినబ్బ రూపంలో రచయిత గ్రామస్థులకే కాకుండా, మునెమ్మకు కూడా ఆ విషయం తెలియదంటాడు.

అత్తగారు మాత్రం వెంటనే పసిగట్టేస్తుంది. బొల్లిగిత్త ఒళ్ళంతా చీరికిపోయిన స్థితిని చూసి, కోడలితో మాట్లాడిన తర్వాత ఆమె కూడ బొల్లిగిత్తను అమ్మేయడమే మంచిదనే నిర్ణయానికొస్తుంది. అత్తగారు కూడా బొల్లిగిత్తను అమ్మేయడానికే సహకరిస్తుందని మునెమ్మ ఆశ్చర్యపోతుంది. అంత సూక్ష్మగ్రాహి అయిన మునెమ్మ వీటినెందుకు గుర్తించలేకపోయిందనే ఆలోచన వస్తుంది. ఇక్కడ సర్వ సాధారణంగానే, సామాన్య పాఠకులకు కలిగే అనుమానం ఇది.

కథాగమనంలో బొల్లిగిత్తనెందుకు కొట్టాడో తెలుసు కోలేదా అని అడిగిన సినబ్బతో *“తెల్సుకునేదానికి తేల్చుకునేదానికి యాడ తీరిందిరా.*

*అది జరిగినాక ఆయన బూమ్మీద ఉండింది రెండేరెండు దినాలు గదా"* అన్నది మునెమ్మ. ( పుట: 6) దీన్ని బట్టి మునెమ్మ నిలదీయగలిగే ఆలోచన ఉన్న స్త్రీగానే కనిపిస్తున్నా, ఒక జంతువుతో మనిషికి లైంగిక సంబంధాన్ని ముడిపెట్టేటంతటి మూర్ఖ స్వభావాన్ని తన భర్తలో ఊహించలేకపోయిందనుకోవచ్చా?

పోనీ అనుకోలేదని అనుకుంటే, తన భర్త స్థానాన్ని బొల్లిగిత్త భర్తీ చేసిందని, అది పోయిటిక్ జస్టిస్ గా విమర్శకులు సమర్థించడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి?

భర్తని చంపేసినా, పిల్లలు లేకపోయినా, తిరిగొచ్చేసిన బొల్లిగిత్తను బండి తోలాల్ని నిర్ణయించుకుంటూ *"అవసరం అన్నీ నేర్పుతుందిరా సినబ్బా. ఈ మాట గొడ్డుకు కూడా వర్తిస్తుంది'* ( మునెమ్మ, 2008 : 95) అని అంటుంది మునెమ్మ.

కథనాన్ని జాగ్రత్తగా చూస్తే పెళ్ళై ఇన్నాళ్ళైనా పిల్లలు పుట్టక పోవడానికి భర్తలో లోపాన్నేదో రచయిత సూచించాలనుకుంటున్నాడా?

సినబ్బ మునెమ్మను అక్కా" అని ఒక వరసలో పిలుస్తుంటాడు. ఆమె మాత్రం మరో వరసలో అతణ్ణి మరిదిగా భావిస్తుంది.

ఇలాంటి సన్నివేశాల్ని కల్పించడంలో రచయిత ఏదో చెప్పదలచుకుంటాడు. మునెమ్మలో అంత: చేతనలో లైంగిక వాంఛల్ని అణచుకుంటున్న సూచనలు కనిపిస్తున్నాయా? ఇటువంటి వర?నలే కాత్యాయిని, మరికొంతమంది ఈనవలికను తీవ్రంగా విమర్శించడానికి అవకాశం కల్పించాయని చెప్పక తప్పదు. మరికొంతమందైతే దీన్ని పురాగాథగానూ కీర్తించారు. గ్రామ దేవత కథనిలా చెప్పారనీ అన్నారు. మానవహక్కుల పోరాట నాయకులు, మానసిక వైద్యులు, రచయితలు, రచయిత్రులు, సామాన్య పాఠకులు ఇలా అనేకమంది పాఠకులను ఈనవలిక ఆకట్టుకోగలిగింది. ఇలాంటి చోట్ల మ్యాజిక్ రియలిజమ్ మోతాదు మించిపోయిందనిపించినా రచయిత లక్ష్యాన్ని సాధించారని చెప్పవచ్చు.

తాను భావించిన మూడు కోణాల్లోనూ రచయితగా డా॥కేశవరెడ్డు తాను విజయం సాధించారనుకోవచ్చు. రచయిత మాటల్లోనే దీన్ని ముగిస్తే "*మునెమ్మ ఒక అదుతేమైన పాత్ర. సమయస్ఫూర్తి, నిశిత పరిశీలన, బాధా సహిష్ణుత, పరేంగితావగాహన, సిన్నితత్త్వము, కాఠిన్యము కలగలిసిన పాత్ర* " గా తెలుగు నవలికా సాహిత్యంలో ఇదొక సంచలనం. మహిళా చైతన్య పరిణామంలో మునెమ్మ ఒక ధీరవనిత. మునెమ్మ పితృస్వామ్యంతో మాతృస్వామ్య చేస్తున్న సంఘర్షణకు ప్రతిరూపం. అందుకే దీన్ని ఎవరెన్ని రకాలుగా వ్యాఖ్యానించినా మునెమ్మ  లో మహిళాచైతన్యం ఉందనే నా ప్రతిపాదన. అయితే ఆ చైతన్యం మ్యాజిక్ రియలిజమ్ పద్ధతిలో వ్యక్తంచేశారు. రచనకు చిన్న కాన్వాస్ నే ఎన్నుకున్నా, శాశ్వతంగా గుర్తుండిపోయేలా చిత్రించారు. నవలా సాహిత్యంలో చైతన్య ప్రవంతి శిల్పాన్ని అనుసరించి నవీన్ రాసిన అంపశయ్యతెచ్చిన సంచలనం మళ్ళీ ఇన్నేళ్ళకిమునెమ్మనవలికకు దక్కింది. దీన్ని తెలుగులో మ్యాజిక్ రియలిజమ్ పద్ధతిలో ప్రయోగాత్మకంగా వచ్చిన మొదటి నవలికగా గుర్తించవచ్చు. ఆ విధంగా ఇదొక ప్రయోగాత్మక నవలిక.

***

# మహీధర నవలల్లో
# సమకాలీన సమస్యల కళాత్మక అభివ్యక్తి

పుట్టిందీ, పెరిగిందీ సనాతన సంప్రదాయ యజ్ఞ యాగాదులు చేసుకునే కుటుంబంలోనే అయినా, అభ్యుదయ భావాలతో జీవించి అనేక ఉ ద్యమాల్లో పాల్గొని, ఆ జీవిత సారాంశాన్ని అందిస్తున్నట్లుగా అనేక నవలలు రాసిన రచయిత మహీధర రామమోహనరావు.

మహీధర రామమోహనరావు సుమారు 15 నవలల్ని రాశారు. అనేక రచనల్ని అనువదించారు. 1954లో రథ చక్రాలుబీ 1956లో ఓనమాలుబీ 1957లో మృత్యువు నీడల్లోబీ 1959లో ఎవరికోసంబీ 1960 లో కత్తుల వంతెనబీ 1965లో కొల్లాయిగట్టితేనేమి? 1969లో స్వయంవరణంబీ 1972లో అగ్ని గుండంబీ 1984లో దేశం కోసంబీ 1993లో జ్వాలా తోరణం నవలల్ని గ్రంథ రూపంలో వెలువరించారు. రథ చక్రాలు నవల 1948లోనే రాసినా అది 1954కి గాని గ్రంథ రూపంలోకి రాలేదు. మిగిలిన రచనలు కూడా వివిధ పత్రికల్లో సీరియల్‌గా వచ్చినా, గ్రంథ రూపంలోకి రావడం మాత్రం ఆలస్యమైంది. వీటితో పాటు మబ్బు తెర, పరిష్కారము వంటి నాటకాల్ని కూడా రాశారు. మరికొన్ని అభ్యుదయ రచనలను అనువదించారు.

తన స్వగ్రామం ముంగండలో విశ్వసాహిత్యమాలను స్థాపించి, దాని ద్వారా మార్క్సిస్టు గ్రంథాలను అనువాదం చేసి, ఆ భావాల్ని ప్రచారం కల్పించేవారు. కమ్యూనిస్టు నిషేధ కాలంలో రాయలసీమలో రహస్య జీవితాన్ని గడిపారు. పీడితుల పక్షాన నిలబడిన మహీధర రామమోహనరావు తాను పుట్టి పెరిగిన ప్రాంతం కాకపోయినా, తెలంగాణాలో జరిగిన సాయుధ

పోరాటాన్ని సమర్థిస్తూ, ఆ చారిత్రక నేపథ్యాన్ని ఓనమాలు నవలలో ఎంతో విపులంగా రాశారు.

*"తూర్పు గోదావరి జిల్లాలోని ఒక విస్మృత ప్రాంతంలో తాను భాగస్వామిగా ఉండిన పరిణామాలు కేంద్రంగా స్వాతంత్రోద్యమ తీరుతెన్నుల్ని, ఆ ప్రాంత తెలుగు సమాజంలో కలిగిన సామాజిక చలనాన్ని స్వాతంత్రానంతరం కాలంలో మహీధర కొల్లాయి గట్టితేనేమి", "దేశం కోసం", జ్వాలా తోరణం" అనే నవలాత్రయంగా రచించార'*ని ఆ రచనల గురించి రాస్తూ ప్రముఖ విమర్శకుడు బి. సూర్య సాగర్ పేర్కొన్నారు.

కొల్లాయి గట్టితేనేమి" 1920 వ సంవత్సరంలో గాంధీ సహాయ నిరాకరణోద్యమ నేపథ్యాన్ని, దేశం కోసం" 1935–39 కాలానికి, జ్వాలా తోరణం" 1939–45 కాలానికి చెందిన ఇతివృత్తాలతో కూడిన నవలలు. ప్రపంచ యుద్ధ కాలంలో కమ్యూనిస్టుల పాత్ర, అంతర్జాతీయ ప్రభావం వంటి వన్నీ వీటిలో కనిపిస్తాయి. మరింత స్పష్టంగా చెప్పుకోవాలంటే, గాంధీ సంస్కరణ వాదం కొల్లాయి గట్టితేనేమి" లోనూ, కమ్యూనిస్టు పోకడల్ని దేశం కోసం" లోనూ, సామ్యవాద వాస్తవికతను జ్వాలా తోరణం" లోనూ ఆయన వివరించారు. కొల్లాయి గట్టితేనేమి"లో కథానాయకుడు రామనాథం ఆ సంస్కరణ భావాల ప్రభావంతో నాడు హరిజనుల్ని పిలిచే దళితులకు తన తోటలోని మంచినీటి బావిని తాగునీటి కోసం కేటాయిస్తాడు. రామనాథానికి, గాంధీ ఉ ద్యమం కోరేదేమిటో స్పష్టంగా తెలియక పోయినా, గాంధీ సంస్కరణ భావాల్ని ఆచరించే పాత్రగా కనిపిస్తాడు. ఈ నవల లక్ష్యాన్ని వ్యాఖ్యానిస్తూ బి. సూర్య సాగ?ర్ ఇలా అన్నారు.

*''కొల్లాయి గట్టితేనేమి"లో సంస్కరణ వాదము కేంద్ర దృక్పథంగా ఉన్నది. స్వాతంత్ర్య పోరాటంలో గాంధీ మార్గం యొక్క నిస్సారతను ఆ నవలలో పసికట్టడం కష్టమేమి కాదు. అయితే ఆ నిస్సారతను వెల్లడించడం మహీధర లక్ష్యం కాకపోవచ్చు అందువల్లనే మౌలికమైన మార్పుల్ని గాంధీ సంస్కరణ వాదం కలిగించ లేకపోయిందనీ, రామనాథం దళితులకు బావిని*

*కేటాయించినా, దానిపై హక్కుని సాధించలేక పోయారని స్పష్టంగా దీన్ని బట్టి తెలుస్తుంది. రామనాథం దళితులకు బావిని కేటాయించినా, దానిపై హక్కుని సాధించలేక పోయారని స్పష్టంగా దీన్ని బట్టి తెలుస్తుంది.*

*జ్వాలా తోరణం" నవల శోభాదేవి (మంగమ్మ) వర్ణనతో ప్రారంభమవుతుంది. ముంగండ సత్యనారాయణ కూతురు మంగాదేవి, బాల వితంతువు. అతడు ఆమెను మద్రాసు తీసుకెళ్ళి చదివిస్తాడు. పునర్వివాహాన్ని ప్రోత్సహించినా, కులాంతర వివాహాన్ని మాత్రం వ్యతిరేకిస్తాడు. వయొలిన్ నేర్చుకుని మంగమ్మ తన పేరుని శోభాదేవి"గా మార్చుకుంటుంది. ఆమె కుల, మతాంతరుడూ అయిన కుట్టన్ ను వివాహం చేసుకుంటుంది. ఈ నవలలో కులాంతర వివాహాలతో పాటు, వితంతు పునర్వివాహాల్ని చర్చలోకి తెచ్చారు రచయిత. ఈ మూడు నవలల్ని వరుసగా చదివితే రాష్ట్రంలో చారిత్రకంగా వచ్చిన, ముఖ్యంగా కోనసీమలో వచ్చిన సామాజిక పరిణామాలను, సంస్కృతిలో వచ్చిన మార్పులను అవగాహన చేసుకోవచ్చునని* విమర్శకుల అభిప్రాయ పడ్డారు.

దేశం కోసం" నవలలో కథానాయకుడు వెంకట్రామయ్య. వామపక్ష భావాలకు ఆకర్షితుడవుతాడు. కొంతమంది యువకులతో కలిసి గ్రామ సమస్యల పరిష్కారానికి కృషి చేస్తాడు. గ్రామంతో ప్రారంభించి, క్రమేపీ చుట్టు ప్రక్కల గ్రామాలు, తాలుకా, జిల్లా స్థాయి వరకు ఉద్యమాన్ని విస్తరిస్తాడు. గ్రంథాలయాలు, గురుపీఠాలు, యువజన సంఘాల ద్వారా ప్రజల్లో చైతన్యాన్ని మేల్కొలుపుతాడు. మతం పేరుతో జరిగే దోపిడీల్ని వెల్లడి చేసి ప్రజల్ని చైతన్య పరుస్తాడు. మత భావాన్ని విస్తృతంగా వ్యాప్తి చేసే రామానుజాచారిని కూడా ప్రజా సాహిత్యం సాంస్కృతిక కార్యక్రమాల వైపు దృష్టి మళ్ళించ గలుగుతాడు.

వెంకట్రామయ్య వివాహమైనా బతుకు తెరువు కోసం పది మందికి పాఠాలు చెప్తాడు. కానీ, తన లక్ష్యం మాత్రం సమ సమాజ స్థాపనే! అతడు తనకోసం, తన కుటుంబం కోసం ఆస్తి కూడ బెట్టక పోవటమే కాకుండా, సంతానం కూడా వద్దనుకుంటాడు. భార్య అన్నపూర?కు తెలియకుండా ఆపరెషన్

చేయించుకుంటాడు. అది భార్యకు తెలిసి ఇద్దరి మధ్య స్పర్ధలొస్తాయి. భార్యా భర్తలిద్దరూ విడిపోతారు. వ్యక్తిగత స్వార్థం కోసం కాకుండా, సమాజం కోసమే బతకాలనుకునే తన భర్త త్యాగాన్ని అర్థం చేసుకొని, ఆమె అతని దగ్గరకు చేరుకుందామనుకునేసరికి కమ్యూనిస్టు పార్టీపై నిషేధం విధిస్తారు. దీనితో నవల ముగుస్తుంది. కమ్యూనిస్టు ప్రాథమిక దశలో ఉద్యమకారులు పడిన కష్ట, నష్టాల్ని వారి వ్యూహాల్ని అర్థం చేసుకొని, ఆ సిద్ధాంతం లోటు పాట్లను గుర్తించడానికి ఈ నవల ఉపయోగపడుతుంది.

మానవ సంబంధాలలో స్వేఛనే ప్రతిపాదించటమే మహీధర నవలల్లోని రచనా ఉద్దేశ్యమని ప్రముఖ విమర్శకుడు ఆచార్య రాచపాళెం చంద్రశేఖర రెడ్డి వ్యాఖ్యానించారు. స్వయంవరణం నవల కులాంతర వివాహాన్ని చర్చిస్తుంది. పెళ్ళి చూపులు, తల్లిదండ్రులు కుదిర్చిన సంబంధాన్ని చేసుకుంటూ ప్రేమ" లేని జీవితాన్ని కొనసాగించటం కంటే ఒకరినొకరు అర్థం చేసుకొని జీవించగలిగే ప్రేమ వివాహాలే ఆదర్శనీయం అని చెప్తుంది. ఈ నవలలో పిత ృస్వామ్య ఈ వ్యవస్థకు చెందిన పెళ్ళి చూపుల్ని తిరస్కరించి సమ్ముఖం" పద్ధతిని ప్రవేశ పెట్టారు. యువతీ, యువకులు చదవడం వల్లనో, వ ృత్తి చేయడం వలనో ఒకరినొకరు పరిచయమై, ఒకరినొకరు అర్థం చేసుకుని, అభిప్రాయాలు పంచుకుని ప్రేమను పెళ్ళిలో పరవశింప చెయ్యడం సమ్ముఖం. ఈ పద్ధతి అభ్యుదయమైనదని రచయిత ప్రతిపాదన. సుధ బ్రాహ్మణ అమ్మాయి. కామేశ్వరరావు బ్రాహ్మణేతరుడు. ఇద్దరూ కాలేజీలో లెక్చరర్స్‌గా పనిచేస్తూ ప్రేమించుకొని పెళ్ళి చేసుకుంటారు. అలాగే రుక్మిణి బ్రాహ్మణేతర కులస్తురాలు. ప్రభాకరరావు బ్రాహ్మణుడు. ఈ రెండు జంటలూ ప్రేమ పయనంలో సమాజంలో జరిగే సంఘర్షణ అంతా స్వయం వరణం" చిత్రించి అంతిమ విజయం కుల రహిత ప్రేమ సమాజానికేనని తేల్చారు రచయిత.

శుభలేఖ నవల ప్రేమ కోసం తపించే లక్షణమున్నా దానికి తగిన చైతన్యం కొరవడితే కలిగే పర్యవసాలను చిత్రించింది. చంద్రశేఖర శాస్త్రి, సత్యవతి దంపతులు. వాళ్ళ సంతానం ఉమాదేవి, రామక్రిష్ణ. భాస్కరరావు

అనే యువకుడిని ఉమాదేవి ప్రేమించినా, ఆమె తన తండ్రిలోని సనాతన తత్వాన్ని పోగొట్టలేకపోతుంది. రామక్రిష్ణ వర్ణాంతర వివాహం చేసుకోవడంతో పాటు, తన చెల్లెలు ఉమాదేవి ప్రేమ వివాహం కూడా విజయవంతం కావాల్ని ఆశిస్తాడు. అయినా ఆమె ప్రేమ వైఫల్యం చెందడానికి సమాజంలో పాతుకుపోయినా సంప్రదాయ సంకెళ్ళు ఒక వైపు, ఆ సంకెళ్ళు మానసికంగా కనిపించినా అధైర్యం మరొక వైపు స్త్రీ స్వేఛను హరిస్తున్నాయని నిరూపించే దిశగా శుభలేఖ నవలా రచన కొనసాగింది.

తెలంగాణలో జరిగిన విప్లవ పోరాటాన్ని మూడు దశలుగా విభజించుకోవచ్చు. 1930 నుండి 1944 వరకు ఆంధ్ర మహాసభ పరిణామం చెందుతూ, భాషా సాంస్కృతిక ఉద్యమంతో పాటు రైతాంగ సమస్యలపై ఆందోళన, పోరాటం చేసే స్థితికి, ఆ తరువాత మిలిటెంటు ఉద్యమ స్థాయికీ అభివృద్ధి చెందిన మొదటి దశ నిజాం రెవిన్యూ పోలీసుల అధికారుల దౌర్జన్యాలు, దేశంలో భూ కబ్జాలకు వ్యతిరేకంగా పోలీసు, రజాకార్లను, ఎదుర్కొనటం, సాయుధంగా దున్నేవానికే భూమిని రైతాంగమే అమలు పరచుకుంటూ, గ్రామ రాజ్యాలను ఏర్పరచుకోవటం, ఈ దశలోనే 3000 గ్రామాలలో నిజాం ప్రభుత్వం లేకుండా స్థానిక స్వరూపాలను నెలకొల్పుకోవటం జరిగింది. ఇది 1944 నుండి 1948 సెప్టెంబర్ లో యూనియన్ సైన్యాలు పోలీసు యాక్షన్ పేరుతో ప్రవేశించే దాకా సాగింది.

ఇందులో రెండు సంవత్సరాలు సాయుధంగా సాగింది. దీన్ని రెండవ దశగా చెప్పుకోవచ్చు. మూడవ దశ భూమిని కాపాడుకొంటూ యూనియన్ సైనిక బలాన్ని ఎదుర్కొంటూ, గెరిల్లా రైతాంగ పోరాటం వరకు సాగినదశ మూడవది. అది 1948 నుండి 1951 వరకు సాగింది.

దీనిలో మొదటి దశకు చెందిన నవల ఓనమాలు. రచయితే దీనిలోని కథా వస్తువుని ఇలా వివరించారు. ''*..నాటి తెలంగాణ ఒక అగ్ని గుండం. దుస్సహనమైన జాగీర్దారీ వ్యవస్థను నిర్మూలించగల పోరాటాల్ని ప్రజానీకం కొనసాగిస్తుంది. వాటినన్నింటినీ ఒకే జెండా కిందికి తెచ్చి, రాజకీయ నాయకత్వం*

*సమకూర్చడానికై ఆంధ్ర మహా సభా, కమ్యూనిస్టు పార్టీ సన్నాహాలు సాగిస్తున్నాయి. రెండో వైపున విదేశీ పాలనకు, సంస్థానాధీశుల నిరకుశ పాలనకూ వ్యతిరేకంగా జాతీయ ప్రజాతంత్ర పోరాటాలు తెలంగాణాని అలుముకుంటున్నాయి. ఈ దశలో విచ్ఛిన్నమై పోతున్న జాగీర్దారీ వ్యవస్థను రక్షించగల శక్తి నిజాం ప్రభుత్వానికి లేదని గ్రహించిన భూస్వామ్య వర్గం, నూతన నాయకత్వం కొరకు వెతుకులాడుతూ జాతీయోద్యమంలో తనకు రక్షణ ఇవ్వగల శక్తుల్ని చూసుకుంది. సమాజంలో తనకున్న బలం క్రమంగా క్షీణించి పోతూంటే కూలిపోతున్న తన అధికారాన్ని పరిరక్షించు కొనేటందుకై మత వాదుల్ని, రౌడీల్ని సమీకరించి విధ్వంస కాండకు పూనికొంది నిజాం సర్కారు. ప్రజానీకానికీ, ప్రతి నిరోధక శక్తులకు మధ్య జరిగిన ఈ ఘర్షణలతో తెలంగాణా ఒక అగ్నిగుండమే అయ్యింది. ఆనాటి సంఘర్షణలే నాయీ నవలకు కథా వస్తువు".*

తెలంగాణా ప్రాంతంలో దొరలు ఒక కుటుంబానికి బంజరు భూమినిచ్చి, దాన్ని పంటపొలంగా వాళ్ళు బాగు చేసిన తర్వాత ఆ పొలాన్ని ఆ దొర కొడుకులు, మనవలు ఎలా లాగేసుకుంటారో, దాన్ని కాపాడుకోవడానికి ఆ పొలాన్ని ఆ దొర కొడుకులు, మనవలు ఎలా లాగేసుకుంటారో, దాన్ని కాపాడుకోవడానికి ఆ పొలాన్ని నమ్ముకున్న వాళ్ళెలా బాధ పడతారో ఓనమాలు నవలలో చెప్పారు రచయిత. సత్తెమ్మ, వాళ్ళమ్మ వీరమ్మ, రంగయ్యలు దీనిలో ఆ కుటుంబ సభ్యులు. ఆ కుటుంబానికి భూమినిచ్చి, మళ్ళీ దాన్ని లాక్కున్న కుటుంబం శివరామిరెడ్డి, ఆయన కొడుకులు రఘునందనుడు, రమణారెడ్డులు. దీన్ని ఆసరా చేసుకొని తెలంగాణా ప్రాంతంలో జరిగిన అనేక చారిత్రక సంఘటల్ని నవలలో చేర్చారు. చివరికి సత్తెమ్మ దొరలపై తిరగబడ్డంతో, వాళ్ళు పారిపోవడంతో నవల ముగుస్తుంది.

తెలంగాణ ప్రాంతంలో నైజాం ప్రభుత్వం, దాన్ని బూచిగా చూపి పోలీసులు, జాగీర్ధారులు, కొంతమంది ముస్లింలు చేసే అక ృత్యాలు, దుర్మార్గాల్ని అవగాహన చేసుకోడానికి "ఓనమాలు' నవల ఎంతగానో

సహకరిస్తుంది. అప్పుడు జరిగిన చారిత్రక సంఘటనలన్నీ సన్నివేశాలుగా, పాత్రలుగా రూపొందించటంలో రచయిత మహీధర రామ్మోహనరావు ప్రదర్శించిన సృజనశీలత ప్రశంసనీయం. ఒక కుటుంబంలో జరుగుతున్న కథనే చెప్తున్నట్లున్నా, ఆ సంఘటనల తీవ్రతను అదుతేంగా వరి?ంచి ఆ సమస్యల్ని ఒక కుటుంబానికే పరిమితమైనవి కాదని పాఠకుడు గ్రహించేటట్లు, ఆనాటి చారిత్రక సంఘటనల్ని అర్థం చేసుకునేట్లు నవల్ని అదుతేంగా కొనసాగించారు.

తెలంగాణలో ఉర్దూ, పారశీక భాషల ఆధిపత్యం మధ్య నలిగిపోయిన తెలుగు భాష "ఓనమాలు" నేర్చుకోవాలన్నా ఎలాంటి పరిస్థితి ఎదుర్కోవలసి ఉంటుందో దొంగబాటుగా "ఓనమాలు" పుస్తకాన్ని తెచ్చుకొని, సత్తెమ్మ చేసే బోళ్ల పోలంలో సంగం సభ్యులు రహస్యంగా చదువుకోవటం తెలుపుతుంది. ఆ పుస్తకం కూడ దొరల మనుషులు చింపేస్తుంటే కొన్ని కాగితాలు దాచుకున్నారట!

నాడు ఆంధ్ర మహాసభ కలిగించిన చైతన్యం విప్లవాత్మకమైంది. పేద వర్గాల సమస్యల్ని పోరాట పంథాలో భాగ?ం చేయగలగడం వల్ల మరింత శక్తివంతంగా సంగం" సామాన్య జన వ్యవహారంలోకి రాగలిగింది. చిలుకూరులో వెట్టి వ్యతిరేక తీర్మానం చేసినా, దాన్ని భువనగిరి మహా సభ కార్య రూపంలో పెట్టిన తర్వాత సంగం సామాన్య జనంలోకి చొచ్చుకుపోగలిగింది. అనేక ప్రాంతంల్లో జరిగిన వెట్టి వ్యతిరేక పోరాటాన్ని సంగం" ప్రోత్సహించింది. ఆ వార్తల్ని ప్రజాశక్తి పత్రికలో అందిస్తుంటే, వాటిని రహస్యంగా మరో వారం రోజుల తర్వాతనైనా చదివి చైతన్యం పొందే వారంటే సంగం, ఆ పత్రికలు తెచ్చిన చైతన్యం ఎంత గొప్పదో తెలుస్తుంది.

"సంగం" అన్ని కుల వృత్తుల వాళ్ళనీ ఐక్యం చేసి నిరరేధ చాకీరి నుండి విముక్తి కలిగించాల్ని ప్రయత్నించింది. సంగం" సభ్యుల మీద ఎన్ని నిషేధాలు ఉన్నా చాకలి మంగమ్మ వంటి వాళ్ళు ఆ నాయకుల్ని కాపాడేవారని తెలుస్తుంది. ఆ నాయకులు కూలీ రాజ్యం వస్తుందనే వారు. అప్పుడు అణగారిన

వర్గాల వారే పాలకులవుతారని, వారి సమస్యల్ని వాటి పరిష్కారాల్ని వారి చేతనే చెప్పించటం వలన సంగం సభ్యులు ఎలాంటి కార్య చరణను కొనసాగించే వారో అర్థమవుతుంది.

వెంకటయ్యను సత్తెమ్మ రెండో పెళ్ళి చేసుకోవాలనుకోవటం సావిత్రి తల్లి, అనసూయమ్మ, ముంతాజ్ వంటి స్త్రీల అక్రమ సంబంధాలు విషయంలో నాటి పాలకుల, ప్రజల విధానాల్ని, ఆకాంక్షల్ని అర్థం చేసుకోవచ్చు. బుడాన్ పొద్దున్నుండి రాత్రి వరకు అనసూయమ్మ ఇంటి దగ్గరుండి, ఓ దొర నరిసిరెడ్డి లాగేసుకున్న యాభైయ్యేకరాల భూమిని మళ్ళీ స్వాధీనం చేసుకోవడానికి ఖాసీం రజ్వీ అనుయాయీ, పెద్ద జాగీర్దార్ ఖాజీ మహమ్మద్ రసూల్‌తో మాట్లాడానని చెప్పి, అత్తా కోడళ్ళను మోసగించి కోడల్ని శారీరకంగా అనుభవించే సంఘటల్ని చదివినప్పుడు, ప్రజలెలా మోసపోయేవారో అర్థమవుతుంది. నాడు ప్రభుత్వం, కోర్టులు, చట్టం, పట్టించుకోని భూవ్యాజ్యాల్ని పరిష్కరించుకోవటానికి అక్రమ" సంబంధాల్ని కూడా తప్పనిసరి పరిస్థితుల్లో అంగీకరించవలిసి వచ్చేదని, అది ప్రజలక తెలిసి పరువు, ప్రతిష్ఠల్ని కోల్పోవలసి వచ్చేదని స్పష్టమవుతుంది.

వ్యక్తిగతంగా హిందూ – ముస్లింల మధ్య కుటుంబాల్లో కలిసి మెలిసి ఉండే సంబంధాలున్నా, నైజాం నవాబుల పాలనలో హిందువుల పట్ల నిర్లక్ష్యం, ఖాశీం రజ్వీ పోషించే రజాకారుల దురాగతాల వల్ల ముస్లింలంతా వ్యవస్థీక ృతంగా హిందువుల్ని వ్యతిరేకించే భావన కలిగించగలిగే వారని తెలుస్తుంది. అది ముస్లిం అయినా ముంతాజ్ ఇంటికి సత్తెమ్మ వెళ్ళటం, ఆమె ఇంటికి వెంకటయ్య రావటం, బుడాన్ ఆజాద్ – హైదరాబాద్" ప్రచారం వంటివన్నీ స్పష్టం చేస్తున్నాయి. తెలంగాణాలో నైజాం ప్రభుత్వం ఢిల్లీ పాలకులతో, అసాంఘిక శక్తులతో సంబంధాలు పెట్టుకొని రహస్యంగా ఆయుధాల్ని దిగుమతి చేసుకుంటూ, వాటిని అన్ని ప్రాంతాల్లో హిందువులపై జరిగే అల్లర్లలో ఉపయోగించుకోవడానికి సహకరించేదని తెలుస్తుంది.

అలాంటి ఆయుధాల్ని వెంటబెట్టుకుని కొంతమంది లారీల్లో

ఊరేగింపుగా వచ్చి, జనాన్ని భయ భ్రాంతులకు గురి చేసి, ముసలి వాడ్ని చంపేస్తారు. కారుతున్న రక్తం చూసి, అతడు చనిపోయాడని గమనించి, ఊరేగింపు చేస్తున్నవాళ్ళు పారిపోతారు. ఊళ్ళో ప్రజలు వాళ్ళు పారిపోతున్నారని తెలిసి, ముసలివాడి దగ్గరకు వస్తారు. వాళ్ళని చూసి వచ్చిన వాళ్ళంతా పారిపోతారు. అలాగే అంతకు ముందు కూడా సత్తెమ్మ కర్ర తీసుకుని బోళ్ళబావి పొలాన్ని స్వాధీనం చేసుకోబోతున్న దొర మనుషుల్ని కొట్టడానికి వెళ్ళినపుడు కూడా ప్రజలు చాలా మంది తిరగబడాలనే  ఉద్దేశంతో వెళ్ళిన వారు కాదు. అయినా గుంపులుగా వస్తున్న మనుషుల్నీ చూసి వాళ్ళు పారిపోయారు. కాబట్టి స్థానిక ప్రజల్లో దొరలు నైజాం ప్రభుత్వం, పోలీసులు పట్ల భయం ఉన్నా అవకాశం వస్తే తిరగబడాలనే ఆకాంక్షే ఉందని స్పష్టమవుతుంది. అదే పద్ధతి ముగింపులోనూ కనిపిస్తుంది.

తెలంగాణాలో సాయుధ పోరాటం జరగడానికి వెనక ఎంతో నేపథ్యం ఉంది. సాయుధ పోరాటం ఒక్కసారిగా ఎగిసి పడలేదు. ప్రజల కష్టనష్టాల నుండి వచ్చింది. పాలకుల, పాలకుల ఉదాసీన వైఖరి వల్లా, పాలకులను ఆశ్రయించుకున్న హిందు జాగీర్దారీ పీడనను అవగాహన చేసుకోవాలంటే ఓనమాలు నవల చదివి తీరాల్సిందే.

తెలంగాణా సాయుధ పోరాటం జరగడానికి సమాజంలో స్పష్టంగా వర్గాలుగా విడిపోయిన పరిస్థితి కనిపిస్తుంది. భూస్వాములు, ఉన్నంత వర్గం, మధ్య తరగతి, పేద వర్గంగా వాళ్ళు విడిపోయారు. కులం, వారి వృత్తులతో సంబంధం లేకుండా అందరూ ఒకే రకమైన పీడనను అనుభవించినట్లు నవలలో కనిపిస్తుంది. బహుశా, కుల సమస్య ఉన్నా, పీడన ప్రధానమైనప్పుడు దాన్నుండి రక్షించుకోవడానికి కొన్ని కులాలు ప్రయత్నించేవని కూడా అర్థమవుతుంది. అయితే రచయిత మాల, మాదిగలను ముస్లింలుగా మార్చుకోవడాన్ని మరోలా వివరించే ప్రయత్నం చేశారు. సిలారు ముస్లిం అయినా, హిందువుల పట్ల బుడాన్ లాంటి ద్వేషం ఉన్నవాడు కాదు. బుడాన్ ఒకసారి పందినీ, ఒక హిందువునీ చంపిన వాడు. ఆ తర్వాత ఖాసీం రజ్వీ ముఠాలో చేరినవాడు.

ఆ దుర్మార్గం చూసిన తర్వాత బుడాన్‌ని తన అల్లుడుగా సిలార్ అంగీకరించలేదు. అలాంటి బుడాన్, ఒకరోజు సమాజ్ చేసుకొనే సమయంలో సిలార్ దగ్గర కొచ్చి ముస్లింల స్థితిగతుల గురించి వివరిస్తాడు. నిజాం నవాబుల పాలననూ, ఖాసీ రజ్వీసేనల అవసరాన్నీ చెప్తున్న సందర్భంలో రచయిత ఇలా వ్యాఖ్యానిస్తాడు.

*"సిలారుకు అవన్నీ తెలీదు, పల్లెటూళ్ళలో మాల మాదిగలకు ఇతర దళిత జాతులకూ తురక మతం ఇప్పించి వారిని ఇతర కులాల మీదికి ఎగతోలేటందుకే ఖాజీ తీవ్రమైన వుద్యమం సాగిస్తున్నాడు. ఆ విధంగా మతం మార్చుకున్నవాళ్ళ మీద పెద్ద కులాల వాళ్ళు ఆర్థిక ఆంక్షలు ప్రయోగించి లొంగదీసుకుంటున్నారు. ఆర్య సమాజం వారి ద్వారా వారిని శుద్ధి చేస్తున్నారు. ఖాజీ ముస్లిం మత ప్రచారానికి తీసుకున్న శ్రద్ధ మూలంగానే ఆయన భూముల్ని రైతులు వదలకుండా చేయిస్తున్నారని బుడన్ చెప్పేడు."* (ఓనమాలు, తృతీయ ముద్రణ, 1980:163) కులం చేత సమాజంలో అవమానాలు ఉన్నా, రచయిత ఆ కోణం నుండి చూడడం కంటే, వర్గ దృక్పథంతోనే వివరించే ప్రయత్నం చేశాడు.

ప్రముఖ విమర్శకుడు దివికుమార్ ఒక వ్యాసంలో వ్యాఖ్యానించినట్లు బ్రిటీషు వలస వాదులు వ్యతిరేకంగా సాగిన జాతీయోద్యమ విభిన్న దశలను, పరిణామాలను, తొలి కమ్యూనిస్టు ఉద్యమ కృషినీ, వీరోచిత తెలంగాణా రైతాంగ సాయుధ పోరాట నేపథ్యాన్ని, పోరాటాన్ని, కోస్తా జిల్లాలలో జమిందారీ వ్యతిరేక పోరాట కాలం నాటి రాజకీయ ఉద్యమ సంఘర్షణాత్మక చరిత్రను మహీధర రామ మోహనరావు అక్షర బద్ధం చేయడంలో ఎంతగానో కృతకుత్యులయ్యారు. ఆ చరిత్రను, సామాజిక, ఆర్థిక, రాజకీయ విషయాలను సులభంగా అర్థం చేసుకోవడానికి ఆయన రచనలు ఎంతగానో సహకరిస్తాయనడంలో సందేహం లేదు.

***

# ఆధార గ్రంథాలు

ఇనాక్, కొలకలూరి, **ఆధునిక విమర్శ సూత్రం.**
మారుతి బుక్ హౌస్, గుంటూరు. 1996

క ృష్ణమూర్తి, భద్రిరాజు. **తెలుగు భాషా చరిత్ర.** హైదరాబాదు : తెలుగు విశ్వవిద్యాలయం, 1995.(ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, ప్రథమ ముద్రణ 1974)

కేశవ రెడ్డి. *అతడు అడవిని జయించాడు, మూగవాని పిల్లనగ్రోవి.* ఆర్మూర్: నందిని పబ్లికేషన్స్. 2003

కేశవ రెడ్డి. **అతడు అడవిని జయించాడు,** హైదరాబాదు బుక్ ట్రస్ట్, 2009

కేశవ రెడ్డి. **అతడు అడవిని జయించాడు.** హైదరాబాదు: రీతిక పబ్లికేషన్స్. 1985.

గౌరీశ్వర రావు, కొంకే. 2007, **తెలుగులో దళిత పత్రికలు–పరిశీలన.** (ఎం.ఫిల్ అముద్రిత పరిశోధన వ్యాసం) హైదరాబాదు విశ్వ విద్యాలయం: హైదరాబాదు.

చిన్నారావు, యాగాటి. 2007, **ఆంధ్రప్రదేశ్ దళిత ఉద్యమ చరిత్ర** (1900–1950). హైదరాబాదు బుక్ ట్రస్ట్ ప్రచురణ: హైదరాబాదు.

తెరేష్ బాబు, పైడి. *అల్పపీడనం.* హైదరాబాదు: స్వీయప్రచురణ, 1996.

రవికుమార్, దార్ల. **ఆధునిక తెలుగు కథల్లో ప్రాంతీయ చైతన్యం,** పిహెచ్.డి., సిద్ధాంత గ్రంథం, (అముద్రితం), హైదరాబాదు విశ్వవిద్యాలయం, 2006

రాజశేఖర్, పట్టేటి., నాగప్పగారి సుందర్ రాజు (సం.) **గుండెడప్పు (కవితాసంకలనం).** హైదరాబాదు: దళిత సాహిత్య వేదిక ప్రచురణ, 1995.

రాజు, ఎన్.ఎస్. (సం.) **నడుపల్లి పాఠశాల నిఘంటువు**.
హైదరాబాదు: శ్రీ సత్య. ఎన్ ప్రచురణలు, 2005.
రాజు, మద్దెల, **మాస్టార్జీ దళిత గీతాలు: మూల వాసుల సిద్ధాంతం,** ఎం.ఫిల్., పరిశోధనా వ్యాసం, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, బొమ్మూరు. 1998
రామరాజు, బిరుదురాజు. (సంపాదకులు) 1988, **విజ్ఞాన సర్వస్వం (తెలుగు సంస్కృతి-2)** తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ: హైదరాబాదు.
లక్ష్మణరెడ్డి, వి. 2002, **తెలుగు జర్నలిజం అవతరణ వికాసం**.
రచనా జర్నలిజం కళాశాల ప్రచురణ: హైదరాబాదు.
లక్ష్మీనరసయ్య. జి., త్రిపురనేని శ్రీనివాస్. (సం.) **చిక్కనవుతున్న పాట.**
విజయవాడ: కవిత్వం ప్రచురణలు, 1995.
విల్సన్ సుధాకర్, తుల్లిమల్లి. దళితవ్యాకరణం.హైదరాబాదు: విజయభారతి పబ్లికేషన్స్, 2007.
వెంకటసుబ్బయ్య, వల్లంపాటి. **నవలా శిల్పం,** విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, 1994 ( ప్రథమ ముద్రణ: 1998)
వెంకటేశ్వరరావు, దార్ల. **పరిశోధకుడిగా ఆరుద్ర,** , పిహెచ్.డి., సిద్ధాంత గ్రంథం, (అముద్రితం), హైదరాబాదు విశ్వవిద్యాలయం, 2003
వెంకటేశ్వరరావు, పొత్తూరి. 2004, **ఆంధ్రజాతి అక్షర సంపద తెలుగు పత్రికలు.** ఆంధ్రప్రదేశ్ ప్రెస్ అకాడమీ ప్రచురణలు: హైదరాబాదు.
సంజీవదేవ్. **సింహావలోకనం**. (ముందుమాట, అతడు అడవినిజయించాడు), హైదరాబాదు: రీతిక పబ్లికేషన్స్. 1985.
సత్యనారాయణ, ఎస్వీ. (సంపాదకత్వం) 2000, **దళిత వాద వివాదాలు.**విశాలాంధ్ర ప్రచురణ: హైదరాబాదు.
సుజాతారెడ్డి, ముదిగంటి. (సంపా.) **ముద్దెర** (తెలంగాణ ప్రాంతీయ

సాహిత్య అస్తిత్వ సాహిత్య విమర్శ) వ్యాసాలు, రోహణమ్ పబ్లికేషన్స్, హైదరాబాద్, 2005
సుధాకర్ ఎండ్లూరి. **కొత్తగబ్బిలం** (దీర్ఘకావ్యం), రాజమండ్రి: మానస ప్రచురణలు, 1998.
సుధాకర్. ఎండ్లూరి. **నల్లద్రాక్షపందిరి** darlky(ఉభయ భాషా కవిత్వం) సికింద్రాబాదు: జె.జె. ప్రచురణలు, 2002.
సుబ్రహ్మణ్యం శర్మ, పురాణం. **కరక్కాయ పీఠిక.** (ముందుమాట, అతడు అడవిని జయించాడు) హైదరాబాదు: రీతిక పబ్లికేషన్స్. 1985.
హైమావతి. 1978, **పాలేరు నుంచి పద్మశ్రీ వరకు బోయి భీమన్న.** సన్మాన సంఘ ప్రచురణ: హైదరాబాదు.

ఆంగ్ల గ్రంథాలు:

Hemingway,Ernest. 'The Old Man And The Sea'. Penguion Books(N.Z.)Ltd, New Zealand.1952.
Illustrated Oxford Dictionary, Oxford University Press, 2007.
Judith Grant, Fundamental Feminism: Contesting the Core concepts of Feminist Theory, Routledge, 1993
Samir Das Gupta : The changing face of Globalization, 2005

Webliography:

http://en.wikipedia.org/wiki/Neologism
http://www.is.cs.cmu.edu/trl_conventions/neologisms.html
http://www.eemaata.com/em/issues/200107/675.html

# రచయిత
# డా. దార్ల వెంకటేశ్వరరావు
## పరిచయం

శ్రీమతి పెదనాగమ్మ, లంకయ్య దంపతులకు తూర్పుగోదావరి జిల్లా, చెయ్యేరు అగ్రహారంలో జన్మించిన వెంకటేశ్వరరావు, కోనసీమలోనే ప్రాథమిక విద్యను అభ్యసించారు. శ్రీబానోజీరామర్స్ కళాశాల, అమలాపురం (1995)లో ఇంటర్మీడియట్ నుండి బి.ఏ., ( స్పెషల్ తెలుగు) వరకు చదువుకున్నారు.

యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు (సెంట్రల్ యూనివర్సిటి)లో ఎం.ఏ., తెలుగు (1997)బీ ఎం.ఫిల్., ( 1998)బీ పి హెచ్.డి., (2003) చేశారు. ఆచార్య ఎస్.శరత్ జ్యోత్స్నారాణి గారి పర్యవేక్షణలో జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన పేరు చేసిన పరిశోధనకు ఎం.ఫిల్.బీ "పరిశోధకుడుగా ఆరుద్ర ' పేరుతో చేసిన పరిశోధనకు పిహెచ్.డి., పట్టాలను అందుకున్నారు. నిజాం కళాశాల (ఉస్మానియా విశ్వవిద్యాలయం)లో సంస్కృతంలో డిప్లొమా (1997), తెలుగు లింగ్విస్టిక్స్ అండ్ లాంగ్వేజ్ టీచింగ్ లో పి.జి.డిప్లొమా ని పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం (2000) లో చేశారు. వీటితో పాటు డా.బి.ఆర్.అంబేద్కర్ సార్వత్రిక విశ్వవిద్యాలయం (2005) లో ఎం.ఏ., (సోషియాలజీ) చేశారు.

ఆంధ్రవిశ్వవిద్యాలయం పరిధిలో బి.ఏ., స్పెషల్ తెలుగు ఫస్ట్ర్యాంకు సాధించిన వారికిచ్చే కళాప్రపూర్ణ జయంతి రామయ్య పంతులు స్మారక బహుమతిని, కందుకూరి వీరేశలింగం, శ్రీమతి రాజ్యలక్ష్మి స్మారక బహుమతుల్ని అందుకున్నారు. వీటితో పాటు శ్రీ కోనసీమ భానోజీరామర్స్ కళాశాల వారు కాలేజీ ఫస్ట్ వారికిచ్చే నండూరి వెంకటరామయ్య, కుటుంబలక్ష్మి స్మారక బహుమతుల్ని సాధించారు.

విద్యార్థిగా మెరిట్ స్కాలర్ షిపూతో పాటు, యు.జి.సి., రీసెర్చ్ ఫెలోషిప్‌ని పొందారు. పరిశోధన చేస్తుండగానే ప్రభుత్వ , డిగ్రీ కళాశాలల్లో పోటీ పరీక్ష ద్వారా ఏకకాలంలో (2001) అధ్యాపకుడుగా ఎంపికయ్యారు.

విద్యార్థి దశ నుండే వివిధ పత్రికల్లో కవితలు, వ్యాసాలు రాసే అలవాటున్న

వెంకటేశ్వరరావు, హైదరాబాదు సెంట్రల్‌యూనివర్సిటీలో చేరిన తర్వాత ఆకాశవాణి, హైదరాబాదు కేంద్రం, యువవాణి విభాగంలో కొంతకాలం పాటు క్యాజువల్ (క్యాంపియర్) ఎనౌన్సర్‌గా పనిచేశారు. ఆ నాటి నుండి నేటి వరకు ఆకాశవాణిలో అనేక కవితలు, సాహితీప్రసంగాలు చేస్తున్నారు. పరిశోధన విద్యార్థిగా ఉన్నప్పుడే సివిల్ సర్వీసెస్ అభ్యర్థులకు తెలుగు సాహిత్యంలో శిక్షణనిస్తూ, దూరదర్శన్‌లో కూడా ప్రసంగాలిచ్చారు.

వివిధ విశ్వవిద్యాలయాల్లో జరిగిన జాతీయ సదస్సుల్లో సుమారు 32 పరిశోధన పత్రాలను సమర్పించారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి "వ్యాయి", తెలుగు అకాడమీ వారి " తెలుగు వైనిక మాసపత్రిక", ద్రావిడ విశ్వవిద్యాలయం వారి 'ద్రావిడి' వంటి పరిశోధన పత్రికలు, ప్రత్యేక సంచికలు, దినపత్రికల్లో సుమారు 45 పరిశోధన, విమర్శ పత్రాలు ప్రచురితమైయ్యాయి.

ఇప్పటివరకు కవిత్వం, విమర్శ, పరిశోధనలకు సంబంధించి పది పుస్తకాలను ప్రచురించారు. *మాదిగచైతన్యం (1997) సంపాదకత్వం, సాహితీ మూర్తుల ప్రశస్తి ( 1998) సహ సంపాదకత్వం, జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన(1999) పరిశోధన, దళితతాత్త్వికుడు (2004) కవిత్వం,సృజనాత్మక రచనలు చేయడం ఎలా? ( 2005) విమర్శ, సాహితీసులోచనం (2006) విమర్శ, ఒక మాదిగస్మృతి -నాగప్పగారి సుందర్రాజు ( 2007) మోనోగ్రాఫ్, దళితసాహిత్యం: మాదిగదృక్పథం (2008) విమర్శ, వీచిక (2009) విమర్శ, పునర్మూల్యాంకనం (2010) బహుజనదృ క్పథం, (2012 "సాహితీమూర్తులు-స్ఫూర్తులు'* (2015) మొదలైన గ్రంథాల్ని ప్రచురించారు. మరో మూడు గ్రంథాలు ప్రచురణలో ఉన్నాయి. ఈయన కవిత్వం త్వరలో ఆంగ్లం, కన్నడ భాషల్లో వెలువడనుంది.

డా॥వెంకటేశ్వరరావు పర్యవేక్షణలో ఇప్పటి వరకు పదహారు మంది ఎం.ఫిల్.,పరిశోధనలు పూర్తిచేశారు. నలుగురు డాక్టరేట్ పట్టాలను ఈయన పర్యవేక్షణలో అందుకున్నారు. ప్రస్తుతం ఈయన పర్యవేక్షణలో తొమ్మిది మంది పిహెచ్.డి., పరిశోధనలు చేస్తున్నారు.

చిన్ననాటి నుండే సాహిత్యాభిలాష గల వెంకటేశ్వరరావు వ్యాస రచన

సోటీలో భారతీయ సాహిత్య పరిషత్ రాజమండ్రిలో జరిగిన రాష్ట్ర మహాసభల్లో రాష్ట్రస్థాయి ప్రథమ బహుమతి (1996)ని అందుకున్నారు. సాహిత్యానికి ఈయన చేస్తున్న కృషికి గుర్తింపుగా భారతీయ దళిత సాహిత్య అకాడమీ, న్యూఢిల్లీ వారు 2007లో డా॥బి॥ఆర్॥ అంబేద్కర్ పురస్కారంతో సత్కరించారు.

*బహుజన కెరటాలు, విద్య* మాసపత్రికలకు సంపాదక వర్గ సభ్యులుగా, మాదిగసమాచారలేఖ మాసపత్రిక కు గౌరవసంపాదకులుగా, సొసైటీ అండ్ ఎడ్యుకేషన్ ట్రస్టు సలహాదారుగా ఉన్నారు. జ్యోత్స్నా కళాపీఠం, తెలుగు సాహిత్య వేదిక, మాదిగ సాహిత్య వేదిక వంటి సాహిత్య సాంస్కృతిక సంస్థల్లో కార్యవర్గసభ్యుడుగా పనిచేశారు.

ఆచార్య పరిమిరామనరసింహం గారి సూచనలతో యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదులో ఎం.ఏ., తెలుగు విద్యార్థులకు "దళితసాహిత్యం" ఒక ఆప్షనల్ కోర్సుగా పఠ్య ప్రణాళికను రూపొందించి 2005 నుండీ బోధిస్తున్నారు. వీటితో పాటు తెలుగు సాహిత్య విమర్శ, సౌందర్యశాస్త్రం, తులనాత్మక కళాతత్త్వశాస్త్రం కోర్సులను బోధిస్తున్నారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు వారు దూరవిద్య ద్వారా బోధించే జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్స్ కోర్సు పి.జి. డిప్లొమా విద్యార్థులకు రెండు పాఠాలను రాశారు. యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదులో ఐదు సంవత్సరాల ఎం.ఏ. కోర్సు (ఇంటిగ్రేటెడ్ మాస్టర్స్ డిగ్రీ) తెలుగు విభాగం కోర్డినేటర్గా సేవలందించారు.

ప్రస్తుతం యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాదు, తెలుగు శాఖలో అసోసియేటు ప్రొఫెసరుగా పనిచేస్తున్నారు. గతంలో ఈయన "తెలుగు సాహిత్యంలో మాదిగల సామాజిక, సాంస్కృతిక అధ్యయనం" అనే అంశంపై యు.జి.సి వారి మేజర్ రీసెర్చ్ ప్రాజెక్టుని పూర్తిచేశారు. ప్రస్తుతం "గుర్రం జాషువ పదప్రయోగకోశ నిర్మాణం" వంటి ప్రాజెక్టు చేస్తున్నారు.

